# మాఘ పురాణము

[ వచన కావ్యం ]



ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్

సంస్కృతాంధ్ర బుక్‌డిపో. (స్థా. 1882) రాజమండ్రి.



శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరాయనమః

# మాఘ పురాణము

## ప్రథమాధ్యాయము

ఈ భూమండలమున ప్రసిద్ధిపొందిన సప్తద్వీపములు గలవు. వాటిలో ప్రఖ్యాతిపొందినది జంబూ ద్వీపము. ఈ జంబూద్వీపమున భరతఖండము మేరుపర్వతమువలె ప్రకాశించుచుండెను. అందు ఆర్యావర్తమను పుణ్యభూమి గలదు. అందులో మహా ప్రఖ్యాతి పొందిన నర నారాయణులు తపంబుచేసిన బదరికావనంబు గలదు. అందు గోమతియను పుణ్యనది గట్టున, యజ్ఞశాలను నిర్మించుకుని, పంద్రెండేండ్లకు సమాప్తమగు మహా యజ్ఞమును, ప్రారంభము జేయుటకు లోకమునందలి వేదాధ్యయన సంపన్నులైన, అసితుడు, దేవలుడు, సుమంతుడు, పైలుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, భృగువు, పర్వతుడు, అగస్త్యుడు, ఆపస్తంభుడు, మాండవ్యుడు, అంగీరసుడు, కపిలుడు, శైభ్యుడు, ముద్గలుడు, గౌతముడు, కణ్వుడు, అత్రి, కౌండిన్యుడు. కాణాదుడు, గర్గుడు, కౌశికుడు, గాలవుడు, వ్యాసుడు, శక్తి, పరాశరుడు, శని, విభాండకుడు, బుధుడు, వసువు, జమదగ్ని, భరద్వాజుడు, భార్గవుడు, శౌనకుడు, నారదుడు, శతానందుడు, విష్ణువృద్ధుడు, జరత్కారుడు, ఉద్దాలకుడు, ఏకపాదుడు, ద్విపాదుడు, ఊర్ధ్వబాహువు, మంత్రవిదుడు, శ్వేతబాహువు, మొదలగు మహా ఋషులు ముఖ్యులు.

ఇట్టి బ్రహ్మతేజోమూర్తులును, ఆమూలాగ్రముగా వేదాము లను చదివినవారును, త్రికాలజ్ఞానులును, పరోపకారులును, లోకము నకు మేలు చేయుటయందు ఆశక్తి గలవారును, జపములు, యజ్ఞ ములు, శ్రద్ధగా జేయువారును, అయిన మహా ఋషులందరును, తమ తమ శిష్యులతోను, శిష్యుల శిష్యులతోను వచ్చి యజ్ఞమును ప్రారం భము జేసిరి.

ఆ కాలమునందు, పురాణకథలు జెప్పుటయందు మిక్కిలి సమ ర్థుడైన సూతుడు, శిష్యులతో రాగా, మునులందరు అతనిని జూచి, జడలు, నారచీరలు ధరించి, మేలైన అర్ఘ్యముల నెరుగుటయందలి నేర్పును, మంచి గుణములును, సంతోషముగల ముఖలక్షణమును, దేహమంతటను, భస్మధారణమును, నొసట త్రిపుండ్ర ధారణమును, మెడను రుద్రాక్ష దండలును, జితేంద్రియుండును, భూత దయగల వాడును, సత్వగుణప్రధానుండును, వ్యాసానుగ్రహము పొంద లోక ములో పూజింపదగిన వాడును, వేదోక్తములైన ఆచారములు గల వాడును, అయిన సూతుంజూచి, అతిథ భక్తితో సత్కరించి సింహాసనం బిచ్చిన సూతుండు చేతులు జోడించి అందరకు నమస్కరించి ఆస నంబున గూర్చుండెను.

పిమ్మట శౌనకాది మహా ఋషులందరును తమతమ ఆసనంబుల గూర్చుండిరి. అంతట శౌనకాది మహామునులందరును, అతనిని జూచి ఓ యుగ్రశ్రవుడా! మేమందరమును నీవలన,

మ. భువి బ్రహ్మాండము వామనంబు గరుడంబున్ స్కాంద మున్ గూర్మభా॥ గనతాగ్నేయ రమాత్స్య లైంగములు మార్కండే యమున్ పాద్మవైష్ణవ శైవంబులు నారదీయము భవిష్యద్బ్రహ్మకై వర్తదివ్య వరాహంబులునుం బురాణములు ముయ్యారమ్యె విప్రో త్తమా॥ అనగా?

౧. బ్రహ్మము ౨. పాద్మము ౩. వైష్ణము ౪. శైవము ౫. భాగవతము ౬. భవిష్యత్తు ౭. నారదీయము ౮. మార్కండే

యము ౯. ఆగ్నేయము ౧౦. బ్రహ్మకైవర్తము ౧౧. లింగము ౧౨. వరాహము ౧౩. స్కాంధము ౧౪. వామనము ౧౫. కూర్మము ౧౬. మాత్స్యము ౧౭. గారుడము ౧౮. బ్రహ్మాండము అను ఈ పదునెనిమిది పురాణంబులును ఏబదిరెండువేల గ్రంధ సంఖ్యగలిగి విను వప్పుడు దేహముపులకరించి మహానందము గలుగుచుండును.

అందు పద్మపురాణాదులందు మాఘమాస మహాత్మ్యమును కొంత వింటిమి. అది యిప్పుడు మరపునకు వచ్చినది. గనుక దానిని మాకందరకును విపులముగా వినవలయునని కోరిక గలిగియున్నది. మాఘమాసంబును సమీపించుచున్నది. కాబట్టి మాఘమాస మహాత్మ్యమును మాకు సవిస్తరముగా జెప్పవలసినదని కోరిరి,

పౌరాణికుడైన సూతుడు వారి పలుకులు విని ఓ మునివరులారా! మీరు మంచి విషయమును కోరితిరి. బాగుగనున్నది. మీకు మాఘపురాణమును వినిపింపవలయునని యెంచి నేనిచ్చటికి వచ్చియున్నాను. మీరును మాఘపురాణమునే వినవలయునని కోరితిరి. కాబట్టి శ్రద్ధతో వినుడు. నారాయణాంశమున బుట్టిన వ్యాసమహాఋషి యనుగ్రహము వలనను, లక్ష్మీగణపతి అనుగ్రహము వలనను శ్రీదేవి వాగీశ్వరీ వర ప్రసాదముచేతను మీరడిగిన కథను విపులముగా జెప్ప గలను. అని దేవతా గురువందనములు గావించి యిట్లని జెప్పుటకు ప్రారంభము జేసెను.

ఓ మునికులవృద్ధులారా! వినుడు. ప్రతి సంవత్సరములోను పది రెండు మాసములు వచ్చుచుండును. వాటిలో నాలుగు మాసములు హరి హరాదులకు బహు ప్రీతికరములు. వాటిని జెప్పెదను. ౧. కార్తీక మాసము. ఉద్థానఏకాదశి, చిలుకులద్వాదశి, కృత్తికా నక్షత్రయుక్త పూర్ణిమ మొదలగు పర్వములు వచ్చుటచేత కార్తీకమాసమున్ను, ౨. మాఘమాసము, సూర్యజయంతి, రథసప్తమి, భీమఏకాదశి, భీష్మ ఏకాదశి, మఖా నక్షత్ర యుక్తపూర్ణిమ, బహుళ చతుర్దశి, మహాశివ

రాత్రియు గలవు. గాన మాఘమాసమున్ను, 3. వైశాఖమాసము, 'ఋతునాం కుసుమాకరే' అని శ్రీ మహావిష్ణువు చెప్పియుండుటచేత వైశాఖమాసము విష్ణుస్వరూపముగాన వైశాఖమాసమున్ను, 4. ఆషాఢ మాసము. శయనఏకాదశి, వ్యాసపూర్ణిమ, చాతుర్మాస్యలకు ప్రారంభముగాన ఆషాఢమాసమున్ను, ముఖ్యములు. వాటిలో మీరడిగిన మాఘమాస స్నాన వ్రతాదుల మహాత్యమును స్కాంధ, లింగ, విష్ణు, పద్మ పురాణంబులందు సందర్భాను సారంగా జెప్పబడిన గాధను విపులముగా మీకు వినిపించెదను.

పూర్వకాలమున పార్వతీదేవి శ్రీ పరమేశ్వరుని అనేకవిధముల స్తోత్రములు చేసి పరమేశ్వరా! సులభ సాధ్యమైనటువంటిన్ని, స్త్రీపురుషాదులకు అన్ని వర్ణముల వారికి జేయుటకు తగియున్నటువంటిన్ని శ్రేష్టమయిన వ్రతమును అనతిమ్మని కోరెను. ఆ మాటలు శ్రీ పరమేశ్వరుడు విని సంతోషించి, ఓ మనోహరీ! నాకు మిక్కిలి ప్రీతికరమైనటువంటిన్ని నాస్వరూపమైనటువంటిన్ని మాఘమాసముయొక్క స్నానవ్రతాదుల మహాత్యమును స్కాంధ పద్మ పురాణాదులందు జెప్పబడిన వ్రతమును వ్రత విధానమును, నీకు వినిపించెదను. ఈ వ్రతమును స్త్రీపురుష భేదము లేక అన్ని మతముల వారును ఆచరించి ఇహ పర సౌఖ్యములను పొందవచ్చును. ఓ పరమేశ్వరీ? ఈ మాఘమాసము హరిహర బ్రహ్మస్వరూపమని తెలుసుకుని శ్రీ భాస్కరరూపమున ప్రకాశించు (సూర్యుని) నన్ను ఎవరు సేవించెదరో వారు అష్టైశ్వర్యములు ఆయురారోగ్యములు గలిగి పుత్రికా పుత్రాదులతో సుఖించెదరు. అని చెప్పి వ్రత విధానమును విపులముగా వివరించి చెప్పెను.

మరి ఒకప్పుడు శ్రీ మహావిష్ణువు శ్రీ మహాలక్ష్మికి జెప్పెను. మరి ఒకప్పుడు బ్రహ్మ సరస్వతీదేవికిన్ని, సరస్వతీదేవి శచి, అరుంధతి, లోపాముద్ర మొదలగు మహా పతివ్రతలకున్ను, బ్రహ్మ వశిష్ట, నారద, గౌతమాదులకున్ను, నారదుడు శుకమహాఋషికిన్ని, శుకమహా

ఋషి ప్రాయోపవేశుండైన పరీక్షన్మహారాజునకును వినిపించెను. ఆ కథను మీకు వినిపించెను. సావధానమనస్కులై వినుచు, సూతుండిట్లని చెప్పుటకు ప్రారంభము జేసెను.

ఓ మునికులవర్యులారా! పరీక్షితు మహారాజు ధర్మ మార్గంబున రాజ్యపాలనంబు జేసి అనేక యాగాదులు జేసి ధర్మములు నాల్గుపాదంబుల నడిపి ఒకానొక కారణమున ప్రాయోపవేశుండై శుకమహాఋషి వలన భాగవతము ఆమూలాగ్రముగా విని, ఆనందము పొంది మహాత్మా! శుకయోగీంద్రా! మాఘమాసవ్రతి స్నానాదుల మహాత్మ్యమును చెప్పుడనగా [illegible] శుకమహాఋషి యీ ప్రకారము చెప్పెను. ఆ కథను మీకు వినిపించెదను.

రాజశ్రేష్ఠుడైన దిలీపుడు యజ్ఞమును జేసి ప్రజలచేత పూజింపబడినవాడై రాజ్యపాలనము జేయుచు, ఒకనాడు మంచి వస్త్రంబులు ధరించి రథంబునెక్కి, మంత్రులు మొదలగువారు పరివేష్టించి రాగా బయలుదేరి వశిష్టమహాఋషి ఆశ్రమమునకు వెళ్ళి వినయముతో సాష్టాంగ నమస్కారములు చేసి, చేతులు జోడించుకుని నిలచియున్న రాజును దీవించి కూర్చుండ నియమించి కుశల ప్రశ్నమును జేసెను.

పిమ్మట దిలీపుడు గురువర్యా! తమవలన అనేక ధర్మములు వ్రతములను వింటిని. యిప్పుడు పావనమైన మాఘమాస స్నానవ్రతాదుల ఫలమును వినగోరి తమ సన్నిధికి వచ్చితిని. ఆ మాఘమాస స్నానవ్రతాదుల మహాత్మ్యమును, ఆనతిచ్చి నన్ను కృతార్థుని జేయవలయునని ప్రార్థించెను.

ఆ మాటలు వశిష్టుడు విని ఓ రాజా! మాఘమాస మహాత్మ్యము చక్కగా తెలుసుకోదగినది. ఇహ పరములందు మేలుజేయునది. పరమపావనమైనది. ఈ మాఘమాసమునందు ప్రవాహముగల జీవనములలో యెవరు స్నానము జేయుదురో యజ్ఞ యాగాదులు జేయక, అన్నసత్రి

ములు పెట్టక, చెరువులు, దేవాలయములు మొదలగు ధర్మకార్యము లను జేయుకున్నను వారు యిహామున సర్వ సౌఖ్యములు పొంది పర మందు సర్వ సుఖంబులును పొందుదురు.

ఓ రాజా! మాఘమాసమున స్నాన దాన జపాదుల విధిని జెప్పెదను శ్రద్ధగా వినుము. పుష్య శుద్ధ ఏకాదశి మొదలుకుని మాఘ శుద్ధ ఏకాదశి వరకు మాసనియమము జేసి ప్రాతఃకాలమున స్నాన ధ్యానాదులు జేసి దానములు జేసి సాయంత్రము వరకు ఉపవసించి, నక్షత్ర దర్శనము జేసి భుజించుచు భోగములనువదలి, యింద్రియము లను జయించి, భూశయ్యను శయనించుచు, శ్రీహరిని పూజించుచు మాఘశుద్ధ ఏకాదశి రాగా ఆ దినమునందు నియమముతో ఉపవసించి ద్వాదశినాడు బ్రాహ్మణ యుక్తముగా భుజించవలెను. యీ నియ మము ప్రకారము జేసి పూర్వకాలమునందు ఒక గంధర్వుడు తనకు గలిగిన పెద్దపులి ముఖమును పోగొట్టుకొని భార్యతో సుఖముగా నుండెను. ఆ కథను నీకు వివరించి చెప్పెదను.

స్కాంద పద్మ పురాణాదులందుగల మాఘ
మాస పురాణము వచన కావ్యమునందు
ప్రథమాధ్యాయము.

# ద్వితీయోధ్యాయము

## గంధర్వుడు పెద్దపులి ముఖమునుపోగొట్టుకొనుట మొదటి విధానము

ఓ దిలీపమహారాజా! బ్రహ్మర్షియైన భృగుమహాఋషి హిమవ త్పర్వతమునకు సహ్యాపర్వతమునకు నడిమి భాగమందు ఆశ్రమము కల్పించుకుని నివశించి యుండగా, ఒకానొకప్పుడు వానలులేక కాటా కము పట్టెను. అచ్చట నివశించువారు అన్నవస్త్రములు లేక హోమ

కార్యములు నడుపుటకును, దేవతా, పితృకార్యములు జరుపుటకు కూడా పదార్థములు లేక వేదపాఠములు జరుగక బాధ పడలేక పోవుచుండిరి. ఇట్లుండగా భృగుమహాముని తన యాశ్రమమును వదలి తన శిష్యులతో గూడా మణికూట పర్వతమునకు జనెను.

ఆ కొండమీద చతురపు నేలలందు నున్నని చతురపురాళ్ళపై నివసించి అనేకగంధర్వులు తమబడలికలను పోగొట్టుకొనుచు స్వేచ్ఛగా తిరుగుచుందురు. అచ్చట పగళ్లు, రాత్రులను భేదములేక సిద్ధులు జపములు జేయుచుందురు. ఆ కొండ పరిమళముగల వృక్ష లతా సమూహముల చేతను, జలధారల శబ్దముల చేతను, నానావిధములైన మృగముల చేతను, హంసలు మొదలగు పక్షి సముదాయముచేతను సహస్ర పద్మములుగల సరస్సుల చేతను ప్రకాశింపబడుచు దేవతలచేతను, విద్యాధరాదులచేతను సేవింపబడుచుండెను. అని చెప్పగానే, దిలీపుడు ఓ వశిష్టా! అన్ని వింతలకును, దేవతాదులకును, విహరించుటకును తగిన మణికూట పర్వతము యొక్క పొడవు ఎంతగలదు, వెడల్పు ఎంత గలదు, నాకు వివరముగా చెప్పవలసినదని కోరెను. వశిష్టుడు ఓరాజా! ఆ కొండ పొడవు రెండువందల అరువదినాల్గు మైళ్ళున్ను, నూటయిరువది ఎనిమిదిమైళ్లు వెడల్పు గలిగి, ఎనుబదిమైళ్ళ ఎత్తు గలిగి చతురము గల్గి మంచిగంధపుచెట్లు, పారిజాతచెట్లు లవంగ యిప్ప సురపొన్న మొదలగు చెట్లు గలిగి, ఎల్లప్పుడు పండ్లు పుష్పములు గలిగి నివాసయోగ్యముగలదై యున్నది. ఆ పర్వతమును జూచి భృగుమహాఋషి ఆనందించి ఆశ్రమము కల్పించుకుని తపము జేయుచుండెను.

ఇట్లుండగా కొంతకాలమునకు ఒక గంధర్వుడు భార్యాసహితముగా ఆశ్రమమునకు వచ్చి సాష్టాంగ నమస్కారములు జేసి చేతులు జోడించుకుని నిలువబడి విచారింపదొడగిరి. భృగుమహాఋషి ఆ దంపతుల విచారమును జూచి జాలికలవాడై ఓ విద్యాధరా! మీ విచారమునకు కారణమును చెప్పవలసినదని అడిగెను. విద్యాధరుడు తన వృత్తాంతమును ఈ ప్రకారముగా చెప్పుటకు ఆరంభించెను.

ఓ ఋషిపుంగవా! నేను వేదములందును, శాస్త్రములయందును చెప్పబడిన అనేక వ్రతాదులను, పుణ్యకార్యములను, జేసి ఆ పుణ్యఫలము వలన దేవత్వమును పొంది స్వర్గసుఖములను, పొందుచున్నను, పెద్దపులి ముఖముగలిగి యుంటిని. ఆ వికారముఖము వలన నాకు మితిలేని విచారము గలుగుచున్నది. ఏ కారణముచేత ఈ వికారముఖము గలిగినదో తెలియలేదు.

ఇది యే దుష్కర్మము చేయుటవలన గలిగినదో యని నా మనస్సున సర్వదా బాధించుచున్నది. నాకు అట్టి విచారము గలుగుటకు కారణమేమనగా పరమసుందరాంగియు, చక్కని నాసికాగ్రము గలదియు, మంచి రూపము గలిగినదియు, ఆటపాటలయందు నేర్పుగలిగినదియు నైన యీ వనిత నా భార్య అయివున్నది. అన్ని విధములైన మంచి గుణములు యీమె యందేగలవు. ఈమె చిన్నతనమునందే యేడు తంతులు గల వీణను నేర్పుగా వాయించ నేర్చి వీణాగానమును గుర్తెరిగిన నారదుని మెప్పించెను. ఇదిగాక బాల్యమునందే షడ్జము మొదలైన సర్వముల మర్మమెరిగిన కుబేరుని మెప్పించెను. ఒకప్పుడు గాన విశారదయై వీణను వాయించుచుండగా అనేక నాదగతులు గలిగి వింతగలుగుచున్న పంచమ స్వరయుక్తమైన యీసంగీతమును విని శివుడు మహానందము పొందెను. ఇన్ని స్వభావములచేతను, మంచిగుణములచేతను, రూపము చేతను వయసు చేతను సంపదచేతను, దేవతా సుఖలక్షణములు గల భార్య నాకు లభించినది. గాని ఈ పెద్దపులి ముఖముతో దీనికి తగని వాడనై విచారమును పొందుచున్నాను అని చెప్పెను.

భృగుమహాఋషి ఆ మాటలు విని భూత భవిష్యద్వర్తమానములు తెలియగలవాడు గావున ఆలోచించి కారణము తెలుసుకుని నవ్వుచు యిట్లని చెప్పెను. ఓ గంధర్వా! నిన్ను పొందిన చిత్రమైన పాపము గలదు. దానిని వివరించి జెప్పుచున్నాను శ్రద్ధగా వినుము.

ఎంత తెలివిగల వాడైనను ఈగ కాలంత పాపకర్మను జేయ బడుటచేత పాపకర్మ అతి స్వల్పమైనను అనుభవించక తప్పదు

అది విచారమును బుట్టించక మానదు. గనుక పాపకర్మలను జేయునపుడు స్వల్పముగా గ్రాచును అనుభవించునపుడు మేరు పర్వతమువలె గానబడును. నీవు మాఘమాసమునందు ఏకాదశినాడు నియమము జేసి ద్వాదశినాడు తైలముతో తల అంటించుకుని స్నానము జేసితివి. అందువలన ఈ పెద్దపులి ముఖము నీకు కలిగినది. ఓ విద్యాధరా ! నీవు దానికి తగినట్లు ప్రయత్నముజేయక పూర్వ కృతమును దలచి ఏల విచారించెదవు.

నీ వికార ముఖమును పోగొట్టుకోదలచినయెడల నా మాటలను వినుము ఈ మాణికూట పర్వతమునందలి యేటిలో పూర్వకృత దోషములను నశింపజేయు మాఘమాసస్నాన వ్రతములను జేయుము మహామునులచేతను, సిద్ధులచేతను, ప్రజలచేతను, ఆచరింపబడుచున్న మాఘస్నానవిధిని చెప్పెదను వినుము. నీవు పుణ్యాత్ముడవు గనుకనే ఇంక అయిదు దినములలో పుష్యశుద్ధ ఏకాదశిలు వచ్చును. ఆరోజు మొదలుకొని మాఘశుద్ధ ఏకాదశీలు వరకు నెల దినములు భక్తివ్రతము జేయుచు ప్రాతఃకాలమునందు స్నానాదులను జేయుచు సకల భోగంబులను వదలి యింద్రియములను జయించి శ్రీహరిని పూజించుచు మాఘశుద్ధ ఏకాదశీనాడు నియమముగా ఉపవాసముండి ద్వాదశి రోజున బ్రాహ్మణయుక్తముగా పారణము జేయుము. అటుల జేసినయెడల నీ పాపములు నశించి నీకు సౌందర్యమైన ముఖము గలుగును అని చెప్పెను. ఆ మాటలను గంధర్వుడు విని మాఘమాస ప్రయుక్త స్నాన వ్రతాదులను యథావిధిగా నెరవేర్చెను. ఆ వ్రత మహాత్మ్యమున వ్యాఘ్రము ముఖము పోయి నవ మన్మధునివలె రూపమును పొంది భార్యతో సకల సౌఖ్యములను పొందెను.

ఓ రాజా ! మాఘమాస స్నానవ్రతాదులు చేసినయెడల ఆపదలు తొలగిపోవును, పాపములు నశించును. పూర్వకృతదోషము పటాపంచలమగును. సకల కోరికలు నెరవేరును. యిహమందు సకల సంప

దలు కలిగి పరమందు జన్మరాహిత్యమును పొందుదురు. వ్రతములలో కెల్ల యీ మాఘమాస స్నానవ్రతాదులు ముఖ్యములు యీ మాఘ మాసము యజ్ఞయాగాదులు జేయుటకున్ను, తపస్సు జేయుటకున్ను ముఖ్యమయినది. యీ మాఘమాస స్నానవ్రతము కామధేనువు వంటిది. సకల కోరికలు నిచ్చును. కృతయుగమునందు తపస్సున్ను, త్రేతా యుగమునందు యజ్ఞయాగాదులున్ను, ద్వాపరయుగమునందు హరి హర పూజాదులున్ను, కలియుగమునందు స్నాన దాన వ్రతాదులున్ను ముఖ్యమయినవి. యీ ప్రకారము ఒక్కొక్క యుగమునకు చెప్పబడి యున్నది. ఈ మాఘమాస స్నానవ్రతాదులు అన్ని యుగములందును, అన్ని మతముల వారికిన్ని ముఖ్యమై కోరిన కోరికల నిచ్చునదై యున్నది అని చెప్పెను.

స్కాంద పద్మపురాణంబులందు గల మాఘమహాత్మ్య
మందు గంధర్వస్త్రీ వ్యాఘ్రముఖవిముక్తి
గల మొదటి విధానము,
ద్వితీయోధ్యాయము

# తృతీయోధ్యాయము

## మాఘమాస వ్రతవిధానమునందు రెండవవిధానము

శుకయోగీంద్రుడు పరీక్షితు మహారాజును జూచి ఓ పరీక్షితా! వశిష్టమహాఋషి దిలీపునితో వ్రతవిధానమును యిట్లని జెప్పుటకు ప్రారంభము జేసెను.

మాఘమాస వ్రతవిధానము పుష్యశుద్ధ ఏకాదశి మొదలు మాఘశుద్ధ ఏకాదశి వరకు జేయుట యిదవక విధానము రెండవ విధానము సూర్యుడు మకరరాశిని ప్రవేశించిన దినము మొదలు కుంభమునందు ప్రవేశించు వరకు జేయుట, మూడవ విధానము మాఘ శుద్ధ పాడ్యమి మొదలు ఫాల్గుణశుద్ధ పాడ్యమి వరకు స్నాన దాన

వ్రతాదులు జేయుట యే విధానమైనను మాస నియమము ప్రధానమై యున్నది. అనగా నెలరోజులు జేయుట ముఖ్యము పూర్వమునందు జరిగిన ఒక విషయమును జెప్పెదను. పురూరవుడను చక్రవర్తి ప్రజాను రాగముగా ధర్మము తప్పకుండా రాజ్యపాలనము జేయుచు ఏకాదశి వ్రతాదులను జేయుచు రాజ్యమందు గల ప్రజలచే చేయించుచు సర్వ సుఖంబులనుభవించుచుండెను. యిట్లుండగా పూర్వకర్మ విశేషముచేత శాస్త్రమునందు నిషేధింపబడిన ప్రకారము దశమినాటి రోజున రాత్రి భుజించక ఏకాదశినాడు ఉపవాసముండి శ్రీమహావిష్ణువును పూజించుచు ద్వాదశి [illegible] చెను. ఆ పాపము వలన రా[illegible] కురూపత్వము పొందెను. అందువలన విచారము గలిగినవాడై రాజ్యమును వదలి ఈ కురూపత్వము ఎట్లు పోవునో యని అనేక విధములు పరితపించి పట్టణము వదలి హిమవంతమునకు వెళ్ళి ఒక సరస్సు గట్టున నివసించి యుండగా అచ్చటకు అగస్త్య మహాఋషి వచ్చెను. ఆ మహాఋషిని జూచి సాష్టాంగ నమస్కారములు జేసి చేతులు జోడించి నిలువబడి మహాత్మా! నేను పురూరవుడను చక్రవర్తిని నేను ధర్మయుక్తముగా రాజ్యపాలనము జేయుచు ఏకాదశి వ్రతాదులను జేయుచుంటిని గాని ఏ పాపము జేసితినో యీ పిశాచ రూపము కలిగినది. అందువలన రాజ్యాదులను వదలి ఎడతెగని మనోవ్యాకులము చేత యిచ్చటకు వచ్చితిని. నా పూర్వపుణ్యవశమున మీ దర్శనము లభించినది గాన ఈ పిశాచ రూపము ఏ పాపము వలన వచ్చినదో? ఏ వ్రతమును జేసిన నశించునో ఆనతిచ్చి నన్ను కృతార్థుని జేసి రక్షింపుమని కోరెను.

ఆ మాటలు అగస్త్య మహాముని విని త్రికాలజ్ఞానిగాన పురూరవుని పాప పుణ్యములను తెలుసుకుని యిట్లని జెప్పెను. ఓ చక్రవర్తీ! నీవు మహాపుణ్యాత్ముడవు, ధర్మమార్గము తప్పని వాడవు, ప్రజారంజకుడవు, నియమముప్రకారము ఏకాదశీ వ్రతాదులు జేయుచు ఒకనాడు

పూర్వకర్మ దోషవశమున ద్వాదశీలు రోజున తైలాభ్యంగన మొనర్చితివి. ఆ పాపకార్యము చేత నీకు ఈ వికార పిశాచరూపమున్ను, ఎడతెగని మానసిక విచారమున్ను సంభవించినవి. పాపకార్యము ఎంత స్వల్పముగా జేసినను పాలలో స్వల్పముగా పుల్లటి పదార్థము వేసిన పాలు ఎట్లు విరిగిపోవునో అట్లే పాపఫలమును అనుభవించక తప్పదు అని జెప్పెను.

ఆ మాటలు పురూరవుడు విని ఓ అగస్త్య మహాముని! ఈ పాపము నశించి పోవుటకు ఏ వ్రతము ఆచరింపవలెనో ఆ వ్రత విధానమును ఆనతిమ్మని కోరెను. అగస్త్య మహాముని ఓ రాజా! నీవు పుణ్యాత్ముడవు రెండు మూడు రోజులలో సూర్యుడు మకర రాశిని పొందును. సూర్యుడు మకర రాశిని ప్రవేశించిన దినము మొదలుకొని కుంభ రాశిలో ప్రవేశించు దినము వరకు మాస నియమమున జేసుకొని ఈ సరస్సు దేవతలకు ప్రియమైనది. గాన ఈ సరస్సులో ప్రాతఃకాలమున స్నానము జేయుచు సంధ్యావందనాది నిత్యకర్మలు నెరవేర్చుకొని ఆహార నియమముచేసి యింద్రియములను జయించి మాఘమాస వ్రతమును చేసినయెడల నీకు పూర్వమునకు వేయిరెట్లు ఆనందముగల శరీర చ్ఛాయతో ప్రకాశించెదవు. ఎవరుగాని తెలిసిగాని తెలియకగాని ద్వాదశి రోజున తైలాభ్యంగనము చేసినను, తిలసంబంధమగు పదార్థములను తినినను పూర్వపుణ్యము నశించి దారిద్ర్యులగుటగాని మనోదుఃఖములగాని, యితర బాధలుగాని సంభవించును. అదిగాక నరకమున బోదురు. కాబట్టి నీవు అతినిష్ఠతో మాఘమాసవ్రతమును చేసి సకల సౌఖ్యంబులను పొందుమని చెప్పి అగస్త్యుడు తన ఆశ్రమమునకు జనెను.

వశిష్ఠుడు ఓ దిలీపా! అగస్త్యులు పురూరవునితో జెప్పగానే పురూరవుడు మకరరాశిని సూర్యుడు ప్రవేశించిన దినము మొదలుకొని ఆ సరస్సున స్నానాదులు చేసి ఆహారము వర్జించి మహావిష్ణువును

హృదయ కమలమందు నిలిపి బహు నిష్ఠతో తపముచేయుచుండెను. అంతట మహావిష్ణువు సంతోషించి సూర్యుడు కుంభరాశిని ప్రవేశించిన దినమందు గరుడవాహనారూఢుడై శ్రీలక్ష్మీయుతుడై, శంఖు, చక్ర గదా హస్తుడై చతుర్భుజుడుతో ప్రత్యక్షమయ్యెను.

ఇట్లు ప్రత్యక్షమైన విష్ణువును పురూరవుడు అనేకవిధముల స్తోత్రములు చేయగా విష్ణువు సంతసించి ఓ రాజా! నీవు చేసిన ద్వాదశీ వ్రతభంగదోషము నశించినది. నీవు పూర్వతేజస్సుకంటె వేయిరెట్లు తేజస్సుగలిగి సకల సౌఖ్యంబులు అనుభవించి అంతమందు విష్ణుసాయుజ్యమును పొందుదువని వరమిచ్చెను. అంతట [illegible] వచ్చి శ్రీమహావిష్ణువు [illegible] మయ్యెను. ఓ రాజా! యీ పురూరవ చరిత్రమును వినినను చదివినను ద్వాదశీ వ్రత భంగదోషము నశించి సకల సౌఖ్యంబులు పొందుదురు. అని చెప్పెను.

స్కాంద పద్మ పురాణాదులందు గల మాఘమాస

వ్రత రెండవ విధానము

తృతీయాధ్యాయము

# చతుర్థాధ్యాయము

## మాఘమాస వ్రత మూడవ విధానము

వశిష్ఠమహాఋషి దిలీప మహారాజును జూచి ఓ రాజా! మాఘమాస వ్రత విధానమందు రెండు విధములైన వ్రతములను జెప్పితిని యిప్పుడు మూడవ విధానమును జెప్పెదను శ్రద్ధగా వినుము.

మనుష్యుడు ఏ వ్రతమును విని సమస్త పాపములను పోగొట్టుకొనునో అట్టిమాఘమాస వ్రతమును జెప్పెదను.

పూర్వము కృతయుగమునందు భోజనగరమను పట్టణమున వేదాధ్యయన సంపన్నుడైన కుత్సుడను బ్రాహ్మణుడు గలడు. అతనికి

ఒక కుమారుడుగలడు. అతనిపేరు కౌత్సుడు, భార్య చంద్రమతి తల్లి దండ్రులు కౌత్సునికి అయిదవయేట ఉపనయనము చేసి వేదాధ్యయనము జేయించుచుండెను. ఆ కుమారుడు ప్రతిదినము ప్రాతఃకాలమున స్నానము చేసి అగ్నికార్యమును నెరవేర్చుకుని బ్రహ్మచర్యము వహించి యింద్రియములను జయించి కృష్ణాజినము, మోదుగదండము, ముంజితాడు, కమండలము ధరించి తెల్లని కౌపీనము దాల్చి వెండితీగవలె ప్రకాశించు జంజెము ధరించి తెల్లని విభూతిని నొసటను, దేహమంతటను ధరించి నిత్యము తల్లిదండ్రులకున్ను, ఉపదేశగురువులకున్ను, చదువుచెప్పినట్టి గురువులకున్ను, జ్ఞానసంపన్నులైన పెద్దలకున్ను నమస్కరించుచుండెను. పుష్పములు, గంధము మొదలగు ద్రవ్యములు ముట్టక, భోజనకాలమందు మాత్రాహార మన్నయు తెలుపకుండ మునగకాడ ఉల్లి మొదలగు నిషిద్ధ పదార్థములను ముట్టక, ఉప్పు, కారము, పులుపు, విసర్జించి, పావుకోళ్లు ధరింపక, అద్దమును జూడక, దంతధావనము, తాంబూలము, తలపాగ, నల్లని, పచ్చని, ఎఱ్ఱని వస్త్రములు దాల్చక బ్రహ్మచారులు విసర్జించవలసిన వస్తువులను విసర్జించి సదాచారసంపన్నుడై బ్రహ్మచర్యము జరుపుచు మాఘమాస వ్రతమును చేయుటకు తల్లి, తండ్రి, గురువుల అనుజ్ఞను పొంది పుణ్యాపరాయిన పడమర ఉత్తర వాహినియై ప్రవహించుచున్న కావేరీ నదీతీరమునకు జనెను. కౌత్సుడు కావేరీనదిని జూచి సాష్టాంగ నమస్కారముజేసి నా పుణ్య వశమున యిటువంటి పుణ్య నదిలో స్నానము లభించెనుగదా యని సంతోషించి అచ్చటనే నివాసము ఏర్పరచుకుని స్నానాదులు జేయుచుండెను.

ఇట్లుండగా మాఘమాసము సమీపించెను. మాఘశుద్ధ పాడ్యమి లగాయతు ప్రాతఃకాలమున స్నానానుష్ఠానములు నెరవేర్చుకుని ఈశ్వరుని ధ్యానించుచు ఫాల్గుణ శుద్ధ పాడ్యమీలవర్కు బహు నియమముతో మాఘమాస వ్రతస్నానాదులు పూర్తిచేసెను. ఈ విధముగా

మూడు సంవత్సరములు మాఘమాస వ్రతస్నానాదులను జేసి పరిశుద్ధు డైన మనస్సు గలవాడయి కావేరీనదికి ఉత్తర భాగమందున్న పర్వత శిఖరమునకు జేరెను. అట్టి గొప్పగొప్ప వృక్షములచేతను మృగసమూహములచేతను పక్షుల కలకలముచేతను అనేక విధములైన పుష్ప ఫలాదులచేతను, యక్షులు గంధర్వులు, దేవతలు మొదలగు దేవతాసమూహములచేతను ప్రకాశించుచున్న నారాయణగిరి అను ప్రదేశమందు గూర్చుండి తపంబు జేయుచుండెను, అట్లు తపము జేయుచున్న కౌత్సుడు ప్రపంచక జ్ఞానములేక నిశ్చల మనస్సు గలవాడై చలించక ఈశ్వరధ్యాన పరాయణుడై యుండెను.

ఆ ప్రదేశమందుగల ...లు మొదలగునవి అతనిని జూచి నాయందు ... ప్రాణులు ...ను దేహమును ... పోవునట్లు కొమ్ములతోను ... కొను ...ను. ఇట్టుల తపంబు జేయుచున్న కౌత్సుని జూచి పార్వతీపరమేశ్వరులు సంతసించి అతని ఎదుట వృషభవాహనారూఢులై ప్రత్యక్షమైరి. ఆ ప్రకారము ప్రత్యక్షమైన పార్వతీ పరమేశ్వరులు కౌత్సుని జూచి ఓ మృగశృంగా! నీ తపంబునకు సంతోషించితిమి. అని శిరంబున అభయ హస్తంబునుంచగా మృగశృంగుడు గాఢ నిద్రపోయిన వాని విధంబుగా కన్నులు తెరచి ప్రపంచ జ్ఞానము గలిగి శ్రీపరమేశ్వరుని జూచి సాష్టాంగ నమస్కారములు జేసి స్తోత్రము చేయనారంభించెను. ఓ పార్వతీ పరమేశ్వరులారా! సర్వప్రాణులను పోషించి రక్షించువాడవున్ను, ధర్మము నిలుపు వాడవున్ను, సంకల్ప మాత్రమున సృష్టి స్థితి లయంబులను జేయువాడవున్ను, ఆనంద స్వరూపుడవున్ను, శ్లో. ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః జ్ఞాన వైరాగ్య యోశ్చైవషణ్ణాంభగ ఇతీంగనా అనునట్లు అష్టైశ్వర్య సంపన్నుడవున్ను బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపుడవున్ను, పరదేవతా సమేతుడవైన, పరబ్రహ్మ స్వరూపుడవున్ను, ఎల్లలోకములందున ప్రకాశించువాడవున్ను, అయిన పార్వతీ పరమేశ్వరులారా

మీకు నమస్కారములు నేను శరణాగతుడను నన్ను నేలుకొనుమని పలికి నమస్కరించెను. ఈ విధముగా స్తోత్రము జేయుచున్న కౌత్సుని జూచి మృగశృంగా! నీచే చేయబడిన స్తోత్రమునాకు చాలా సంతోషము కలుగ జేసినది. మాఘమాస వ్రత స్నానాదులు జేయువారు యీ స్తోత్రమును పఠించినను, వినినను కర్మవిముక్తులగుదురు. శ్లో. జన్మాంతర సహస్రేషు యా బుద్ధి ర్భావితాత్మనాం తామేవ లభతే జంతు రుపదేశో నిరర్థకః. అనగా అనేక వేలకొలది జన్మలనుండి తాను జేసిన పుణ్యపాపములను బట్టి యెటువంటి బుద్ధి వచ్చుచుండునో అటువంటిబుద్ధినే ఇప్పుడు కలిగియుందురు. నాకు అటువంటి వారిని మంచి బుద్ధి కలుగజేయుటకేను. మంచిబుద్ధి కలుగ జేయు మాఘమాస స్నాన వ్రతము నీవు అతి భక్తితో చేసితివి. మాఘమాస వ్రత స్నానాదుల వలన నేను సంతోషించునట్లు యజ్ఞయాగాదుల వలనను వ్రతాదుల జేయుటవలనను సంతోషింపను.

ఓయి మృగశృంగా! నీకు కావలసిన వరము నడుగుము అని జెప్పెను. ఓ పరమేశ్వరా! నేను కుత్సమహాముని పుత్రుడను కౌత్సుడనుగదా! మృగశృంగా యని పిల చితివి. మృగశృంగా అని పిలుచుటకు కారణమేమని అడిగెను. పరమేశ్వరుడు జెప్పుచున్నాడు. కౌత్సుడవేగాని నీవు నన్నుగూర్చి నిశ్చల మనస్సుతో తపము జేయునప్పుడు ఈ ప్రాంతమందుగల మృగములు ఈ సరస్సునకు జలపానమునకు వచ్చి నిన్నుజూచి భయపడక రాయియని భ్రమపడి కొమ్ములతో గోకుచుండెడివి. అందువలన నిన్ను మృగశృంగా యని పిలిచితిని. నీకు యింతటినుండి మృగశృంగనామమున పిలిచెదను. నీవు ప్రీతిగా గృహస్థాశ్రమము పొందుము. అని జెప్పి పార్వతీ పరమేశ్వరులు అదృశ్యులైరి.

అంతట మృగశృంగుడు భగవంతుని వలన వరములను పొంది గృహస్థాశ్రమము పొందుటకు నిశ్చయముజేసుకుని పార్వతీ పరమేశ్వరులను, శ్రీమహాలక్ష్మీ నారాయణులను స్మరించుచు, ములజితాపు

జింకతోలు, మోదుగదండము కమండలము ధరించి తన జన్మస్థానమైన భోజనగరమునకు వచ్చి తన గృహమందు ప్రవేశించి, తల్లితండ్రులకు సాష్టాంగదండములు పెట్టి తాను జేసిన వ్రత స్నాన జపాదులను వారికి వివరించి చెప్పెను. అంతట వారు కుమారుని ఆలింగనము జేసుకుని కుశలప్రశ్నములను జేసి సంతోషింపజేసిరి. పిమ్మట మృగశృంగుడు తల్లిదండ్రుల అనుమతి తీసుకొని గురువునకు సాష్టాంగ నమస్కారములు చేసి వేదాధ్యయనము జేయుచుండెను. యిట్లు శ్రద్ధాభక్తులతో వేదాధ్యయనము జేయుచున్న కుమారుని జూచి సంతోషించి నాయనా! కుమారులను, కుమార్తెలను కని పెంచుటయందు తల్లిదండ్రులు ఎంతో శ్రమపడుదురు. తల్లితండ్రుల ఋణమును పోగొట్టుటకు కుమారుడు నూరు సంవత్సరములు సేవచేసినను సమర్థుడు కానేరడు. తల్లిదండ్రులను, గురువును ఎవ్వడు సంతోషపెట్టునో, వాడే ఉత్తమ పుత్రుడు. వంశోద్ధారకుడగును. ఆ ముఖ్యులు సంతోషించిన యెడల సమస్త వ్రతములు, తపస్సును జేసిన ఫలతము పొందును. బుద్ధిశాలియగువాడు తెలుసుకొని వారిని పూజించును. ఆ పూజయే, ధర్మ, అర్థ, కామ, మోక్షములనిచ్చును. గురువునొద్ద చదివిన పిమ్మట గృహస్థాశ్రమము పొందవలెను. గృహస్థాశ్రమమునకు మించిన ఆశ్రమము లేదు. గృహస్థాశ్రమమే నాల్గువిధములైన పురుషార్థములను పొందజేయును.

శ్లో, యథావాయుం సమాశ్రిత్య సర్వేజీవంతిజంతవః తథాగృహస్థమాశ్రిత్య వర్తంతేయి తరాశ్రమాః అనగా సకల ప్రాణులు వాయువును ఆశ్రయించుకుని బ్రతుకుచున్నట్లు, బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు మొదలగు ఆశ్రమములవారు, గృహస్థుని ఆశ్రయించుకుని బ్రతుకుదురు. యింటికివచ్చిన యతిథి యభ్యాగతులను, శ్రద్ధాభక్తులతో స్వాగతమిచ్చి యన్నపానాదులిచ్చి యాదరింపవలెను. అనుకూలవతియైన భార్యలభించిన వేరే స్వర్గ సుఖమునందాశవుండదు. భార్య ప్రతికూలవతియైన అదియే నరకమగును. గృహస్థాశ్రమమందు

సుఖము పొందుటకు భార్యయే మూలము. బుద్ధిహీనురాలగు భార్య మనస్సును, ధనమును మొదలగునవి నశింపజేయును. కాబట్టి మంచి గుణములుగల కన్యను జూచి పెండ్లాడవలెను. లేనియెడల సుఖముండదని అగస్త్యుడు మనువు మొదలగువారు చెప్పియున్నారు. అని చెప్పగానే మృగశృంగుడు విని, ఓ తండ్రీ! నీవు చెప్పిన మంచి లక్షణములు గల కన్య ఎచ్చట దొరకును అని యడిగెను. కుత్సమహాముని విని నాయనా! నీవు ఈ విషయమై ఆలోచింపనక్కరలేదు. నీవు ఆచారవంతుడవై నియమము ప్రకారము మాఘమాస స్నానవ్రతాదులను చేసినవాడవు [illegible] వ్రతాదులు చేయనివానికి [illegible] భాగ్యే, అభాగ్యే. భవతి. అని చెప్పబడియున్నది. వారికి వారు చేయు పుణ్యపాపములను బట్టి నరునకు భార్యయు, కన్యకు భర్తయు లభించెదరు. మాఘమాస స్నానాదుల వలన సకలవిద్యలును, సకలైశ్వర్యములును, ధనధాన్యాదులును నిర్మలమైన కీర్తిని ఆరోగ్యమున్న ఆయుస్సున్న మంచి భార్యా పుత్రాదులును యిచ్చును.

అన్ని పాపములు నశించి అంతమందు స్వర్గసుఖము గలుగును. ఇవిగాక దేహారోగ్యము మంచివాక్చాతుర్యము నిశ్చలమైన భగవద్భక్తి మంచిరూపము సదాచారము దానధర్మములందు ఆసక్తి గలుగజేయును. నీవుచేసిన మాఘస్నానాదులవలన సంతోషించి శ్రీపరమేశ్వరుడు నీ యిష్టకార్యమును నెరవేర్చును. అని తండ్రి చెప్పగానే విని మృగశృంగుడు సంతోషించి ఓ తండ్రీ! నీవు పల్కిన వాక్యములు సత్యములు యుదారములునై యున్నవి. నీ అనతి ప్రకారము గృహస్థాశ్రమమును స్వీకరించి తల్లిదండ్రులను గురువులను సంతోషింపజేయుదు ననిపల్కి సాష్టాంగ నమస్కారములను జేసెను.

స్కాంధ పద్మ పురాణాదులందుగల మాఘమాసవ్రత

మూడవవిధానమునందు

నాలుగవ అధ్యాయము

# అయిదవ అధ్యాయము

## మాఘమాస వ్రతస్నానాదుల ఫలితము

శుకయోగీంద్రుడు పరీక్షితీంద్రుని జూచి ఓ పరీక్షితిమహారాజా! వశిష్టమహాఋషి. దిలీపమహారాజుంజూచి మాఘమాస వ్రత స్నానాదులగూర్చి యిట్లని జెప్పెను.

వశిష్టుడు. ఓ దిలీపమహారాజా! యీ యితిహాసమును శ్రద్ధగా వినుము. ఆ భోజపురమునందే ఉచథ్యుడు అను పేరుగల సదాచారసంపన్నుడైన బ్రాహ్మణుడొకడు గలడు. ఆయన భార్య సుమేధ మంచి గుణములుగలిగి సదాచారసంపన్నయై యున్నది. ఆ దంపతులకు సువృత్తయను ఒక కుమార్తె గలదు. ఆ పుత్రిక రూపవతియు, మంచి గుణములు నడవడి గలిగియున్నది. ఆ సువృత్త ప్రతిదినము తెల్లవారు ఝామున లేచి గృహకృత్యములందు తల్లికి సహాయపడి యీడుకన్యకలను జతగూర్చుకుని సమీపమందుగల కావేరీనదికి వెళ్ళి స్నానము జేయునపుడు సహ్యమను కొండయందుబుట్టి శ్రీరంగనాధుని సేవించుటకు కావేరీ నామమును పొంది ప్రవహించెడి కావేరీగంగా! నా పాపములను పోగొట్టి నాకు శుభములను మంచిగుణ లక్షణములను భర్తను కొమరులను పతిభక్తిని యిమ్మని కోరుచు, నదికి నమస్కరించి స్నానమును జేయుచు స్నేహితురాండ్రతో గలసి యింటికి వచ్చుచుండును. యీ విధముగా ఎడతెగక మూడు సంవత్సరములు స్నానాదులు జేసిరి. తండ్రి ఉచథ్యుడున్ను, తల్లి సుమేధయు తమకుమార్తెయొక్క స్నానవ్రతాదులందును గల శ్రద్ధాభక్తులు జూచి ఆనందించి దీనికి తగిన పెండ్లికుమారుడు ఎచ్చట లభించునో యని విచారింప దొడగిరి. కుత్సితమహాఋషియు, బ్రహ్మచారియైన తన కుమారునికి ఉచథ్యుని కుమార్తె సువృత్తను పెండ్లిచేసుకోవలెనని తలచి, తన భార్య చంద్ర

మతితోటిన్ని, కుమార్డు మృగశృంగునితోటిన్ని జెప్పి ఆలోచించెను. వారిసమ్మతిమీద ఉచథ్యుఁతో ఆలోచించి సువృత్తను తన కుమార్డు మృగశృంగునికి పెండ్లి జేసుకొనుటకు నిశ్చయముజేసుకొనెను. మృగశృంగుడును ఆ పిల్లయొక్క రూప గుణాదులనుజూచి సంతోషించెను. ఉచథ్యుడున్ను సుమేధయున్ను తమకుమార్తెకుతగిన వరుడని సంతోషించిరి.

ఇట్లుండగా ఆ సువృత్త తనచెలికత్తెలను తీసుకుని కావేరీనదికి వెళ్ళి మాఘస్నానము జేసుకుని యింటికి వచ్చుచుండగా మార్గమందు మదించిన యేనుగ ఆ కన్యల నలుగురుని కొట్టుటకు తొండము చాచి ఘీంకారము జేయుచు తరుమ జొచ్చెను. యిట్లు తరుముచూ రాగా నలుగురు కన్యలు దారితప్పి గడ్డి అలుముకువున్న నూతిలో పడి ప్రాణములు విడిచిరి.

అంతట తల్లిదండ్రులు తమ కుమార్తెలు ఏవేలకు రాకపోవుట చేత విచారించి వారిని వెదకుకొనుచు రాగా కన్యకలు పరుగిడునప్పుడు జారిపడినవస్త్ర భూషణాదుల జాడనుబట్టి వెదకి నూతివద్దకు వెళ్ళి నూతిలో బడి ప్రాణములను వదలిన తమ కుమార్తెలను చూచి బిగ్గరగా యేడ్చుచుండిరి. మృగశృంగుడు తపము చాలించి ఆ మార్గము వచ్చుచు నూతివద్ద రోదనము జేయుచున్న బాలికల తల్లిదండ్రుల జూచి ఓదార్చి మృతకళేబరములను పైకిదీసి గృహమునకుదీసుక్కు వెళ్ళి పాన్పున బరుండబెట్టి మంచి గంధాదులచే యీ కన్యలు లేచుపర్యంతము జాగ్రత్తగా పూజించుచుండమని జెప్పి తాను గోదావరినదికి వెళ్ళి కంఠములోతు నీటియందు నిలచి సూర్యబింబమును జూచుచు చేతులు జోడించి పైకెత్తి యమధర్మరాజును గూర్చి తపంబు జేయ సాగెను.

ఇట్లు తపంబు చేయుచున్న మృగశృంగుని జూచి ఆ మదించిన యేనుగ తొండముతో కొట్టుటకు తొండము పైకెత్తి ఒక్క దెబ్బ

కొట్టెను. ఆ దెబ్బ అతనికి తగులక తోండము మాత్రము అతనికి తగిలెను. తోండమతనికి తగులగానే యేనుగయొక్క మహాపాపములు నశించి పూర్వపు వైశ్యరూపమున నిలువంబడి మృగశృంగుని యీ విధముగా ప్రార్థింప దొడగెను. ఓ మహాత్మా! నేను మహాపాపాత్ముడను నీవు మహాపుణ్యాత్ముడవు. నా తోండము నీకు తగులగానే నా పూర్వకర్మ దోషములు నశించి మనుషత్వము కలిగినది. నేను పూర్వకాలమునందు కోటిఫలీ పురవాసుడను. నా తండ్రి విశ్వగుప్తుడు. నా పేరు ధర్మగుప్తుడు. నేను నాకులమునకు తగిన వేదాదు లభ్యసించి నా వృత్తిని న్యాయముగా జేయుచు పదిలక్షల నాణ్యములను సంపాదించి యజ్ఞయాగాదులు జేయుచు, యజ్ఞయాగాదులను జేయువారికి తగిన సహాయము జేయుచు, స్నాన, దాన, వ్రతాదులు ఎన్నిగలవో వాటి నన్నిటిని యథావిధిగా నెరవేర్చి, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను విసర్జించి బ్రాహ్మణులయందు, దేవతలందు, ధర్మమునందు ఆసక్తి గలవాడనై పితృకార్యములు యధావిధిగా జేయుచు, నా వృత్తిననుసరించి తగిన వస్తువులను, బేరమాడ నష్టముగాని, విక్రయించునప్పుడుగాని, అన్యాయముజేయక తెలియని వారిని మోసము చేయక పాషండమతము, అవలంబించక, మనస్సు వాక్కు కర్మలను మూటిని యేకము జేసి పరిశుద్ధుడనై యుంటిని. నా భార్యయు నన్ను అనుసరించియుండెడిది. మాకు మంచి గుణములుగల ఒక్క కుమార్తు గలిగెను. నేను నాకుగల ఆస్తిని రెండు భాగములు జేసి కుమారుని భాగమతనికిచ్చివేసి నాభాగమునకు వచ్చిన ధనముతో చెరువులు, బావులు, దేవాలయములు, తోటలు వేయించితిని. అడవి మార్గములందు బావులు త్రవ్వించితిని. కన్యాదాన, గోదాన, భూదాన, గృహదాన, అన్నదాన. అశ్వ, గజ, తిల, తండుల, ముద్గ, మాష, ఆజ్య, మహిష, అజ మొదలగు మహాదానములు చేసితిని. నేను చేయని దానములు భూమియందు లేనేలేవు. ఎన్ని దానములుచేసిననేమి బ్రహ్మ

నొసట వ్రాసిన వ్రాత తప్పింప హరిహర బ్రహ్మల వశము కాదుగదా! ఐశ్వర్యము వచ్చునప్పుడు కొబ్బరికాయలోని నీళ్లవలె తమంతట తామే వచ్చును. పోవునప్పుడు ఏనుగు తిన్న వెలగపండు గుంజువలె హరించిపోవును. యిట్లుండగా కొంతకాలమునకు బంగారము జేయు యోగములందు ఆసక్తిగల కాపాలిక మతస్థుడొకడు నన్ను మోసపుచ్చి రసవాదము నందభిరుచి పుట్టించి, నావద్ద కలుగయున్న ధనము నంతను నాశనము జేయించెను. అందువలన నిరుపేదనైతిని. ముసలితనము వచ్చెను. అవయములు వణకసాగెను రోగబాధ కలుగజొచ్చెను. ఏపని జేయుటకు ఓపిక లేకపోయెను. అట్లుండగా మాఘమాసమురాగా గోదావరినదీ స్నానము మాత్రము మానక ఆనెల దినములు ఎట్లో స్నానాదుల వలన గడిపితిని. భార్యాపుత్రాదులు ఆదరించుట మానివేసిరి.

నా మనుమడు భోగముదానినుంచుకొని యిల్లు గుల్ల జేయసాగెను. ఆ సంగతి తెలుసుకొని రాజు మా కుటుంబమునంతను ఆగ్రహము కలిగి గ్రామమునుండి వెడలగొట్టెను. మేము వేరొక గ్రామము జేరి నేను యిదివరలో జేసిన ధర్మకార్యములను నమ్ముకుని జీవించితిమి. యీ విధముగా నేను జేసిన ధర్మములన్నియు విక్రయించి జీవించి తుదకు వ్యాధిగ్రస్తుడనై మరణించితిని. ఓ మృగశృంగా! యేమని జెప్పుదును. నాకు మాఘమాస వ్రత దానాదులు మాత్రమే మిగిలినవి. ఆ పుణ్యవశమున స్వర్గమును పొంది ఒక మన్వంతరము స్వర్గమునందుండి ధర్మవిక్రయము జేయుట వలన ఏనుగనై పుట్టి భూమండలమంతయు స్వేచ్ఛగా తిరుగుచు నిన్ను కొట్టుటకు ఎత్తిన తొండము నీకు తగిలి నా పాపములు నశించినవి. నీ అనుగ్రహము వలన నాకు తిరుగా స్వర్గసుఖము కలిగినది. ముమ్మాటికి కృతార్థుడనైతిని. నీకు అనేక నమస్కారములు. నీవు మహాతపశ్శాలివి. మహాపుణ్యాత్ముడవు. నాచేత యిదివరలో నూతిలో బడి ప్రాణములు వదలిన కన్యకలు [illegible]

జీవించెదరు. ఆ నలుగురు కన్యకలను నీవు వివాహమాడి సకల సుఖంబులను పొందుము. సత్పురుషుల సహవాసము సద్గతిని కలుగజేయును. మహాత్మా! నాకు సద్గతి నిచ్చితివి. నీకు అనేక వేల సాష్టాంగ వందనములు అని ప్రార్థించి ధర్మగుప్తుడు స్వర్గమునకు జనెను.

మృగశృంగుడు ఏనుగను పుణ్యమార్గిగా ననుగ్రహించి తాను యప్పటియట్లు యమధర్మరాజును గూర్చి తపంబు జేయసాగెను.

ఈ విధముగా మూడహోరాత్రములు తపంబుచేయగా యమ ధర్మరాజు అతనియందు యనుగ్రహము గలవాడై మిక్కుటమైన తేజస్సు గలవాడున్ను, తెల్లని వస్త్రములు విశాలమైన కమలములు వంటి నేత్రములు గలవాడున్ను, సూర్యుని కుమారుడున్ను, హరిహరాదులకు యిష్టుడున్ను, దక్షిణ దిక్కునకు అధిపతియైన యమధర్మరాజు పాశాదులు ధరించి మహిష వాహనారూఢుడై ప్రత్యక్షమయ్యెను. అటుల ప్రత్యక్షమైన ధర్మరాజుని జూచి ప్రదక్షిణ నమస్కారములు జేసి చేతులు జోడించి ఈ ప్రకారము స్తోత్రము జేసెను. ఓ సూర్య పుత్రా! యమధర్మరాజా! నీవు పాపాత్ములకు భయంకరమైన రూపము దాల్చి భయమును పుట్టించు నిడుపాటి కోరలుగలిగి విశాలమైన ముఖముగలవాడవై నిడుపాటి వెంట్రుకలున్ను, వ్రేలాడు పెదవులున్ను, కాటుకకొండవలె వెలుగుచున్న దేహకాంతిగలిగి, పాపాత్ములను దండించుటకు ఆయుధములు ధరించి దున్నపోతునెక్కి వచ్చెదవు. ప్రళయ కాలపు మేఘముయొక్క ఉరుమువలె భయంకరముగా బొబ్బరించుచు ప్రళయకాలమందు వీచుగాలివలె మహావేగముతో పాపాత్ములకు గానబడెదవు. నోటమంటలు వెలుగగా అగ్ని స్వరూపుడవైన ఓ యమధర్మ రాజా! నీకు అనేక వందనములు. ఓ మహాత్మా! యమధర్మరాజా! పుణ్యాత్ములగువారికి చిరునవ్వుగల ముఖమున్ను విశాలమైన నేత్రములున్ను, విండ్లవలె కనుబొమలున్ను, దొండపండువంటి పెదవులుగలిగి, నిగనిగలాడెడు నవరత్నములచేత స్థాపింపబడిన బంగారు అలంకార

ములు ధరించి భుజకీర్తులు కిరీటము ధరించి రత్నాలహారమును ధరించి సింహాసనంబున కూర్చుండి తెల్లగొడుగు దాల్చి ధర్మాధర్మములను విచారించుటయందు సమర్థములగల సభికులచే కొనియాడంబడుచు ధర్మదేవతచేతను సత్యము శమము దమములచేతను సేవించబడుచు దర్శన మిచ్చెదవు. నిన్ను వేదాదులే అనేక వేల నోళ్ళతో స్తోత్రములు జేయుచుందురు. అటువంటి ధర్మ స్వరూపుడవు. నేను నిన్ను ఎంతని స్తోత్రమును చేయగలుగుదును? శ్లో. మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం, మహాత్మనః. అనునట్లు మనస్సు, వాక్కు, కర్మలచే యేక స్వరూప ముగా చేసి దర్శనమిచ్చిన ఓ యమధర్మరాజా! నీకునందనములు. సూర్యపుత్రుడవగుటచే పరిశుద్ధులగు వారి కోరికలను తీర్చువాడవు. యముడా! నీకు నందనములు అని స్తోత్రములు చేయగా సంతోషించి ఓ మృగశృంగా! నీవు చేసిన స్తోత్రమునకు సంతోషించితిని. నీకుయిష్ట మైన వరంబులను కోరుము అనిచెప్పెను.

ఆ మాటలకు మృగశృంగుడు, ఓ ధర్మస్వరూపుడా! యేనుగ కోపమున నూతిలోబడి ప్రాణములను వీడిన నలుగురు కన్యకలను బ్రతి కింపుమని కోరెను. అంతట యమధర్మరాజు నలుగురు కన్యకలకు ప్రాణములనిచ్చి బ్రతికించి మృగశృంగునికి మరికొన్ని వరంబులనిచ్చి అదృశ్యుడాయెను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల
మాఘమాస వ్రతమహాత్మ్యమునందు
అయిదవ అధ్యాయము

# ఆరవ అధ్యాయము

## మాఘమాస వ్రతమహాత్మ్యమున యమలోక వృత్తాంతము

వశిష్టమహాఋషి ఓ దిలీపమహారాజా! అంతట ఆకన్యకలు నలు గురు నిద్రనుండి లేచిన వారివలె లేచి సంతోషముతో వారిచుట్టునున్న

తల్లిదండ్రాదులతో తగిన మాటలను ఆడి తమతమ వస్త్ర అలంకార ములు దాల్చి ఎవరి యిండ్లకు వారు జేరిరి.

మృగశృంగుడు యముడు యిచ్చిన వరములకు సంతోషించి ఓ యమధర్మరాజా! నాచే జెప్పబడిన స్తోత్రము శ్రద్ధతో విన్నవారి కిని. చదివిన వారికిన్ని, అపమృత్యువు గలుగక భవసంబంధమగు దుఃఖములు కలుగక ఆరోగ్యవంతులుగా నుండునట్లు వరంబు కోరెను. యమధర్మరాజు నీవు కోరినట్లే యగుగాక! యిందు కొంత రహస్య మున్నది. దేవుడు లేడని వాదించువారికిన్ని పాప బుద్ధి గలవారికిన్ని యిది ఫలము నివ్వదు. ఎవ్వరు మంగళవారముతో గూడిన కృష్ణచతు ర్ధశి నాడు నన్ను గూర్చి తిల తర్పణము చేసి యీ స్తోత్రమును పఠించు దురో వారు ఎల్లకోర్కెలను నెరవేర్చుకుని ఆరోగ్యవంతులగుదురు అని జెప్పెను.

ఆ మృగశృంగుడు యమునివలన యిష్ట వరములను పొంది సంతోషించి తన యాశ్రమమునకు వెళ్లెను. ఎవరు ప్రతి దినము ఈ యమ స్తోత్రమును జదువుదురో అపమృత్యువును పొందరు. అంతట ఆ కన్యకలు యమలోకమునుండి వచ్చిరి. గావున యమలోక వృత్తాంత మును తమ తల్లులకు బంధువులకు యిట్లని జెప్ప దొడగిరి. తల్లిదండ్రు లారా! బంధువులారా! మేము నరలోకమున మూడు దినంబులుం టిమి. యమలోకము భయమును పుట్టించునదియై ఘోరముగా నుం డును. అది కడుపులో నుండునట్టియు, పుట్టుచున్నట్టియు, పుట్టినట్టియు, వయస్సు గలిగినట్టియు, అన్ని విధములైన ప్రాణులకున్ను స్త్రీ పురుష, నపుంసక భేదములేక అనుభవించవలెను.

ఆ యమలోకమునందు, యోగ్యులు, మధ్యస్థులు, అయో గ్యులు, తమవారు, యితరులను భేదములేక అందరును ఒకే విధముగా నుందురు. యమబాధలను అనుభవించని ప్రాణులు భూలోకమునందు లేనే లేరు. చేసిన కర్మఫలమును అనుభవించుటకు సందేహములేదు.

భూలోకమునందు మంచి కర్మలను జేయువారు మంచిమార్గముగుండా యమలోకమునకు పోవుదురు.

ఏ పుణ్యాత్ములు మాఘమాస స్నానవ్రతాదులను చేయుదురో వారును ఎల్లప్పుడు అనగా? లేచునప్పుడు, పరుండునప్పుడు, నడచునప్పుడు, భుజించునప్పుడు, శ్లో. హరేరామ హరేరామ, రామరామ, హరేహరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ, హరేహరే. యిది షోడశకనామం కలికల్మషనాశనం. అని పఠించుచు శ్రీహరి, గోవింద, మాధవ యని స్మరణ జేయుచుందురో వారు సుఖమైన మార్గమున ఉత్తర దిక్కుగా వెళ్ళి యమపురి చేరుదురు. ఎవరు అరుణోదయమందు మాఘస్నానముచేసి ఉశిరికాయలను రేగుపండ్లను దానము చేయుదురో వారు సంతోషముతో క్షణకాలమున యమలోకము పోవుదురు. మాఘమాసమునందు, అరటిపండ్లు మొదలగు పండ్లు దానము చేయుదురో వారు ఆపండ్లనే భుజించుచు యమలోకము చేరుదురు. మాఘస్నానము ప్రాతఃకాలమున చేసి నువ్వులు దానము చేయుదురో వారు సంతోషముతో చేరుదురు. ఎవరు మాఘమాసమున ప్రాతఃకాలమందు స్నానముచేసి యుశిరికపండ్లు పావుకోళ్ళు, చెప్పులు, గొడుగు, వస్త్రములు, పల్లకీ, గుఱ్ఱము, పానుపుమంచము, పీట, మొదలగునవి దానము చేయుదురో వారు శ్రమలేక ఆయా వాహనములనెక్కి సుఖముగా యమపట్టణము చేరుదురు. తోటలు, వేయించినవారు చెట్ల నీడగల మార్గమున చేరుదురు. పుష్పములు, మంచిగంధము, అత్తరువు, అద్దము, పాలు, పెరుగు మొదలుగునవి దానము చేయుదురో వారు విమానమునెక్కి యమలోకము చేరుదురు. దేవాలయములు, మఠములు, సత్రములు, కట్టించుచు పాడుపడునవి బాగుచేయించు వారును, దేవపూజ, అగ్నిపూజ, గురుపూజ, బ్రాహ్మణపూజ, తల్లిదండ్రుల పూజ. చేయువారును, పెద్దలను పండితులను గౌరవించువారును, మాఘమాసమునందు దీపారాధన చేయువారును. గృహ, కన్య, గో

దానములు చేయువారును, తాము కోరిన మంచి మార్గముల చేరు దురు. అన్నదానము. మంచినీళ్ళ దానము, రోగులకు మందులిచ్చు వారు, గురుశుశ్రూష చేయువారు, మాఘమాసమున బ్రాహ్మణ దంప తులకు తలఅంటి దంపతి పూజ చేయువారు, గుఱ్ఱమునెక్కి సుఖముగా చేరుదురు. బంగారు, వెండి, రత్నములు. తాంబూలము, పరిమళవస్తు వులు దానమిచ్చినవారు, పరిమళముగల మార్గమున యముని సభకు చేరుదురు. మాఘమాసమున పండ్లు దానము చేయువారు, అనేక నోములు నోచిన వారును, ప్రకాశముగల విమానమునెక్కి యముని సన్నిధికి చేరుదురు.

ఈ విధముగా జీవులు తాముచేసిన పుణ్యాపాప కర్మలనుబట్టి యమపురికి మార్గముండును. అచ్చట అనేక చిత్రములైన విమానములు గలవు. జీవులు తాము చేసిన దాన ధర్మములనుబట్టి ఆ విమానము లందుందురు. ధర్మస్వరూపుడైన ధర్మరాజు విమానమందు కూర్చుండి వచ్చుచున్న పుణ్యాత్ములను సింహాసనము నందుండి లేచి తన భటులతో ఎదురుగా వెళ్ళి కుశల ప్రశ్నముచేసి అర్ఘ్యపాద్యములనిచ్చి మర్యాద జేయును. అదియుగాక ఓ పుణ్యాత్ములారా! మీరు మంచి మనస్సుతో పరులకు ఉపకారమును జేసిన ధన్యులు. మీరు స్వర్గ సుఖమునకు పుణ్య కార్యములను జేసినవారు.

కాబట్టి ఈ విమానమునెక్కి దేవతాస్త్రీలతో సకల భోగ ములు అనుభవించుటకు స్వర్గమునకు పంపించివేయును. వారు యముని వద్ద అనుజ్ఞ తీసుకొని స్వర్గమునకు పోవుదురు.

మాఘమాసమునందు ప్రయాగయందు స్నానాదులు జేసిన వారు కాళ్ళకుమెత్తగానుండు మార్గమున బ్రహ్మలోకము జేరుదురు. మకరయుక్తమయిన సూర్యజయంతినిగాని, మహా శివరాత్రియందు గాని, కోటిపల్లిక్షేత్రమందు గౌతమీనదిలో స్నానాదులు జేయువారు

పుష్పకమునెక్కి సూర్యలోకమునకు జేరుదురు. ఎవరు కాశి, గయ, శ్రీరంగము మొదలగు క్షేత్రములందు మాఘమాస వ్రతమును జేయుదురో వారు శివ, విష్ణులోకములకు జనుదురు. మాఘమాసమందు శ్రీసూక్తము, పురుష సూక్తము, నమకము, చమకము, అరుణము, వేదాదులను పారాయణము చేయుదురో, లేక, తమకొరకు యితరులచేత చేయించుకొందురో వారువారు కోరిన కోరికల ప్రకారము ఆయా లోకములకు విమానములనెక్కి పోవుదురు.

ఓ తల్లిదండ్రులారా! కావేరి, గంగా, గోదావరి, కృష్ణ, నర్మద, మొదలగు పుణ్యక్షేత్రములందు మాఘమాస వ్రతస్నానము లను జేయుదురో వారు పుణ్యాత్ములు, వారు సుఖులై బ్రహ్మ, విష్ణు, శివ, సూర్య, స్వర్గాదిలోకములను పొందుదురు. యీవిషయమై మీరు సంశయము పడనక్కర లేదు. మేము కండ్లార జూచిన విషయములను జెప్పుచున్నాము. ముమ్మాటికి యదార్థములు. తక్కిన పుణ్యకార్యములను జేసిన పుణ్యాత్ములు విమానములనెక్కి యమలోకమునకు పోదురు.

ఇల్లుజేరిన పుణ్యాత్ములను యమధర్మరాజు నిండుకొలువున కూర్చుండి వారువారు జేసిన పుణ్యకార్యములనుబట్టి స్వర్గసుఖములను పొందుటకు ఆయా స్వర్గాదులకు పంపించివేయును. ఆ యమలోకమందు ధర్మరాజు సభలో అనేకవేలమంది పుణ్యాత్ములు గలరు. వారి నందరిని వారుచేసిన పుణ్యకర్మలను వివరించి చెప్పుటకు మాకు శక్తి జాలదు.

ఓ తల్లిదండ్రులారా? మేము నలుగురము యమపట్టణము నందున్నంత కాలము ధర్మరాజు, భార్యా, పుత్రి, పుత్రకాములతో విహరించు పుష్పవనములందు స్వేచ్ఛగా వారితో కూడా తిరుగుచూ మాకు తెలియని సంగతులు వారివలన తెలుసుకొనుచూ ఆ పుణ్యాత్ముల

జూచి కృతార్థులమైతిమి. మాఘమాస వ్రత స్నానాదులు మేము చేయుటచేత మా కన్నులు సఫలముగా యీ గొప్పకార్యములను జూడ గలిగితిమి అనిచెప్పిరి.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘమాస
మహాత్మ్యమునందు యమలోక వృత్తాంతము
ఆరవ అధ్యాయము

# ఏడవ అధ్యాయము
## నరకలోక వృత్తాంతము

దిలీపమహారాజునకు, వశిష్ట మహాఋషి చెప్పిన నరకలోక వృత్తాంతమును శుకమహాఋషి పరీక్షితు మహారాజునకు యీ విధముగా చెప్పుచున్నాడు.

ఆ కన్యలు, ఓ తలిదండ్రులారా! చుట్టములారా! శ్రద్ధగా వినుడు. ఆ యమలోకమునందు పాపులగువారు పడునట్టి బాధలు చెప్పుచున్నాము. ఈ భూలోకమునందు చెడ్డపనులు చేయువారును, దాన ధర్మములను చేయనివారును పాపాత్ములగుదురు అటువంటి పాపాత్ములు దక్షిణ ముఖముగా యమలోకము చేరుదురు. ఆమార్గము భయమును కలుగచేయును. అందుగల యమధర్మరాజు పట్టణము ఎనుబదియారు వేల యోజనములు వైశాల్యము గలిగియుండును. అది అనేక విధములైన రూపభేదములతో కనబడుచుండును. ఆ పట్టణము పుణ్యాత్ములగు వారికి దగ్గరగావుండును. పాపాత్ములకు ఆ మార్గము చాలా దూరముగానుండును. ఆ మార్గములలో కొన్ని వాడిగల ముండ్లచేతను కొన్ని గట్టి గులకరాళ్ళ చేతను, కొన్ని వాడిగల కత్తివంటి రాళ్ళ చేతను, అడుసుచేతను, కొన్ని క్రూరములైన కప్పలచేతను, కొన్ని సూదులవంటి దర్భగడ్డి చేతను, కప్పబడి యుండును. ఏటవాలుగా నుండు చరులచేతను, ఒక్కోరకములైన వృక్షముల చేతను, యిరుకుగల

కనుమల మార్గముల చేతను, నిండియుండును. పాపాత్ములను యీ మార్గములగుండ యమలోకమునకు దీసుకొని పోవుదురు.

ఇవిగాక ఆ యమపట్టణము లోనైన పాముగుంటలచేతను, కాలి కాలి పచ్చబడ్డ రాళ్ళచేతను, కాలుచున్న యిసుకచేతను, సూదివంటి మొనలుగల యినుప మేకులచేతను, నిండియుండును. ఆమార్గముల గుండా పోవు పాపాత్ములు ఎవరు లేక పెనగొన్న చెట్లకొమ్మలచే కారుచీకటి క్రమ్మి అడవిలో నుండును. అచ్చట కాలుచున్న నల్గు మార్గములు కలవు. వాటిలో కార్చిచ్చు మండుచుండగా కాలుచున్న రాళ్ళచేతను, కమ్ముకొన్న మంచుచేతను, మొలలోతుదాకా దిగబడు యిసుకచేతను, కాగి తెర్లుచున్న నీళ్ళచేతను, లెపించేయుచున్న పిడక నిప్పులచేతను, మెడ, కాళ్లు, చేతులు కఱచి పీకుకొని తిను సింహములు, పెద్దపులులు, మొదలగు క్రూర జంతువులచేతను, పెద్దపెద్ద జలగల చేతను, కొండచిలువలు, దష్టములైన ఈగలు, విషము గ్రక్కుచుండు పాములచేతను, మదించిన యేనుగు మందలచేతను, పెద్దకొమ్ములుగల మదించిన ఎద్దులు, గొఱ్ఱెపోతులు, దున్నపోతులు, ఒంటెలు గాడిదల చేతను, క్రూరములైన, శాకిని, ఢాకిని మొదలగు దయ్యములచేతను, రెండు మూడు తలలుగల పొడవైన కోరలుగల రాక్షస మూకలచేతను నానావిధములైన రోగములచేతను, బాధింపబడుచు, యమలోకమున కు పాపాత్ములను యమభటులు తీసుకుని పోవుదురు. యిసుక దుమ్ము నడిగా వీచు గాలిచేతను, రాళ్ళవానచేతను, మట్టివానలో మునిగి యేడ్చుచు ఉరుములకు త్రుళ్ళిపడుచు, కత్తులవానకు దేహము అవ యవములు తెగి చిల్లులుపడి, ఉప్పునీటివానచే మంటలకు తాళలేక గొంతెత్తి బిగ్గరగా నేడ్చుచు, చలిగాలికి వణుకుచు, నిప్పుగాలికి తాపము పుట్టి నాలుక, గొంతుక, ఎండి తపించుచు, దారి బత్తెము లేక జన సంచారము లేక, దిక్కుగానక, దుఃఖించుచు, కఠిన మార్గముగ యముని ఆజ్ఞ ప్రకారము యమపట్టణము జేరుదురు.

బ్రతికియున్నప్పుడు తల్లిదండ్రులనుగాని, బంధువులనుగాని, స్నేహితులనుగాని, యిరుగు పొరుగు వారినిగాని, జేరనియ్యని పాపాత్ములు. చచ్చిన పిమ్మట, దిగంబరులై నోటతడిలేక, గొంతుక, పెదవులు, ఎండి, బక్కటిల్లిన దేహముచే, చెప్పరాని ఆకటిచే యేడ్చుచుండగా, యమదూతలు యమపురికి లాగుకొని పోవుదురు. దేవతలను, బ్రాహ్మణులను, యితరులను కాళ్ళతో తన్నిన పాపులను, కాళ్ళకు సంకెళ్లువేసి తీసుకొని పోవుదురు. పెద్దలను దూషించినవారిని నాలుకకు అంకుసము గ్రుచ్చియు, సాధువులను కొట్టిన వారిని పెడరెక్కలు విరచికట్టియు, చేతులకు సంకెళ్లువేసియు, గొంతుకకు ఉరిపోసియు, తీసుకొనిపోవుదురు. మరికొందరను ముక్కుకు త్రాళ్లగట్టియు కొందరను మండుచున్న యినుప ఊచలచేత కడుపులో గుచ్చబడియు కొందరను యీటెలచేతను, బాణములచేతను, గుచ్చియు, తీసుకుని పోవుదురు. నానావిధములైన రంపములచేత కోయబడువారును, గుదియచేత తల చితుకునటుల కొట్టువారును, పురుగులచే గాయములు పడునట్లు కరపించువారును, ఆకలిచే అన్నముకొఱకు పరితపించువారును, ఎండతాపము సహింపలేక నీడకావలెనని కోరువారును, దానధర్మములు చేయక పోవుటచేత దారిబత్తెములేక దూతలచే కొట్టబడుచు, నడచు వారును, పాపులు తాముజేసిన పాపములను తలచుకొనుచు రోదనము జేయువారును, యమదూతల పాదములబడి బ్రతిమాలువారును, యీ విధముగా యముని సన్నిధానమునకు తీసుకొని పోవుదురు. పాపులుమార్గమధ్యమందు ఎంత కష్టపడి పోవుదురో యముని ఎదుట అంత నీచముగా జూడబడుదురు. పాపాత్ములు పాపబుద్ధి గలవారుగాన మనస్సు వికలమై వెఱ్ఱిచూపు పడియుందురు. వారికి యమధర్మరాజు భయము కలుగజేయు ముఖమున్ను వక్రములైన చూపులున్ను ఎఱ్ఱనైన తలవెండ్రుకలున్ను, పెద్ద గడ్డమున్ను, భయమును గలుగజేయు పొడుగుపాటి కోరలున్ను, పదునెనిమిది భుజములుగలిగి పాశాది ఆయుధములు

ధరించి కాటుక కొండవలె పర్వతాకారముగల శరీరముగలవాడై కన్నులవెంట నిప్పుజ్వాలలు వెడలుచుండగా? ఎఱ్ఱని వస్త్రములును ఎఱ్ఱనిపూలదండలున్న, ధరించి ప్రళయకాల మేఘమువలె గర్జించుచు మృత్యుదేవతవలె తాండవమాడుచు, మహిషము నెక్కియుండును. మహిషము వాడియైన పెద్దకొమ్ములు గలిగి ఎఱ్ఱని కన్నులు నిప్పుకణములు వెదజల్లును వాడిచూపులుగలిగి పాపుల ప్రాణములను తన ఘ్రాణరంధ్రములచే లోపలికి తీసుకొను సుడిగాలివలె పీచుచూ, శ్వాసములతో చూచుటకు భయముగానుండును. మారి మహామారి శక్తులు కాళరాత్రి మొదలగు రోగదేవతలు కొలుచుచుండగా శక్తి శూలము, అంకుశము, పాశము, చక్రము, ఖడ్గము, బాణములు, మొదలగు ఆయుధములు ధరించి, ఏకపాదులు, ద్విపాదులు, బహుపాదులు మొదలగు అనేక విధములైన శిరస్సులు గల కింకరులచే కొలువబడుచు, నుండును. చిత్రగుప్తాదులతో కూడ పాపులకు కనబడును. చిత్రగుప్తులు పాపులను జూచి ధర్మవాక్యములతో ఓ పాపులారా! మీరు పరుల ద్రవ్యము హరించితిరి. చక్కదనమును జూచి పరస్త్రీలను పొందితిరి. పెద్దలను దూషించితిరి. బ్రాహ్మణ, ధర్మసత్రవుల, దేవాలయములు ఆక్రమించి, హరించితిరి.

మీ చుట్టములను, స్నేహితులను, ఇరుగు పొరుగువారలను, దూషించితిరి. మీకు యిప్పుడు సాయపడు వారు లేక విచారించుచున్నారు. ఎఱిగియుండియు, పాపపనులు జేసి యిప్పుడు ఏడ్చిన ఎవరు విందురు గురువులను, పెద్దలను వెక్కిరించిరి. అని వారు వారు చేసిన పాపపుణ్య కార్యములు చెప్పుచుండగా, పంచభూతముల సాక్ష్యములను విని యముడు, వారు చేసిన పాపములకు తగిన దండన విధించి, తనకింకరులను పిలిచి నరకమనెడు అగ్నిలలో తగులవేయుడు. అని ఆజ్ఞాపించును. కింకరులు వెంటనే యము ఆజ్ఞ ప్రకారము పాపుల కాళ్లు

బట్టుకుని గిరగిర త్రిప్పుచు నేలమీద కొట్టియు, పైకి ఎగురవేసియు, దేహములు, చిల్లు చిల్లులు పడునట్లుగా నెత్తురు గ్రక్కులాగున పొడచి వారికి విధించిన నరకముల పారవేయుదురు. ఓ తల్లులారా! పాపులను దండించునప్పుడుగాని, నరకునప్పుడుగాని, కోయునప్పుడుగాని, అగ్ని గుండములందు పడవేయు నప్పుడుగాని, బాధలు అనుభవించుదురు గాని, దేహములు తగులబడిపోవుటగాని, ముక్కలై పోవుటగాని: సంభవించదు. ఎప్పటికప్పుడు దేహములు యథాప్రకారమే యుండును. ఓ తల్లిదండ్రులారా! చెడ్డబంగారమును పుటము పెట్టి మేలిమిజేయునట్లు పాపులు తాముచేసిన పాపఫలము లనుభవించి పరిశుద్ధులగుటకు బ్రహ్మచే అనేకవిధములైన నరకములు నిర్మింపబడియున్నవి. వాటిని మీకు జెప్పెదము వినుము.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘమాస
మహాత్మ్యమున నరకలోక వృత్తాంతము
ఏడవ అధ్యాయము

# ఎనిమిదవ అధ్యాయము

## బ్రహ్మచే నిర్మింపబడిన నరకలోకములు

ఓ తల్లులారా! వినుడు. ఈ యమలోకమునందు నరకములు యిరువది ఎనిమిదకోట్లు గలవు. ఘోర అను పేరుగల అంధకార నరక కోట్లు గలవు. దానికవతల సుఘోర. దానికవతల మహాఘోర, అతి ఘోర, ఘోర అనునవి గలవు. యీ నాలుగింటి క్రిందభాగమునందు అయిదవది ఘోరరూప. ఆరవది తాళతార, ఏడవది భయానక, ఎనిమిదవది కాళరాత్రి, తొమ్మిదవది భయోత్కట, పదియవది చండ, పదునొకండవది మహాచండ, పండ్రెండవది చండకోలాహల, పదమూడవది నరకకోటిలో అధికమైన ప్రచండ అనబడును. అనలకరాళి, వికరాళి, మొదలగు ఆరు నరక కోట్లుగలవు. యిరువదవది వజ్రయని

చెప్పబడును. దానికి అవతల ఎనిమిదినరకకోట్లు గలవు. అవి చెప్పెదము. త్రికోణ, పంచకోణ, సుదీర్ఘ, పరివర్తుల, సప్తభౌమ, అష్టభౌమ, దీప్త, మాయ అనబడును. యీ ప్రకారము యిరువది ఎనిమిదికోట్లు నరకములు యేర్పడియున్నవి. అవి అతి క్రూరములు. పాపులకు యాతన గలుగజేయును.

ఈ నరకములలో అయిదు అందు ఒక్కొక్క కోటికి ముఖ్యములు. వాటిలో కొన్ని నరకముల పేర్లను జెప్పెదము. 1. రౌరవము. యిందులో దేహధారులు ఏడ్చుచుందురు. 2. మహారౌరవము, యిందులో పాపులు గట్టిగా ఏడ్చుచుందురు. 3. తమము, 4. శ్వేతము, 5. ఉష్ణము 6. సుఘోరము, 7. సుదమము, 8. తీక్ష్ణము, 9. కర్మసందీపనము, 10. శంనము, 11. మహామాయ, 12. అతిరోమము, 13. సుభీమము, 14. సంకటము, 15. తీవ్రవేగము, 16. కరాళము, 17. వికరాళము, 18. ప్రకంపనము, 19. మహాపద్మము, 20. సువక్రము 21. కాలసూత్రము 22. ప్రతిష్ఠనము, 23. సూచీముఖము, 24 సునేమి, 25 ఖాదము, 26 సుప్రపీడము, 27. కుంభీపాకము, 28. సుపాకము, 29. కూపము, 30 అతిపదారుణము, 31. అంగారరాశి, 32. అసృక్పూయభవనము, 33 పాదనము, 34. విణ్మయము, 35. తుండి, 36. శకుని, 37. మహాశంవర్తనము, 38. క్రతువు, 39. సప్తజంతువు, 40. పంకలేపము, 41. పూతిమాంసము, 42. అద్రవము, 43. ఉచ్ఛ్వాసము, 44. నిరుచ్ఛ్వ 45. దీర్ఘము, 46. కూటశాల్మము, 47. అరిష్టము, 48. సునుహానాదము 49. పథావము 50. సుకతాపము, 51. ఋక్షము, 52. గజము, 53. వృకము, 54 శల్యము, 55. సింహము, 56. వ్యాఘ్రము, 57. మృగాధనము, 58. సూరకరము, 59. శ్వానము, 60. మహిషము, 61. వృషభము, 62. మేషము, 63. ఖరాననము, గ్రహము. 64. కుంభిపాకము 65. పక్షిము, 66. సర్పము 67. కూర్మము, 68. వాయసము, 69. గృధ్రము, 70. ఉలూకము, 71. జలూకము, 72. శాలూరము,

73. కలి, 74. కర్కటము, 75. గండకము, 76. పూతివక్రము, 77. రక్తాక్షము, 78. పూతిమృత్తిక, 79. కణధూమము, 80. తుషాగ్ని, 81. క్రిమినిచయము, 82. అమేయము, 83. అప్రతిష్ఠ, 84. రుధిరాన్నము, 85. శ్వభోజనము, 86. లాలాభక్షము, 87. ఆత్మభక్షణము, 88. శర్వభక్షణము, 89. సుదారుణము, 90. సంకటము, 91. సువిశాలము, 92. వికటము, 93. కంటకము, 94. పురీషము, 95. కటాహము, 96. వైతరణీనది, 97. సుతప్తము, 98. లోహశంకువు, 99. అస్థిభంగ, 100. ఏకపాదము. అశిక్షితము ఈ మొదలగునవి యిరువది ఎనిమిది కోట్లనరకములలో ముఖ్యములైనవి. రౌరవాదులైన నరకములలో పాపాత్ములు నరక బాధలనుభవించి కర్మశేషముననుభవించుటకు భూలోకమునందు దేహధారులై పుట్టుచుందురు. ఆజీవులు చేసిన పుణ్య పాపశేషములనుబట్టి గడ్డిపోచలు, వృక్షములు మొదలగు స్థావరములై పుట్టి దుఃఖములనుభవించుచు, పిమ్మట పురుగులు అటుపిమ్మట పక్షి జన్మమెత్తి దుఃఖములనుభవించుచు పిమ్మట గోవై పుట్టుదురు. ఆ గో జన్మనుండి మనుష్య జన్మమెత్తి పుణ్యపాపములు చేయుదురు. మేము యమలోకమందుండి చూచినవియు, వినినవియు, నైన విషయములను మీకుజెప్పితిమి. ఈ చెప్పబడిన నరకములన్నియు పాపములను జేసిన వానికేగాని, పుణ్యాత్ములను ఆ మార్గమునైన తీసుకొని రారు. ఈనరక భేదములను, నరకములను యింతకన్న ఎక్కువగా చెప్పుటకు మాకు శక్తిసామర్థ్యములు లేవు. అని చెప్పగానే, తల్లిదండ్రాదులు భయపడి ఓ బిడ్డలారా! మీరు నరకములను గూర్చి చెప్పుచున్నప్పుడే మా దేహములు వణకి దిగులుపుట్టుచున్నవి. యమలోకమునకు పోవుమార్గములను జెప్పినప్పుడే మా ప్రాణములు పోవుచున్నట్లున్నవి. మాకు నేమియు తోచుటలేదు. అనగానే కన్యకలు విని ఓ తల్లులారా! మీకు భయము వలదు. అని పాపాత్ములకేగాని పుణ్యాత్ములకుగాదు. మీరు మహాపుణ్యాత్ములు. మాఘమాస వ్రత స్నానాదులు జేయువారికి పాపము లెచ్చట

నుండివచ్చెను. మాఘమాస స్నాన వ్రతాదులు జేయువారు యిహ మందు సర్వసంపదలు అనుభవించి పరమందు పుణ్యాలోకమునకు పోవుదురు.

ఈ భరతఖండము కర్మ భూమియనియు భూలోకస్వర్గములను భవించు తావనియు చెప్పబడియున్నది. ఋషులు తపస్సు జేయుట సత్పురుషులు యజ్ఞములు యాగములు జేయుట సకల స్నాన దానా దులు జేయుట యీభరతఖండమునందేగాని మరి ఎక్కడను లేదు. మరి కొందరు పుణ్యాత్ములు మాఘమాస స్నాన వ్రతాదులు చేయుట తప స్సులను చేయుట యిచ్చటనే వారుచేయు కర్మలవలన యింద్రత్వము, దేవత్వము, గంధర్వత్వము, మనుష్యత్వము పొందుచున్నారు. ప్రాణు లును మనుష్యత్వమును బొంది దానివలన వ్రతములు తపస్సులు జేసి మోక్షమును పొందుచున్నారు. మీరు భయపడకుడు. మేము యమ లోకమందుండి చూచిన విషయమును జెప్పుచున్నాను. వినుడు.

ఒకనాడు ఒక మహాపురుషుని విమానమునందుంచి యముని సన్నిధికి తీసుకొనివచ్చిరి. వీడు చేసిన పుణ్యమేమని యముడు చిత్ర గుప్తాదుల నడిగెను. చిత్రగుప్తులు యిట్లుచెప్పినారు. ఓ దేవా! వీడు కాశీక్షేత్రమందు ఒక మాఘమాసవ్రతమును, ప్రయాగయందు ఒక మాఘమాసవ్రతమును గయయందు ఒక మాఘమాసవ్రతమును కోటిపల్లి క్షేత్రమందు ఒక మాఘమాసవ్రతమును శ్రీరంగమందు ఒక మాఘమాసవ్రతమును నర్మద, తపతి, సింధు, కృష్ణ, కావేరి మొదలగు క్షేత్రములందు మాఘమాసస్నాన వ్రతాదులు చేసి యున్నాడు.

అందువలన వీడు మొదటచేసిన అన్నివిధములైన పాపములు నశించినవి. నిత్యము హరిహరాదులను పూజించుట, ధ్యానించుట, చేతను యింత పుణ్యము గలిగినది. అని చెప్పగనే వానిని గౌరవించి స్వర్గమునకు పంపించివేసెను. పుణ్యాత్ములకు ధర్మరాజు ధర్మస్వరూపము

తోను, పాపాత్ములకు భయంకర రూపముతోను కానబడును. కాబట్టి మీరు పాపములు జేసియుంటిమని సంశయము పడకుడు. కొద్దిరోజులలో మాఘమాసమువచ్చుచున్నది. మాఘమాస స్నాన వ్రతాదులు జేయుడు. మీకు మాఘమాసము నెలరోజులు స్నానవ్రతాదులు జేయుటకు శక్తిలేనియెడల, రధసప్తమి, శుద్ధఏకాదశి, పూర్ణిమ, కృష్ణచతుర్దశి, యీ మొదలగు పర్వదినంబులను జేసినను పూర్తి ఫలముగలుగును. మీరు కోరిన స్వర్గము లభించును అనిజెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందు
గల నరకలోక వృత్తాంతము
ఎనిమిదవ అధ్యాయము

# తొమ్మిదవ అధ్యాయము

## మాఘమాస వ్రతము నరకమునుండి విముక్తులజేయుట

శుకమహాఋషి ఓ పరీక్షితా! దిలీపునకు వశిష్ట మహాఋషి జెప్పిన యితిహాసమును జెప్పుచున్నాను వినుము.

పరీక్షితు ఓ శుకమహాఋషీ! యమపట్టణము యిచ్చటకు యెనుబది యారువేల యోజనములున్నదని జెప్పియుంటివి. అంత దూరమందున్న యమపట్టణమునకు ఆ కన్యలు ఎన్నిదినములలో పోయి వచ్చిరి. వారి శరీరములు వారు వచ్చువరకు ఎట్లు చెడకుండగా వున్నవి. ఈ సంశయమును పోగొట్టునట్లు జెప్పుమని కోరెను.

శ్రీశుకుడు ఓ గొప్ప బుద్ధిగల పరీక్షితా! నీ వడిగిన రహస్యమును జెప్పెదను వినుము. ప్రాణము పోయిన దేహము కృతయుగమునందు నలుబది దినములు చెడకుండగా నుండును. త్రేతాయుగమునందు ముప్పది దినములు చెడకుండగా నుండును. ద్వాపరయుగమునందు యిరువది దినములవరకు చెడిపోకుండగా నుండును. కలియుగమునందు పది దినములు చెడిపోకుండగా నుండును. కృతయుగమున బుద్ధి

కుశలత నాల్గుపాళ్లు కలిగియుండును. త్రేతాయుగమందు మూడుపాళ్లును, ద్వాపరయుగమందు రెండుపాళ్ళును, కలియుగమందు బుద్ధికుశలత ఒక పాలు కలిగియుండును. చచ్చిన పదిరెండు దినములు వరకు భూలోకమందే యుండి పుత్రాదులిచ్చు పదార్థములను తినుచుండును. పిమ్మట జీవులు యమపట్టణము జేరుదురు అని చెప్పబడియున్నది. అది పాపాత్ముల విషయముగాని పుణ్యాత్ముల విషయము కాదు. రహస్యము చెప్పెదను వినుము. యమభటులు గాలివలె అతిశీఘ్రముగా వచ్చుచు పోవుచుందురు. యమలోకములకు పోవువారును ఆ ప్రకారమే పోవుదురు. కొందరు శివానుగ్రహము వలన పోవుదురు. మరికొందరు విష్ణుదేవుని అనుగ్రహమున పోవుదురు. కొందరు బ్రహ్మ అనుగ్రహము వలన అతిశీఘ్రముగా వచ్చిపోవుదురు.

ఈ కన్యలు యముని అనుగ్రహము వలన యమలోకమునకు చేరబడి అందలి పుణ్యపాప ఫలముల శోకములను పాపులనుభవించు యాతనలను జూచి వచ్చిరి. వీరు యమలోకమునకు పోయిన పిమ్మట మూడు దినములవరకు వీరి తల్లిదండ్రులు, మంచి గంధాదులచే కాపాడుచుండిరి. మృతిపొందిన వాని దేహము అలంకరించిన పిమ్మట ప్రేతత్వము సంభవించును. గాని అంతకు ముందు ప్రేతత్వదోషములేదు. ఆ శవమునకు అంటుదోషములేదు. మాఘస్నానము హరివాసరము శ్రీకృష్ణజయంతి శ్రీరామ జయంతి శ్రీ సూర్యజయంతి మొదలగు వాని పుణ్యకార్యములచే అనేకులు ఈ ప్రకారము యమలోకమునుండి భూలోకమునకు, భూలోకమునుండి యమలోకమునకు వచ్చుచు పోవుచుందురు.

పూర్వకాలమున జరిగిన యితిహాసమును చెప్పెదను వినుము. పుష్కరుడను బ్రాహ్మణుడు యమలోకమునకు బోయి నరక బాధలను పొందుచున్న అనేక మంది మానవులను నరకమునుండి రక్షించి మరల భూలోకమునకు వచ్చి తన యింట సుఖముగానుండెను. త్రేతాయుగ

మున శ్రీరాముడు రాజ్యము జేయుచుండగా ఒక బ్రాహ్మణునకు ఒక్కడే కొడుకు గలిగియుండి వాడు చనిపోయి యమలోకమునకు వెళ్ళి మరల బ్రతికెను. ఈ కథను నీవు వినలేదా?

దేవకీదేవి కొడుకు శ్రీకృష్ణుడు తన గురువైన సాందీపుని కొడుకు మొసలిచే మ్రింగబడి చనిపోగా చాలా కాలమునకు యమలోకమునుండి తీసుకొని వచ్చి గురువునకు సమర్పించెను. వేరుగాక, అనేకులు యమలోకమునకు పోయి మరలవచ్చి యున్నారు. గనుక యీ శిష్యులు తిరిగి వచ్చినందులకు నీవు సందేహముపడనక్కరలేదు.

అనగానే పుష్కరుడను బ్రాహ్మణుడెవడు? అతడు ఎట్లు వచ్చెను? అతనిచేత నరకలోకములోనున్న పాపులు ఎట్లు రక్షింపబడిరి. రాముడు రాజ్యము జేయునప్పుడు బ్రాహ్మణుని కొడుకు ఎల వచ్చెను. శ్రీకృష్ణుడు మొసలి కడుపులో జీర్ణించిన తన గురువు కొడుకును ఎట్లు బ్రతికించెను. ఇది అంతయు పూర్తిగా నాకు తెలియునట్లు చెప్పవలసినదని కోరెను.

శుకమహాయోగి ఓ పరీక్షితా! చాలా పుణ్యాత్ముడును, మంచి నడవడి గలవాడును అయిన పుష్కరుని చరిత్ర జెప్పెదను శ్రద్ధగా వినుము.

నందిగ్రామమను పట్టణమునందు పుష్కరుడను బ్రాహ్మణుడు గలడు. అతడు తాను నిత్యము చేయవలసిన స్నానాది అనుష్ఠానము లన్నియు అతి శ్రద్ధాభక్తులతో చేయుచుండు వాడును, పంచభూతము లందు దయగలవాడును, మాఘస్నానాది వ్రతములందు శ్రద్ధగల వాడును, సదా వేదాధ్యయనము చేయువాడును, ఇతర చింతలు లేకుండ హరి హరాదుల ఆరాధించువాడునై యుండెను.

ఇటువంటి నడవడిగల పుష్కర మహాముని నంది గ్రామము నందు భార్యాపుత్రాదులతో కాపురముండి నిత్యాగ్ని హోత్రములను జేయుచు శ్రీమహావిష్ణూ, శ్రీకృష్ణా, దామోదరా, అచ్యుత, నార

శింహా, గోవింద, హరిహర స్వరూపా, పరమేశ్వర, అని భగవంతుని స్మరించుచుండును. గాని యితర విషయములను వదలివేశి భగవంతునే స్మరించుచుండెను. ఇట్లుండగా ఒకనాడు యమధర్మరాజు నంది గ్రామ మందుగల పుష్కరుని తీసుకొని రండని తన కింకరులకు ఆజ్ఞాపించెను. వారలు ఆ యాజ్ఞ ప్రకారము భూలోకమునకు వచ్చి పుష్కరుని బట్టు కొని యమపట్టణమునకు తీసుకొని పోయిరి. అప్పుడు యమధర్మరాజు తన భటులు తీసుకొనివచ్చిన పుష్కరుని తేజస్సు జూచి భయముపుట్టి మర్యాదజేసి కూర్చుండబెట్టి కింకరులను జూచి ఓరీ మీరు తప్పు పని జేసితిరి. ఆ గ్రామమునందే పుష్కరుడను వాడు మరియొకడు గలడు. వానిని తీసుకొని రమ్మంటిని. మీరు వానిని వదలి యీ మహాత్ముని తీసుకొని వచ్చితిరి. ఈయన అన్ని ధర్మములు తెలసినవాడు. మాఘ స్నాన వ్రతాదులను జేయుచు విష్ణుభక్తిగలిగియున్నవాడు. అటువంటి వానిని తెచ్చిరి. మీరు వెంటనే వెళ్ళి వానిని తీసుకొని రండని చెప్పి పంపించి వేసెను.

పిమ్మట పుష్కరుని జూచి ఓ మహానుభావా! నిన్ను గూర్చి నీ భార్యాపుత్రాదులు విచారించుచున్నారు. గాన వెంటనే భూలో కమునకు పొమ్మని జెప్పెను.

ఆ మాటలు పుష్కరుడు విని ఓ భగవంతుడవైన ధర్మరాజా! పాపాత్ములు యాతనా శరీరమును పొంది నరకమునందు బాధలు పొందుచుందురుగదా? ఆ నరకములను జూడవలెనని కోరిక గలదు. నాకోరిక నెరవేర్చవలయునని ప్రార్థించెను. యమధర్మరాజు ఆమాట లను విని ధర్మస్వరూపులైన తనభటులను బిలచి మహారౌరవము, శ్వభోజనము, విశసనము, అసిపత్రము, కుంభీపాకము, క్రిమిభక్షణము, వైతరణి, రోదనము, తప్తవాలుకము, మొదలైన నరకములను ఈ పుష్కరునికి జూపించి యింటికి పంపించివేయుడని ఆజ్ఞాపించెను.

యముని ఆజ్ఞ ప్రకారము యమభటులు పుష్కరుని తీసుకొని వెళ్ళి నరకములను జూపించుచుండిరి. ఆ నరకములందు పాపాత్ములను ఎల్లప్పుడు బాధించుచుండిరి. కొందరను కొల్మిలందు దిగవేయబడిన వారును, పెద్దపులులచే పీకుకుని తినబడువారును, పురుగులచే తినబడు వారును, కత్తులచే నరకబడువారును, అసిపత్రమందు కోయబడు వారును, రంపములచే కోయబడు వారును, గొడ్డళ్ళచే మోదబడు వారును, ఉప్పుబురదయందు దిగవేయబడిన వారును, ఎత్తు మెరక స్థలములనుండి క్రిందికి త్రోయబడు వారును, చలిగాలిచేత బాధపడు వారును, యాతనా దేహమును పొంది, అనేక విధములైన బాధలచే బాధింపబడుచున్న పాపాత్ములను జూచి పుష్కరుడు భయకంపితుడై గట్టిగా యేడ్చుచు దూతలతో యిట్లని జెప్పెను.

ఓ యమభటులారా! యీ పాపాత్ములతో నేను మాట్లాడుటకు అనుజ్ఞ యిమ్మని కోరి అనుజ్ఞ తీసుకుని పాపాత్ములతో యిట్లని మాట్లాడెను.

ఓ నరవాసులారా! మీరు మీ పూర్వజన్మమునందు కొంచెమైనను ధర్మము జేయకపోవుటచేతనే గదా! యాతనా దేహమును పొంది నరకములో అనేక విధములైన బాధలు పడుచున్నారు. అని అడుగగానే నరకవాసులు యిట్లు చెప్పుచున్నారు. ఓ పుణ్యాత్ముడవైన పుష్కరా! మేము భూలోకమునందు బ్రతుకు శాశ్వితమని నమ్మి, ఆ ధనము మా వెంటవచ్చునని నమ్మి కొంచెమైనను మాఘస్నాన వ్రతాదులుగాని, దాన ధర్మములనుగాని జేయక, వ్రతాదులను జేసిన వారిని తిట్టి ధనము పాడుచేయుచున్నారని దూషించి, మేము జేయక, యితరులు జేయుట జూచి ఓర్వలేక వారిని వెక్కిరించుటచేత యీ యాతనా దేహములను బొంది యిట్లు బాధింపబడుచున్నారము. మేము పూర్వ జన్మమునందు పరుల ద్రవ్యములను దొంగిలించి పరుల భార్య లను ఆశించి వివాహములను ధర్మకార్యములను, చెడగొట్టి యిట్లు

బాధింపబడుచున్నారము. సజ్జనులపై నిందలు మోపి, పతివ్రతలను కులస్త్రీలను దూషించి యిట్లు బాధింపబడుచున్నాము. బ్రాహ్మణులను గురువులను, దేవతలను, పెద్దలను, బాధించి నరకమనుభవించు చున్నాము. ధనాపేక్షచేత వేదములనమ్మి విద్యనమ్మి యిట్టిబాధలు పడుచున్నాము. రోగులు యిరుగు పొరుగుల నున్నవారు పస్తుపడి యుండగా మేము మృష్టాన్నములని యిట్లు వేగుచున్నాము. మాఘ మాసమందు సూర్యోదయకాలమునందు మేము స్నానము చేయక స్నానము జేయువారిని దూషించి బాధపడుచున్నాము. సంఘాన్నము, విక్రయాన్నము, దురాన్నము తిని బాధలనుభవించుచున్నాము. దాహము అడిగినవారికి యివ్వక దాహము కొరకు వెళ్ళుచున్న పశువులను అడ్డ-గించే వెళ్ళనీయక యిట్లు బాధపడుచున్నాము. ఉపవాసము చేసిన వారిని పోషించినవారిని బాధించి మేము నరకము పొందియున్నాము.

మిత్రులకు, పెద్దలకు, దేవాలయములకు ద్రోహముచేసి యిన్ని విధముల బాధింపబడుచున్నాము. ఓ బ్రాహ్మణోత్తమా! ఎంతవరకని చెప్పగలము. మేము భూమిలయందు ఎన్నివిధములైన పాపములను చేసి యున్నామో దానికి తగిన నరకబాధలను యిప్పుడు పొందుచున్నాము. నీవు మహాపుణ్యాత్ముడవు. నిన్ను చూడగనే మాకు నరకబాధలు కలుగుటలేదు. నీవు కొంతకాలమిచ్చటనుండి మా బాధలను పోగొట్ట వలసినదని ప్రార్థించిరి. పుష్కరుడు ఆమాటలువిని నరకవాసులారా! మీరు ఒకప్పుడైనను భగవంతుని శ్లో. శివశివ నేతి, శివేతివా, భవభవేతి భవేతివా, హరిహరేతి, హరేతివా, భజనమశ్శమున నిరంతరం అనిగాని, శ్లో. గోవింద గోవింద హరేమురారే గోవింద గోవింద రథాంగపాణే గోవిందగోవింద ముకుంద కృష్ణా గోవిందగోవింద నమోనమస్తే అని గాని ఎప్పుడును స్మరించుటగాని, పూజించుటగాని చేసి యెరుగరు. మీరు బ్రాహ్మణులకుగాని, దేవతలకుగాని, దండముపెట్టి యెరుగరు. కనుకనే మీరు యిట్టి బాధలు పడుచున్నారు. మీరు ఎన్నడును దేవా

లయములకుగాని, నదీ స్నానమునకుగాని వెళ్ళినవారుకాము. మీకు భగవంతుని పూజించుటకు మీ వద్దనున్న ధనము ఖర్చుపెట్ట నక్కర లేకుండగా కళ్ళు కాళ్ళు చేతులు బాగుగానున్నవి. అడవియందు తులసిపత్రి, బిల్వపత్రి, సమృద్ధిగా దొరకును. నదులందు నీరు సమృద్ధిగా దొరకును. అటులు సులభముగా దొరకు ఫలపుష్ప పత్రాదులచేతనైనా భగవంతుని ఆరాధించక యిప్పుడు మొరపెట్టిన ఏమి లాభము గలుగును. సకల పాపములను పోగొట్టి హరినామస్మరణ చేయుడు. ఆ నామస్మరణచేత మీకు మేలుగలుగును. అనిజెప్పి వారి చేత హరినామస్మరణ జేయించెను.

పాపాత్ములైన నరకవాసులు ఆమాటలువిని పుణ్యాత్ముడవైన నీవు నీ దేహముమీదుగా వచ్చెడి గాలిమాకు సుఖముగానున్నది. క్షణకాల మిచ్చట నుండవలశినదని కోరిరి. పిమ్మట పుష్కరుడు నరక వాసులచే హరినామ స్మరణ జేయించి ధర్మరాజు దర్శనమునకు వెళ్లెను.

యమధర్మరాజు పుణ్యాత్ముడవైన పుష్కరా! నీవు నరకములు అన్నియు జూచితివిగదా? యింక నీవు భూలోకమునకు పొమ్ము. నీ భార్యాపుత్రాదులు శోకముచే తపించి యేడ్చుచున్నారు పుష్కరుడు యిట్లు జెప్పుచున్నాడు. ఓ భగవంతుడవైన ధర్మరాజా! నీవు ధర్మాత్ముడవు. ధర్మదేవతవు. అని స్మృతులు జెప్పుచున్నవి. నేను ఈ నరకమునందు దూతలచే కొట్టబడినవారను, నరికబడువారను, తైలాదులలో ముంచబడువారను, చూచినది మొదలు నాకు మిక్కిలి దుఃఖము గలుగుచున్నది.

సకల భూతములందును వసించు వాసుదేవుడవును, సర్వేశ్వరుడవును అయిన నిన్ను హరిహర బ్రహ్మాదులుగా భావించి పూజించుచుందురు. అట్టి నీవు పాపులకు యమరూపమున కనబడుచుందువు. పుణ్యాత్ములకు, ధర్మాత్ముడవుగాన నాయందు దయయుంచి నేను

చూచిన నరకవాసులను వదలివేయుడును. ఆపాపులచే హరినామస్మరణము చేయించి నేను నీ దర్శనమునకు మరలివచ్చితిని అని ధర్మరాజును ప్రార్థించెను. యమధర్మరాజు పుష్కరుడు చేసిన పనికిన్ని అతని స్తోత్రమునకున్ను సంతోషించి వారివారి నరకములనుండి పాపులను వదలివేయించెను. పాపాత్ములు నరకమునుండి విడువబడినవారై సంతోషముతో వచ్చి యముని సన్నిధినున్న పుష్కరునితో మహాత్మా! నీ అనుగ్రహమువలన పాపవిముక్తులమైతిమి. నీ కీర్తి అన్నిలోకములందును వ్యాపించుగాక అని పలికిరి. ఆ మాటలువిని యమధర్మరాజు సంతోషించి పుష్కరుని జూచి నీకు కావలసిన వరమును కోరవలసినదని చెప్పెను.

స్కాంధ పద్మ పురాణములందు గల మాఘమాస
మహాత్మ్యమున నరకవిముక్తి
తొమ్మిదవ అధ్యాయము

# పదియవ అధ్యాయము

## రాముని రాజ్యమందు బ్రాహ్మణ బాలుడు యమలోకమునుండి వచ్చిన విధము

పుష్కరుడు ఓ ధర్మరాజా! నీవు సంతోషించుటకంటె వేరు వరము నక్కరలేదనెను. ఆ మాటలు ధర్మరాజువిని ఓ పుష్కరా! నీవు పోయి భూలోకమునందు భార్యాపుత్రాదులతో సుఖముగా నుండుము. నీకును నీ భార్యాపుత్రాదులకున్ను, నావలన మృత్యుభయము లేదు. అదిగాక నీయందు ప్రేమగల బంధువులకున్ను, స్నేహితులకున్ను, అపమృత్యు భయము వుండదు. ఏ మానవుడు నీ మహిమను వినుచుండునో యితరులకు జెప్పుచుండునో వారికి నావలన అపమృత్యుభయముండదు. అనిజెప్పి యముడు పంపించగా పుష్కరుడు సంతోష

ముతో భూలోకమునకు వచ్చి భార్యాపుత్రాదులతో మునుపటివలెనే శ్రీహరి ధ్యానపరాయణుడై సుఖముగా నుండెను

ఓ పరీక్షితా! శ్రీవిష్ణునామ సంకీర్తన వలన ఎంత మహిమ గలదో నరకలోక వృత్తాంతమును వింటివిగదా! బ్రాహ్మణుని కుమారుడు యమలోకమునుండి వచ్చిన వృత్తాంతమును జెప్పెదను వినుము.

పూర్వ కాలమునందు సూర్యవంశపు రాజులచే పరిపాలింపబడుచు మూడు లోకములందు కీర్తి పొందిన అయోధ్యయను పట్టణము గలదు. అందు దశరధమహారాజు కొడుకు శ్రీరాముడు భార్యా సీతాదేవి సహితముగా సహోదరులు భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సేవింపుచుండగా సుఖముగా రాజ్యము పాలించుచుండెను.

ఇట్లుండగా అయోధ్యాపట్టణమందు నివసించుచున్న దేవశర్మయను బ్రాహ్మణ పండితుడు గలడు. అతనికొక్క కొడుకు గలడు. ఆ బ్రాహ్మణుని కొడుకు ఒకరోజున చనిపోయెను. ఆ దేవశర్మ చనిపోయిన కుమారుని జూచి భార్యతో యిట్లనియెను. ఓ సహచారిణీ! మనకు ఒక్కడే కొడుకు గలడు. వాడు మనకు ముసలిగనప్పుడు ఆశించియుంటిమి. మనమును వృద్ధాప్యమునకు వచ్చుచున్నాము. మనము ఏ పాపములు చేసిన వారము గాము. యీ కుమారుడు మనకు ఉత్తర కార్యములను జేయునని ఆశించి యుంటిమి. శ్రీరాముడు పాలించు రాజ్యమందు అధర్మము జరుగుచున్నది. తండ్రి బ్రతికియుండగా కుమారుడు చనిపోవుట అధర్మము, ఈ అధర్మ దోషము శ్రీరాముడు పరిపాలన చేయుటలో నున్నదిగనుక,

ఈ బాలుని తీసుకుని సింహద్వారమునకు వెళ్ళి శ్రీరామునితో చెప్పుకుందాము. అని ఆ శవమును తీసుకొని తల్లిదండ్రులు సింహద్వారమునకు వచ్చి శవమును ఎదురుగ బెట్టి, కొడుకా, కొడుకా యని కేకలు వేయుచు మేము పూర్వ జన్మమునందు ఏ పాపము జేయుట వలన యీ విపరీతపు చావు గలిగినదో నాకు తెలియదు. తండ్రి బ్రతికి

వుండగా పుత్రుడు మృతిబొందుట ఏ రాజు ధర్మ పరిపాలనమందు జరిగినది. ఓ రామా! మేము మృతిబొందిన కుమారునితో కూడా మృతి బొందుదుము. నీవు భార్యాసహోదరులతో సుఖముగా నుండుము. అని విలపింప దొడగిరి.

ఆ మాటలు శ్రీరామచంద్రుడు చారులవలన విని పాదచారియై సింహ ద్వారమువద్దనున్న బ్రాహ్మణుని సన్నిధికివచ్చి నమస్కరించి బ్రాహ్మణునివలన సంగతి తెలుసుకుని బ్రాహ్మణుని ఆయన భార్యను ఓదార్చి లక్ష్మణా! నీవు ఈ బ్రాహ్మణ దంపతులను మృతశరీరమును జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండునట్లు తగిన యేర్పాటులను జేసి తాను ధనుర్బాణములను ధరించి కుబేర పుష్పకమును ధ్యానించెను. వెంటనే పుష్పకమురాగా, ఓపుష్పకరాజమా! నేను పరిపాలనము జేయు రాజ్యమునందు, అధర్మము జరుగుచున్నది. తండ్రి బ్రతికివుండగా కుమారుడు మృతినొందుట అధర్మము గనుక నీవు అటుల అధర్మము జరుగుచున్న తావునకు జనుము అని చెప్పి నమస్కరించి పుష్పకము నెక్కెను. వెంటనే ఆ పుష్పకము అచ్చటకు నూరు యోజనములు దూరమందుగల పర్వతశిఖరమునందు సరస్సు సమీపమందు తల భూమిని మోపి పాదములు పైకి ఎత్తి (కపాలాసనమున) ఘోర తపస్సు జేయుచున్న శంభుకుడను శూద్రుని ఎదుటకుజని పుష్పకము నిలచెను. శ్రీరాముడు వెంటనే పుష్పకముదిగి శూద్రుని వద్దకు వచ్చి నీవు ఎవరివు? నీవు అధర్మ తపంబు జేయుటకు కారణము యధార్థముగా జెప్పుమనెను.

శంభుకుడు తన ఎదుటనున్న దివ్య మంగళ విగ్రహరూపసమానమైన శ్రీరాముని జూచి తపంబు చాలించి సాష్టాంగముగా దండము పెట్టి దేవా! నేను శూద్ర జాతివాడను. నాపేరు శంభుకుడందురు. నేను ఈ దేహముతో స్వర్గమునకు పోవుటకుగాను ఈ ఘోరతపస్సు జేయుచున్నాను. అని జెప్పెను.

ఆ మాటలు విని ఓ శంభుకుడా! నీవు యుగ ధర్మములను తెలిసి కొనక అధర్మ తపంబు జేయుచున్నాడవు. నేను పరిపాలనము చేయు రాజ్యమందు అధర్మము జరుగ రాదు. నీవు అధర్మము జేయు చున్నావు. గావున నీ శిరస్సు ఖండించి నీకు ముక్తి యిచ్చుచున్నాను. అని జెప్పి ఒక్క బాణమున శిరస్సు ఖండించి వేసెను. వెంటనే శంభుకుడు స్వర్గమునకు పోయెను. దేవేంద్రాదులు సంతోషించి పుష్ప వర్షము కురిపించిరి. యెప్పుడు శంభుకుని తల నరకబడెనో వెంటనే బ్రాహ్మణ కుమారుడు నిద్రనుండి లేచిన వానివలె లేచి తల్లిదండ్రాదుల కున్ను, చుట్టునున్న పరివారమునకున్ను, సంతోషము కలిగించెను. అంతట ప్రజలు శ్రీరామచంద్రుని మహిమను, రాజ్యపాలనమునందు గల సామర్థ్యమును అనేక విధముల పొగడుచుండిరి. అంతట పుష్పకము నెక్కి శ్రీరాముడు తన సింహద్వారమందున్న బ్రాహ్మణుని వద్దకు వచ్చి నమస్కరించి నిలుచుండెను. అంతట బ్రాహ్మణ దంపతులు కుమారునితో కూడా శ్రీరాముని సన్నిధికి వచ్చి ఓ రామా! నీవు శ్రీమహా విష్ణుని అంశమున మాయా మానుష రూపమున జన్మించి రావణ కుంభకర్ణాదుల సంహరించి దేవతలను రక్షించిన మహానుభావుడవు. అటువంటి వాడవు నా కుమారుని బ్రతికించి నాకు వంశమున్ను, ప్రాణములను కాపాడితివి.

నేడు లగాయతు నెలకు నాల్గు పర్యాయములు వర్షములు కురియుచు ప్రజలు పాడి పంటలతోటిన్ని, పుత్రులతోటిన్ని, పుత్రికల తోటిన్ని, పౌత్రాదులతోటిన్ని సుఖించెదరు. రామరాజ్యమని పిలువబడును అని అనేక విధముల స్తోత్రములు జేయగా శ్రీరాముడు సంతోషించి బ్రాహ్మణునకు కోరినంత ధనమునుయిచ్చి పంపివేసెను.

శ్రీరాముడు సీతాదేవితోటిన్ని, సహోదరులతోటిన్ని సుఖంబుగా నుండెను. ఓ పరీక్షితా! ఏ రాజు ధర్మము తప్పకుండా పరిపాలనము జేయునో ఆ రాజు పరిపాలనజేయు రాజ్యమందు ప్రజలు సుఖించెదరు.

ఏ రాజు ధర్మమును, న్యాయశాస్త్రమును తప్పి పరిపాలన జేయునో ఆ రాజ్యమందు కాటకములు, అకాల మృత్యువులు, జార, చోర బాధలు గలిగి పీడింపబడుదురు. వింటివిగదా? బ్రాహ్మణ కుమారుడు యమలోకమునకు వెళ్ళి మరల వచ్చిన కథను. యింకను శ్రీకృష్ణుడు తన గురువు సాందీపుని కుమారుని యమలోకమునుండి తీసుకుని వచ్చిన విషయమును జెప్పెదను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘ
మహాత్మ్యమున బ్రాహ్మణ బాలుడు యమ
లోకమునుండి వచ్చిన వృత్తాంతము
పదియవ అధ్యాయము

# పదునొకండవ అధ్యాయము

## సాందీపుని పుత్రుడు యమలోకమునుండి బ్రతికివచ్చిన వృత్తాంతము

శ్రీ శుకమహాఋషి పరీక్షిత్తు మహారాజుంజూచి ఓ పరీక్షిత్తా! శ్రీకృష్ణుడు తన గురువు సాందీపుని కుమారుని యమలోకమునుండి దెచ్చిన వృత్తాంతమును జెప్పెదను శ్రద్ధగా వినుము.

పూర్వము ఈ ఆర్యావర్తమునందు అవంతి యను పట్టణము గలదు. ఆ పట్టణమునందు వేదాధ్యయన సంపన్నులయిన, బ్రాహ్మణ సమూహముచేతను, నదీనదములచేతను, అనేక విధములైన ఫల పుష్ప లతా సమూహములైన వృక్షాదులతోడను నిండుకొని ఎనిమిది మైళ్ళు పొడవున్ను ఎనిమిది మైళ్లు వెడల్పున్ను గలిగి ధన ధాన్యములతోడను, పాడిపంటలచేతను, తులదూగుచుండెను. అటువంటి పట్టణమునందు వేదమును, వేదచ్ఛందస్సును, అర్థశాస్త్రము మొదలగు సకల ధర్మ

శాస్త్రము లందును సామర్థ్యముగల సాందీపుడను బ్రాహ్మణుడు గలడు. ఆయన భార్య అనుకూలవతియై సకల సుభ లక్షణములు గలదియై యుండెను. ఆ దంపతులకు ఒక కుమారుడు గలడు. ఆ కుమారుని అతి గారాబముతో పెంచుచు ఉపనయన కాలము రాగా ఉపనయనము జేసి వేదాధ్యయనము జేయించుచు తాను గృహస్థాశ్రమమునందు జేయవలసిన సదాచారములను నడుపుచు, సత్యముపలుకుచు, అపూయామలు లేక, మితాహారము జేయుచు, ఇంద్రియములను జయించి, కోపము లేక, శాంతముగా నుండుచు. దేవతలను, బ్రాహ్మణులను పూజించుచు భూతదయ గలిగి గొప్ప పండితుడని పొగడ బడుచు ఆ అవంతి పట్టణమందు సాందీపుడను బ్రాహ్మణుడు నివశించుచుండెను.

ఇట్లుండగా సాందీపుని కుమారుడు షట్ శాస్త్ర పండితుడై బ్రహ్మచర్య వ్రతమును నడుపుచుండెను.

ఒకానొక కాలమున మాఘ మాసము రాగా మహా పర్వదిన మైన మహా మాఘియను పూర్ణిమ దినమందు (అనగా మఘానక్షత్ర ముతో గూడిన పూర్ణిమ) తెల్లవారునపుడు తనతోటి బాలుర గలసి ప్రభాస తీర్థమునకు బోయి పిప్పలాదులకు నమస్కరించి మొలలోతు నీటియందు నిలుచుండి ఆచమనము చేసి ఓ కృష్ణా, అచ్యుతా, వామనా, నారశింహా, వాసుదేవా, నేను యీ పుణ్యనదీ జలమందు స్నానము చేయుచున్నాను. ఈ మాఘపూర్ణిమా స్నానముచే నీవు సంతుష్టి పొందుము. నన్ను రక్షింపుము. అని ప్రార్థించి నీటిలో స్నానము చేయుటకు మునిగెను. తోటి బాలురును మునిగి స్నానము చేసి గట్టునకు వచ్చిరి. గాని సాందీపుని కుమారుడు మాత్రం గట్టునకు రాలేదు. యీ సంగతి తోటిబాలురు సాందీపుని యింటికి వెళ్ళి నీ కుమారుడు మాతో కూడా నీటిలో మునిగి తిరుగా రాలేదని జెప్పిరి. యీ మాటలు విని తల్లి చైతన్యములేక నేలబడి కుమారుని తలచు కొనుచు నదివద్దకు పరుగెత్తుకుని వెళ్ళి నేలబడి దొర్లుచు మేమువ

సాగెను. తండ్రి సాందీపుడు పుష్కల సంపత్తి గలవాడు గాన విచారమును దిగమ్రింగుకుని తోడి బాలురను పలుమారు ప్రశ్నించుచు శ్రీభగవంతుడే రక్షించునని అనుకుని భార్యను ఓదార్చి ఓ గృహిణీ! శ్లో. అస్థిరం జీవనంలోకే అస్థిరం యౌవనం ధనం అస్థిర దార పుత్రాది ధర్మః కీర్తిర్ద్వయం స్థిరం. అనగా లోకములో జీవనము, యవ్వనము, దారా పుత్రులు అన్నియు స్థిరములుగా నుండునవి గావు. ధర్మమున్ను, కీర్తియున్ను ఈ రెండే శాశ్వితముగా నుండునవి గాన ఫలము లేదని చెప్పి యింటికి తీసుకుని వెళ్ళి భగవంతుని స్మరించుచు సుఖముగా కాలమును గడుపుచుండిరి.

ఇట్లుండగా కొంతకాలమునకు మధురాపురంబున యాదవ వంశీయుడయిన సూరుడను రాజు గలడు. అతని కొడుకు వసుదేవుడు. అతనికి ఎనమండ్రు భార్యలు గలరు. రోహిణి యను భార్యయందు బలరాముడున్ను, దేవకి యను భార్యయందు శ్రీకృష్ణుడున్ను, బుట్టిరి. బలరామ కృష్ణులు యిద్దరును నంద యశోదాదుల యింటియందుండి పెరుగు చుండిరి. పిమ్మట కొంతకాలమునకు తమ పురోహితుడైన గర్గుని వలన యథావిధిగా ఉపనయనము చేయించి బ్రాహ్మణులకు అనేక గోవులను, గ్రామములను, భూములను దానములు చేసి వార్లకు కోరినంత ధనధాన్యాదులనిచ్చి బ్రహ్మచర్యమును బలరామ కృష్ణులకు యిప్పించి గర్గుని వద్ద వేదాధ్యయనమును చేయించుచుండెను.

బలరామకృష్ణులకు గురువునింటనుండి విద్యాభ్యాసము చేయుట యందు కోరిక గలవారై కాశీ సమీపమందు అవంతియను పట్టణమందు సాందీపుడను బ్రాహ్మణుడు తమకు విద్యను జెప్పుటకు తగిన సామర్థ్యము గలవాడని తెలుసుకుని దేశాంతరమునకు వెళ్ళి సాందీపునకు ప్రతిభక్తితో నమస్కరించి తమ కోరికను జెప్పిరి. సాందీపుడు బలరామకృష్ణుల రూప సౌందర్యములను జూచి, మాటలచాతుర్యమును, వినయ విధేయతలను వారి నిష్కపట స్వభావమును జూచి,

విద్యాభ్యాసమును చేయుటకు ప్రారంభము చేసెను. రామకృష్ణులు సాందీపని భగవంతునిగా ఎంచి వారి పాదసేవ చేయుచు, కుచేలుడు మొదలగు తోడి సహాధ్యాయులతో గలసి యుండిరి. ఆ సాందీపుడును వారికి వేదములను, వేదాంగములను, ఉపనిషత్తులను, రహస్యముతో గూడిన ధనుర్వేదమును, ధర్మశాస్త్రములు, న్యాయశాస్త్రములు, నీతి శాస్త్రములు మొదలగు సకల శాస్త్రములను రామ కృష్ణులకు జెప్పెను. వారు ఆ శాస్త్రములన్నిటిని ఒక్కొక్కపర్యాయము జెప్పుట చేతనే గ్రహించిరి. ఈ ప్రకారము అరువది నాల్గు శాస్త్రములను అరువది నాలుగు రోజులలో చదివిరి.

ఓ పరీక్షిత్తా! బలరామ కృష్ణులు గురు శుశ్రూష చేయుచు అరువది నాల్గు దినములలో శాస్త్రములన్నియు గ్రహించి గురువునకు నమస్కరించి ఓ గురువర్యా! మీకు గురుదక్షిణ యేమి కావలెనని అడిగిరి. సాందీపుడు వారి ప్రభావమునకును, మనుష్యులయందు కానబడని బుద్ధి కౌశలమును జూచి ఆశ్చర్యమును పొంది భార్యతో ఆలోచించి ఓ కృష్ణులారా! మీరు నాకు గురుదక్షిణ యిచ్చెదము కోరవలసినదని జెప్పిరి. నాకు యిదివరలో ఒక్క కుమారుడు గలడు. ఆ పిల్లవాడు సముద్రములో గలసిన ప్రభాసతీర్థమునకు స్నానమునకు వెళ్ళి మునిగి చనిపోయెను. మా కుమారుని దెచ్చి మాకు యివ్వవలసినదని చెప్పిరి.

అట్లే యిచ్చెదమని జెప్పి మరునాడు తెల్లవారు ఝామున రామకృష్ణులు రథమునెక్కి ప్రభాస తీర్థమందు దిగి సముద్రుని ప్రార్థించిరి. సముద్రుడును వెంటనేవచ్చి రామకృష్ణులను గౌరవించి పిలచిన కారణమును జెప్పవలసినదని అడిగెను. అంతట శ్రీకృష్ణుడు ఓ సముద్రుడా! నీవు మా గురువు సాందీపని కుమారుడు స్నానమునకు రాగా నీ అలలు లోపలికి తీసుకొని పోయినవట గాన మా గురుపుత్రుని తెచ్చి మాకు యివ్వవలసినదని చెప్పిరి.

సముద్రుడు ఆ మాటలనువిని స్వామీ నేను ఆపిల్లవానిని అపహరించలేదు. నా నీటిలో పంచజనుడను రాక్షసుడు శంఖరూపమును ధరించి నివసించుచున్నాడు వాడు ఆ బాలుని అపహరించెను. నీవు యీ నీళ్ళలోజొచ్చి వానినిజంపి బాలుని తీసుకుని రమ్మని జెప్పెను. వెంటనే శ్రీకృష్ణుడు నీటిలోనికి వెళ్ళి పంచజనుని జంపి కడుపు చీల్చి చూచెను. గాని బాలుడు కనుపించనందున వాని దేహమందుగల గొప్ప శంఖమును పుచ్చుకుని మరల రథమునెక్కి యమపట్టణమునకు వెళ్ళి ద్వారమందు దిగి బలరామ కృష్ణులు శంఖముల నూదిరి ఆ శంఖ ధ్వనిని విని యమధర్మరాజ సింహద్వారమునద్దకు వచ్చి వారికి స్వాగతంబులిచ్చి పూజించి ఓ శ్రీకృష్ణా! ద్వాపరాంతమందు భూ భారమును తగ్గించుటకు అవతరించిన శ్రీమహావిష్ణుడవునీవు, లీలామానుష విగ్రహుడవు నాకు ఆజ్ఞాపించుపని యేమి అని అడిగెను. శ్రీకృష్ణుడు ఓ యమధర్మరాజా! ఈ సముద్రమునందు నివశించు పంచజనుడను రాక్షసునిచే తీస్కొని రాబడిన మా గురువు సాందీపుని కుమారుని మాకు యిప్పించవలెనన్నదని కోరెను. ఆ మాటలువిని యమధర్మరాజు తన భటులకాజ్ఞాపించి గురుపుత్రుని రప్పించి బలరామ కృష్ణులకు యిచ్చి వారివలన అనుజ్ఞను తీస్కొనివెళ్ళెను. బలరామ కృష్ణులు గురుపుత్రుని తమ రథముపై కూర్చుండ బెట్టుకుని అవంతి పట్టణమునకు వచ్చి గురుపుత్రుని గురువునకు సమర్పించిరి.

ఆ వింత కార్యమునకు సాందీపుడును భార్యయున్ను మిక్కిలి సంతోషించి నా శిష్యులైన బలరామ కృష్ణులారా! మీరు భగవంతుని అంశవలన జన్మించినవారు. మేము చాలా సంతోషించినాము. మా కోరిక నెరవేర్చితిరి. మీకు భగవంతుడు ఆయురారోగ్య బహు ధనధాన్యములున్ను, ఆ చంద్రార్కయశస్సును కలుగచేయును అని ఆశీర్వదించి పంపించి వేసెను. రామకృష్ణులు గురువునొద్ద అనుజ్ఞ తీసుకుని రథంబునెక్కి మధురా పురంబునకువచ్చి తల్లిదండ్రాదులకు సాష్టాంగ నమస్కారములు చేసి ప్రజలను ఆనందింపజేసి సుఖంబుగా నుండిరి.

శ్రీ శుకమహాఋషి ఓ పరీక్షిత్తా! మాఘమాస పూర్ణిమనాడు తెల్లవారుఝామున ప్రభాస తీర్థమందు స్నానార్థం మునిగి చనిపోయిన సాందీపుని కుమారుడు శ్రీకృష్ణుని మహిమ వలన యమలోకమునుంచి వచ్చెను. ఇంకను అనేకమంది యమలోకమునకు పోయిన వారు దేవతల అనుగ్రహము వలన మరల వచ్చియున్నారు. వారినందరిని జెప్పుటకు చాలాకాలము పట్టును.

పరీక్షితు మహారాజు, ఓ శుకమహాఋషి! నేను అడిగిన మూడు ప్రశ్నలకు జవాబులు సరిగా చెప్పితిరి. నా మనస్సు సంతోషము పొందినది. అని చెప్పి శుకమహాఋషికి నమస్కరించెను.

సూతమహాఋషి శౌనకాది మునులను జూచి ఓ మునిశ్రేష్ఠులారా! పరీక్షితు మహారాజు శుకమహాఋషిని జూచి ఓ మహాత్మా! పుణ్యాత్ముడైన మృగశృంగుని చరిత్రమును పూర్తిగా జెప్పవలయును. సత్పురుషుల చరిత్రలను వినినను, వారి దర్శనము జేసినను, వారిని తాకినను సకల పాపంబులు పటాపంచలై పోవును. అని జెప్పి మరల నమస్కారములను జేసెను.

స్కాంధ పద్మ పురాణంబుల గల సాందీపునిపుత్రుడు
యమలోకమునుండి మరల బ్రతికివచ్చిన విధము
పదునొకండవ అధ్యాయము

# పండ్రెండవ అధ్యాయము
## మృగశృంగుని చరిత్రము

శ్రీశుకులు జెప్పుచున్నారు. పరీక్షితి మహారాజా! మృగశృంగుడు గురుపునింట శుశ్రూష జేయుచు శాస్త్రములందు జెప్పబడిన ప్రకారము బ్రహ్మచర్యమును నడుపుచు వేదములను, వేదశాస్త్రము

లను, వ్యాకరణము, ఛందస్సు, లక్షణశాస్త్రము మొదలగు సకల శాస్త్రముల నభ్యసించి తన గురువు కోరిన ధనము దక్షిణగా యిచ్చి గురుని ఆజ్ఞ ప్రకారం గోదాన వ్రతమును నడపుకొన్నవాడై నిర్మలమైన మనస్సు గలవాడై తన యింటికివచ్చి తల్లిదండ్రులకు నమస్కరించెను.

తల్లిదండ్రులు సంతోషించి కుమారుని ఆశీర్వదించి సుఖముగా నుండిరి. ఉచథ్యుడు యింటికి వచ్చిన మృగశృంగుని చూచి తన కుమార్తెను యిచ్చి వివాహము జేయుటకు నిశ్చయించుకుని తన బంధు వర్గమునకున్ను, కుత్సితునితోను, ఆయన భార్యతోను జెప్పి వివాహ ప్రయత్నమున ఉభయులు నుండిరి. యీ వివాహ ప్రయత్నమును ఉచథ్యుని కుమార్తె సువృత్తయొక్క చెలికాండ్రైన కమల, విమల, సునస అను కన్యలకు దెలిసి తల్లిదండ్రులతో మేము మృగశృంగుని తప్ప యితరులను వివాహము చేసుకోమనిన్ని, మమ్మును అతనికే యిచ్చి ఆ లగ్నమందే వివాహము చేయవలసినదని చెప్పిరి.

ఈ విధముగా జెప్పిన తమ కొమార్తెల కోరికలను వారి వారి బంధు వర్గమునకు జెప్పి వారి అనుమతి ప్రకారము కుత్సితునితోను వాని భార్యతోను జెప్పి వారును వివాహ ప్రయత్నమున నుండిరి. వివాహము సమీపించగా శుభ కార్యమును జూచుటకు ఎల్లమునులకు వర్తమానములు జేయగా జమదగ్ని, కపిలుడు, రైభ్యుడు, సుమతి, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, భృగువు, పర్వతుడు, శరభంగుడు, సుతీక్ష్ణుడు, ఆపస్తంభుడు, మాండవ్యుడు, వైశ్యుడు, కాత్యాయనుడు, కశ్యపుడు, హారీతుడు, అంగీరసుడు, పైలుడు, మౌద్గల్యుడు, గౌతముడు, కణ్వుడు, కాణుడు, అత్రి, మొదలగు మహాఋషులు రాగా కుత్సిత మహాముని వారిని షోడశోపచారముల పూజించి గూర్చుండ బెట్టెను. మృగశృంగుడు ఓ మహామునులారా! ఏక కాలమందు నలుగురు కన్యకలను వివాహము చేసుకొనవచ్చునో లేదో సంశయము గలుగుచున్నది. మీరు ధర్మమును జెప్పుడని కోరెను.

ఆ వాక్యములు వేదవ్యాసమహాముని విని ఓ మృగశృంగా ! ఈ కన్యకలను నలుగురుని ఏకకాలమందే వివాహము చేసుకొనవచ్చును. తప్పుకాదు. ఈ విషయమునందు సందేహము వలదు. అని చెప్పి పూర్వకాలమునందు మాంధాత మహారాజునకు ఏబదిమంది కుమార్తెలు గలరు. వారిని అందరిని సౌభరి అను మహాఋషి ఏక కాలమందు వివాహమాడెను. దక్షప్రజాపతి కుమార్తెలు యిరువది ఏడ్వురను చంద్రుడు ఏకకాలమందే పెండ్లాడెను. అని చెప్పెను. వ్యాస మహాఋషి చెప్పిన ధర్మ మార్గమునకు సంతోషించి మృగశృంగుడు క్రమముగా హోమకార్యమును నిర్వర్తించి అగ్నిసన్నిధిని నలుగురు కన్యకలను వివాహమాడెను ఉచథ్యుడు తన కుమార్తె సువ్రతను అలంకారములు చేయించి మొదట అంకురార్పణము చేసెను. మంచి లగ్నమందు వరిపేలాలు, నెయ్యి, దర్భసమిధలు వీటిచేత హోమము చేయించి వివాహము కావించెను. ఆ మృగశృంగుడు మహామునుల ఎదుట ఆ నలుగురు కన్యకలను బ్రహ్మవిధిచే వివాహము చేసుకుని పెండ్లికి వచ్చిన మహామునులనందరిని తగిన మర్యాదలు చేసిరి. వారును దంపతులను ఆశీర్వదించి తమతమ నివాసములకు వెళ్ళిరి.

అని చెప్పగానే పరీక్షిత్తు ఓ శుకయోగీంద్రా ! బ్రాహ్మణులు మొదలగు వారికి ఎన్ని విధముల వివాహములు చెప్పబడి యున్నవి నాకు తెలియునట్లు చెప్పుమని కోరెను.

శ్రీశుకులు ఓ రాజా ! వివాహము లెన్నివిధములో వాటిని వివరించి చెప్పెదను వినుము.

౧ బ్రాహ్మము. ౨. దైవము, ౩. ఆర్షము. ౪. ప్రాజాపత్యము, ౫. ఆసురము. ౬. గాంధర్వము, ౭, రాక్షసము. ౮. పైశాచము అని వివాహములు ఎనిమిది విధములు. కన్యకను వస్త్రాభరణములచే అలంకరించి వరుని పిలిచియిచ్చి చేయువివాహము ౧. బ్రాహ్మము అట్టి వివాహము చేయబడిన దంపతులకు పుట్టిన కుమారుడు యిరువది ఒక్క తర

ములవారిని తరింప జేయును. యజ్ఞము కొరకు యజ్ఞము చేయించు వారికి కన్యకను యిచ్చి వివాహము జేయుట, ౨. దైవము ఆదంపతు లకు పుట్టిన కొడుకు పదునాల్గు తరములవారిని తరింపజేయును. పెండ్లి కుమారునివలన రెండు ఆవులను పుచ్చుకుని కన్యనిచ్చి జేయు వివా హము, ౩. ఆర్షము. ఈ దంపతులకు పుట్టినకుమార్డు ఆరు తరములవారిని తరింప జేయును. మీా వధూవరులు యిద్దరు ధర్మకార్యములను జేయుడు అని చెప్పి యిచ్చిన వివాహము, ౪. ప్రాజాపత్యము. ఆ దంపతులకు పుట్టిన కుమార్డు ఆరు తరములవార్ని తరింప జేయును. ఈ చెప్పబడిన నాల్గు విధములయిన్న వివాహములు బ్రాహ్మణులకు తగినవి. ధనము పుచ్చుకని కన్యనిచ్చి జేయు వివాహము, ౫. అసురము. పెండ్లి కుమార్డున్ను, పెండ్లి కుమార్తెయున్ను యిష్టపడి జేసుకొను వివాహము ౬. గాంధర్వము. వరుడు బలాత్కారముగా కన్యకను తీసుకొనివెళ్ళి చేసుకొను వివాహము, ౭. రాక్షసము. ఇది పెద్దలచే అంగీకరించబడదు. మోసముచేసి కన్యకను తీసుకొనిపోయి చేసుకొను వివాహము ౮. పైశా చకము. పాపము గలుగ జేయునది గాన యీా వివాహము పాపాత్ము లకే తగును

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులలో నెవరుగాని తమతమ జాతి కన్యకలను పెండ్లాము నష్టము చేయి పట్టుకోవలశినదే విధి. ఎవరికి ఏది ధర్మమని చెప్పబడియున్నదో వారుఆయా ధర్మములు తప్పక పెండ్లి చేసుకోవలెను. ఆ దంపతులకు పుట్టిన సంతానము ధర్మ గుణములు గలదై నూరు సంవత్సరములు జీవింతురు.

పరీక్షిత్తు. శుకయోగీంద్రా! సౌభరి మహాఋషి యేబదిమంది కన్యకలను ఎట్లు వివాహము చేసుకొనెనో ఆ వృత్తాంతమును జెప్ప వలశినదని కోరెను.

శ్రీ శుకులు జెప్పచున్నాడు. పూర్వకాలమునందు కాంపిల్యము అనుపట్టణమందు అరిషడ్వర్గములను జయించి యోగాభ్యాసము జేయు

చున్న సౌభరి యను బ్రాహ్మణుడు గలడు. ఆ సౌభరి చాంద్రాయ ణాది వ్రతములను పూర్తిజేసి అటుపిమ్మట నేలరాలిన పండుటాకులు దిని తపస్సు చేసెను. అటుపిమ్మట ఆహారము లేకుండా తపము చేయవలె నని తలంచి ఒక మాఘమాసమున నీటిలో మునిగి పండ్రెండు సంవత్స రములు తపస్సు చేసెను. సౌభరి తపస్సు చేయు సరస్సు చాలా లోతు గలదై యుండెను. ఆ సరస్సులో శబరము అనుచేప ఒకటి గలదు. అది అనేకములైన చేపల గుంపులతో కలసి వాటికి రాజై అందమైన ఆకార ముతో అతి వేగముగా రెక్కలు జాడించి పరుగిడుచు తన భార్యల తోను, కొడుకులు, మనుమలు మొదలగు వాటితోను, తల్లిదండ్రు లతోను, బంధువులతోను సుఖంబుగా నుండెను.

సౌభరి ఈ చేపయొక్క దారా పుత్రాదులు మొదలగు వాటిని జూచి నేనుకూడా యీ చేపవలె దారాపుత్రాదులతో నుందునని తలచి నీటినుంచి బయటికి వచ్చి పెండ్లి యాడవలెనని కోరికతో నుండి ఒక నాడు తన వికార రూపముతో మాంధాత యను మహారాజు యింటికి పోయి మహారాజుచే గౌరవింపబడి కూర్చుండి ఓ మహారాజా! సూర్య వంశపురాజులు, బ్రాహ్మణులు యాచించునట్టి యాచనను తీర్చక పోనియ్యలేదు. నేను వివాహము చేసుకొనవలెనని కోరిక పుట్టి నీయొ ద్దకు వచ్చినాను. నీకు యేబదిమంది కుమార్తెలు గలరు వారిలో నొక కన్యకను నాకు యిచ్చి వివాహము చేయవలసినదని కోరెను.

అనగా రాజు ఏమిచెప్పిన శపించునోయని భయపడి ముసలి తనముచేత వణకుచున్న సౌభరిని జూచి ఓ ఋషివర్యా! రాచకన్యకలు అందమైన వారను మంచి కులమునందు బుట్టిన వారును అష్టైశ్వర్య ములు గలవారిని పెండ్లాడ గోరుదురు. అటువంటి వారికే యియ్యవల యును గాని యితరులకు యియ్యరాదు. నేనేమి చేయుదును. అనుకూల మైన మార్గము మీరే ఆనతియ్యవలసినదని చెప్పెను. ఆ మాటలు విని సౌభరి మీ రాచధర్మము విని కృతార్థులమైతిమి. అంతఃపురమందు

గల పరిచారికలకు కబురు పంపించి పిలిపించి నన్ను ఆ కన్యకలకు జూపించుమని ఆజ్ఞ యిమ్ము. వారికి నాయందు యిష్టముగలిగిన నాకు యిచ్చి వివాహము చేయుము లేనియెడల నేను వచ్చిన దారిని వెళ్ళి పోయెదను అనెను. అందుకు రాజు సమ్మతించి ఒక పరిచారికను పిల్పించి ఆ మునీశ్వరుని అంతఃపురమునకు దోడ్కొని వెళ్ళి కన్యకలను జూపుమని ఆజ్ఞ యిచ్చెను. ఆ పరిచారిక ఋషిని వెంట బెట్టుకుని పోయెను ఆ పరిచారిక ఋషిని కన్యకలను చూపి మీ తండ్రి మీలో యెవరు యీ ఋషిని పెండ్లాడ గోరుదురో వారిని వీరికియిచ్చి వివాహము చేసెదరు అని చెప్పెను.

ఆ మునీశ్వరుడు అంతఃపురమునకు పోయి దేవతలకంటెను గంధర్వులకంటెను ఎక్కుడైన నవ మన్మధ రూపము ధరించి యుండెను ఆ కన్యలు యీ ఋషిని నేను పెండ్లాడెదను నేను పెండ్లాడెదనని పలుకుచు చుట్టును మూగిరి. ఆ ప్రకారము ఆడ యేనుగులుగుంపు మదపుటేనుగను చుట్టుకొన్నట్లు మూగిరి. రాజు ఆ కన్యకల కోరిక ప్రకారము సౌభరి మహాఋషికి యిచ్చి వివాహము చేసెను. సౌభరి మాంధాత కుమార్తెలను వివాహమాడి వారిని తన వెంటబెట్టుకుని తన ఆశ్రమమునకు తీసుకుని వచ్చి విశ్వకర్మను పిల్పించి ఏబది సభలతోను స్ఫటికపు రాళ్ళచే నిర్మించిన స్తంభములు గోడలతోను మేడలతోను ప్రాకారములతోను ఉద్యానవనములతోను దాసదాసీ జనముతోను. రత్నమయము లయిన కిటికీలు, ద్వారబంధములతోను, రత్నాల తోరణములతోను నిండియుండి ఒక మేడకు మరియొక మేడకు సంబంధములేక నిర్మింపబడి యుండెను. కావలసిన ధన ధాన్యములతోను ప్రతి మేడకు తగిన గృహోపకరణములు గలిగి సర్వసమృద్ధిగలిగియున్న మేడలను నిర్మింప చేసి ఆ మేడలయందు సౌభరి తన భార్యలతో ప్రవేశించి సర్వసుఖంబులు అనుభవించుచుండెను. ఆ రాచకుమార్తెలు దేవతా స్త్రీలతో సమానముగా సర్వసుఖములతో కాపురము చేయుచుండిరి. యిట్లుండగా మాంధాత తన కొమార్తెలు సౌభరితో ఎట్లు కాపుర

ములు చేయుచున్నారో యని బుద్ధిగలిగి సౌభరి ఆశ్రమమునకు వచ్చి దేవతా విమానములతో సమములగు మేడలను జూచి ఆశ్చర్యపడి ఒక యిల్లుచూచి లోపల ప్రవేశించెను. ఆ చిన్నది తండ్రినిచూచి సంతోషముతో లేచి నమస్కరించెను. అంతట రాజు అమ్మా సుఖముగా నుంటివా ? యని ప్రశ్నించెను. కూతురు నాయనా ! నా భర్త ఎన్నడు నన్ను వదలివుండడు. సకల సౌఖ్యములు గలవు. మాకు ఏ విధమయిన లోటు లేదని బదులు చెప్పె. ఈ ప్రకారము తన ఏబదిమంది కుమార్తెలను కుశల ప్రశ్నలను చేసి వారి క్షేమసమాచారములను కనుక్కొని మిక్కిలి సంతోషించి మీరు సుఖముగానుండుడని దీవించి అల్లుని సంతోషపర్చి తన పట్టణమునకు వెళ్ళెను.

ఇట్లుండగా సౌభరివలన ఒక్కొక్క భార్యకు ముగ్గురేసి కొడుకులు గలిగి వారు సూర్యతేజస్సు గలిగి యుండిరి. ఈ విధముగా కొడుకులు పౌత్రులు కుమార్తెలు దౌహిత్రులు గలిగి మనుమలకు మనుమలు గలిగి చిరకాలము సౌభరి సకల సౌఖ్యములు పొందెను. ఓ పరీక్షితా ! పండ్రెండేండ్లు మాఘమాసములు నీళ్ళలో మునిగి తపస్సు చేయుటచే యింత ఫలము గలిగెను. కాబట్టి పుణ్యాత్ములకు మాఘమాస వ్రత ఫలితము వెంటనే సిద్ధించును.

ఈ సౌభరి కథ వినిన వారికి దరిద్రములుగాని, దుఃఖములుగాని, రోగములుగాని, అకాలమృత్యువులుగాని, అరిష్టములుగాని లేక సర్వ సుఖములను పొందుదురు.

స్కాంధ పద్మ పురాణాములందు
గల మృగశృంగుని చరిత్రగల
పండ్రెండవ అధ్యాయము

# పదమూడవ అధ్యాయము

## మృగశృంగుడు నడపినగృహస్థ ధర్మములు

శ్రీశుకులు చెప్పుచున్నాడు. మహాఋషియైన మృగశృంగుడు, శాస్త్రములందు జెప్పబడిన ప్రకారము వివాహమును చేసుకుని వేద

మార్గము ననుసరించి గృహస్థు ధర్మములను నడుపుచుండెను. భార్య లైన సువ్రత, కమల, విమల అను భార్యలు పతి శుశ్రూష జేయుచు పాతివ్రత్యము నడుపుచుండిరి. అట్టిభార్యలతో స్వధర్మమును నడుపుచుండిరి.

పరీక్షితి మహారాజు ఓ ఋషిపుంగవా! మృగశృంగుడు నడపిన గృహస్థు ధర్మమున్ను ఆయన భార్యలు నడపిన పతివ్రతా ధర్మములను నాకు విశదముగా జెప్పవలసినదని కోరెను.

శ్రీశుకమహాఋషి. ఓ రాజా! మంచి నడవడిగల మనుష్యుని చేత ఇహ పరలోకములు రెండును కలుగచేయబడుచున్నవి గనుక మంచి నడవడికి ఆధారమైన గృహస్థు ధర్మములను చెప్పుచున్నాను వినుము.

గృహస్థుడనువాడు తెల్లవారుఝామున లేచి శ్రీహరిని కీర్తించి పిమ్మట ఆ గ్రామమునకు నైరుతి దిక్కుగా మనుష్యులు కనబడని తావునకువెళ్ళి మూత్ర పురీషములను విడువ వలయును. పగటి భాగ మందును సంధ్యాకాలమందును ఉత్తర ముఖముగా కూర్చుండవలెను. రాత్రిభాగమందు దక్షిణ ముఖముగా కూర్చుండి మలమూత్రములను విసర్జించవలెను పిమ్మట నదికిగాని, కూపము ( నుయ్యి ) వద్దకుగాని వెళ్ళి మట్టితో చేతులు పాదములు మాత్ర శుద్ధిచేసుకుని, ఎనిమిది పర్యాయములు నీటితో పుక్కిలించి ఉమియవలెను. పిమ్మట ఉత్తర ముఖముగా గాని తూర్పుముఖముగాగాని, కూర్చుండి పండ్లుతోము కొను పుడక బాగుగా కడిగి చేత బట్టుకుని శ్లో. ఆయుర్బలం యశో వర్చః ప్రజాః పశువసూనిచ బ్రహ్మప్రజ్ఞాంచి మేధాంచ త్వం నోదేహి వనస్పతే. అనగా ఓ వృక్షశాఖా! నాకు ఆయుస్సు, బలము, కీర్తి, రూపము, బిడ్డలను, పసువులను, ధనమున్ను, బుద్ధిన్ని, యిమ్ము. అని నమస్కరించి మెత్తగా నమలి పండ్లు తోముకొనవలెను. పండ్లు తోముకొను పుడక చిటికెనవ్రేలు లావుగలిగి పండ్రెండంగుళముల

పొడవు వుండవలెను. జువ్వి వేప గానుగ ఉత్తరేణి మొదలగునవి మంచివి. అవి దొరకని యెడల పాలు గలవిగాని, బెరడు గలవిగాని, ముల్లుగల చెట్ల పుల్లలుగాని, పనికి వచ్చును. అష్టమి, నవమి, పున్నమ తాను పుట్టిన నక్షత్రమందు పుడకతో పల్లు తోమరాదు. అభ్యంగ నము ఉల్లి మొదలగునవి పనికిరావు. మిధునకర్మ పనికిరాదు. పాడ్యమి, ద్వాదశి, షష్టి శ్రాద్ధ దినములందు పనికిరాదు.

పండ్లుతో ముకొనిన పుడక కడిగి నైరుతి దిక్కుగా పారవేయ వలెను. ఇట్లు ముఖము శుద్ధిచేసుకుని పవిత్రుడై ప్రాతః స్నానముచేయ వలెను. మొలలోతు నీటిలో నిలుచుండి మార్జనము చేసుకుని కట్టు వస్త్రములు బాగుగా తడిసిన పిమ్మట ఆచమనము జేసి గట్టుననున్న మట్టి మూడు పర్యాయములు నదిలోవేసి గంగకున్న పిప్పలాదుల కున్న నమస్కరించి మొలలోతు నీటిలో స్నానము చేయవలెను. దేవ నిర్మితమైన నదులలో గట్టుననున్న మట్టిని నీటిలో వేయవలెను. మనుష్య నిర్మితమైన తటాకాదులలో మట్టిని తీసి గట్టున వేయవలెను. పిమ్మటస్నాన సంకల్ప విధానముగా స్నానమును జేసి గట్టునకు వచ్చు నప్పుడు శ్లో. అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం సర్వపాప క్షయ కరూర్ధం శ్రీవిష్ణు పాదోదకంపిబా. మరియు శ్లో. శరీరేజర్జరీ భూతే వ్యాధిగ్రస్తే శరీరజే ఔషధం గౌతమీ తోయం వైద్యో నారాయణో హరిః. అని చెప్పి మూడు పర్యాయములు నీటిని లోపలకు పుచ్చుకుని ఆచమనము చేసి గట్టున మూడు దోసిళ్ళ నీళ్లు శ్లో. యన్మయా దూషి తంతోయం శారీరమలసంయుతం జ్ఞాన వైరాగ్య సిధ్యర్థం యక్ష మాణ తర్పయామ్యహం. అని చెప్పి గట్టున పోయవలయును.

తరువాత శరీరము శిరస్సు తడి పోవునట్లు తుడుచుకుని తడి వస్త్రములను విడిచి పొడి వస్త్రములను ధరించి ఉత్తర ముఖముగా నైనను తూర్పు ముఖముగానైనను కూర్చుండి సంధ్యావందనము చేయ వలెను. పిమ్మట దాన ధర్మములనుచేసి తరువాత అనుష్టానములను చేయ

వలెను, అటుతరువాత గృహకృత్యములకు కావలసిన పదార్థములను సంగ్రహించుకుని మధ్యాహ్నము కాగానే బ్రహ్మయజ్ఞము పితృతర్పణములు జేయవలెను. గృహస్థునకు ఉదయము మధ్యాహ్నము మాత్రమే రెండు పూటల స్నానము విధింపబడియున్నది. బ్రహ్మచారులకున్ను, యతీశ్వరులకున్ను మూడు కాలములందును స్నానములు చేయుటకు అధికారమున్నది. పిమ్మట దేవతార్చన చేయవలెను. అనగా శ్లో. ఆదిత్యం అంబికం విష్ణుం గణనాథం మహేశ్వరం. అనగా సూర్యుని, పార్వతిని, విష్ణుదేవుని, విఘ్నేశ్వరుని, శివుని క్రమముగా పూజించవలెను. దీనినే పంచాయతనం అని పెద్దలు జెప్పుదురు. తరువాత వైశ్వదేవము చేసి యథావిధిగా బలులు పెట్టవలెను.

శ్లో. శ్వానౌ ద్వౌ శ్యామశబలౌ వైవస్వత కులోద్భవౌ తాభ్యామన్నం ప్రదాస్యామి రక్షితాం పథిమాం సదా. అనగా కాకి, కుక్క, దేవతలు, పక్షులు, సిద్ధ, యక్ష, సర్ప, రాక్షసులు, ప్రేత, పిశాచములు, వృక్షములు మొదలగు వారికి నా చేత యివ్వబడిన యీ అన్నముచే తృప్తి పొందుదురు గాక అని చెప్పవలెను.

ఇట్లు భూత బలిచేసి అతిథివచ్చిన వానిని పూజించవలెను. బ్రహ్మచారిని యతీశ్వరుని పూజింపవలెను. అటుతరువాత తాను భుజింపవలెను. గృహస్థు ఒక్కపాత్రమునందే భుజింపవలెను గాని వేరు వేరు పాత్రలందు భుజింపరాదు. గృహస్థు భార్యతో కూర్చుండి భుజింపరాదు. కొంచెము అన్నము తీసుకుని సగము నేయివేసి కలిపి చిత్రగుప్తాదులకు పెట్టి తాను భుజింపవలెను. ప్రాణాహుతి అన్నమును నమలరాదు. నాలుకతో చప్పరించి మ్రింగవలెను. గృహస్థు మొదట మధుర పదార్థములను గాని కమ్మటి పదార్థములను గాని పుచ్చుకోవలెను. ఉప్పు, పులుసు, కారము గల వస్తువులు మొదట పుచ్చుకొనరాదు. భోజనమధ్యమందు ఉప్పు, పులుపు, కారము గల పదార్థములు పుచ్చుకుని పిమ్మట చారు పులుసు పెరుగు మొదలగు పదార్థములు

పుచ్చుకోవలెను. యీ ప్రకారము ఆహారము పుచ్చుకొనువారు ఆయు రారోగ్యములుగలిగి యుందురు. చల్లారిన పదార్థములు పుచ్చు కొనరాదు.

శ్లో. ఆయుస్సత్వబలారోగ్యంసుఖప్రీతివివర్ధనాఃరస్యాఃస్నిగ్ధాఃస్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః (సాత్విక) సత్వగుణమును వృద్ధి చేయు పదార్థములు పుచ్చుకొనిన యెడల ఆయువు బలము ఆరోగ్యము సుఖము మొదలగు వాటిని వృద్ధిజేయునుగాన కొంచెము వేడిగానుండు వండిన పదార్థమును తినవలెను. భోజనమయిన పిమ్మట చేతులు మూతి కాళ్లు శుభ్రము చేసుకోవలెను. తరువాత సూర్యునికి నమస్కారము చేసి శాంతిగల మనస్సుగలవాడై పీటమీద కూర్చుండి ఆచమనము చేయవలెను. ఆయాసము తీరిన పిమ్మట వేదాంత విచారణమును యితర కార్యములను నడుపుకోవలెను. పొద్దుగుంకు సమయమందు సాయంకాల కృత్యములు నెరవేర్చుకోవలెను. రాత్రికాలమందు మిత ముగా భుజింపవలెను. గృహస్థు పరుండునప్పుడు తనయింట తూర్పు శిరస్సుగాను అత్తవారింట దక్షిణ శిరస్సుగాను యితర గ్రామము వెళ్ళునప్పుడు పడమర శిరస్సుగాను పరుండవలెను. ఉత్తర శిరస్సుగా ఎన్నడును పరుండ రాదు. పరుండునప్పుడు రాత్రి సూక్తము జపించి శ్రీమహావిష్ణుని, అగస్త్య మహామునిని, ముచికుందుని, కపిలాచార్యుని, అస్తీకుని యీ అయిదుగురను స్మరించి శ్రీ మహావిష్ణుని స్మరించుచు సుఖ నిద్ర పోవలయును. ఈ చెప్పబడిన సర్వకాలములు లోపము లేకుండ ప్రతి దినము నడపుట గృహస్థు ధర్మము.

ఓ పరీక్షితా! వేదములందు చెప్పబడిన గృహస్థ ధర్మములు నీకు తెలియుటకై సంగ్రహముగా జెప్పితిని. పతివ్రతాధర్మములను జెప్పెదను వినుము.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మృగశృంగుడు
నడపిన గృహస్థు ధర్మములు
పదమూడవ అధ్యాయము

# పదునాల్గవ అధ్యాయము
## పతివ్రతా ధర్మములు

శ్రీశుకులు ఓ రాజా ! స్త్రీలకు విధింపబడిన ఉత్తమ ధర్మములను జెప్పెదను వినుము.

ఏ ఆడువారు యీ ధర్మములను వినెదరో వారి మనస్సు ధర్మము నందేయుండును. స్త్రీలకు పతిసేవకంటె వేరు ధర్మములేదు. పెనిమిటి అందముగా లేకపోయినను చెడుగుణములు గలవాడైనను రోగియైనను. కోపముగలవాడైనను, ధనము గలవాడైనను, ధనము లేనివాడైనను మూగవాడైనను, గ్రుడ్డివాడైనను, చెవిటి వాడైనను, భయమునుకలుగ చేయువాడైనను, లోభివాడైనను, ఎటువంటివాడైనను సరే ఆ మగనిని మనస్సు చేతను వాక్కుచేతను పనులచేతను పూజింపదగిన వాడగును. భర్తకు యిష్టములేని పనిని చేయుట ఆడుదానికి తగదు. ఆడుది చిన్న దైనను ఈడువచ్చినదైనను ముసలిది యైనను తల్లిదండ్రులు, అన్న దమ్ములు కొడుకులు మనుమలు వీరిలో ఎవరి వలన పోషింపబడు చున్నను సకల భాగ్యములు తనవారివలన తెచ్చుకొన్నదైనను స్వల్ప మైన ఏ పనిని గూడ తాను స్వతంత్రించి చేయదగదు. గర్వము, లేని పోని కోరికలు కోరుట, కోపము పిసినికొట్టు తనము పనికి రాదు. యితరుల సాంగత్యముండరాదు. యితరులు చెప్పెడు మాటలకు ఆశ పెట్టెడు వస్తువులను జూచి మోసపోరాదు. తీర్థయాత్రలకు జన సమూహ ములకు వెళ్ళరాదు. జన సమూహములకు వెళ్ళిన పురుషులరాపిడి శరీర మునకు తగిలి మనస్సు వికలమై శీలమునకు భంగము కలుగును. ఏ యిల్లాలు ధనమునకు, ఆభరణమునకు, వస్త్రములకు పదార్థములకు ఆశపడక నిశ్చల మనస్సుగలిగి చలింపక భర్తనే సేవించుచుండునో

ఆమె మూడు లోకములందు పూజింపబడుచుండును. అట్టి గుణములు గల స్త్రీ తన వంశమును రక్షించుచున్నదియై స్వర్గమునకు జనును.

ఇతరులను వారి చక్కదనమును, ధనధాన్యములను జూచి మోసపోరాదు. అట్టి పతివ్రతను దేవతలు సహితము భయపడుదురు. అట్టి ఆడదానిని పతివ్రతయని పిలుతురు. స్త్రీలకు దేవుడుగాని, మన్మథుడుగాని, కుబేరుడుగాని, గంధర్వుడుగాని, పెనిమిటికంటె పూజనీయులును, యిష్టులును కానేరరు, ఏ ఆమది పెనిమిటి సుఖపడిన తాను సుఖపడుచు పెనిమిటి కష్టపడిన తాను కష్టపడుచు నుండునో ఆమెయే పతివ్రత యనిపించుకొనును. యే స్త్రీ అత్తమామలను, బంధువర్గమును గౌరవించి పూజించుచుండునో ఆమెయే పతివ్రత, ఉత్తమురాలు అని పిలుపించుకొనును. యేయిల్లాలు గృహకృత్యములందును, శుభకార్యములందును శ్రద్ధగలిగి పెనిమిటి తెచ్చిన పదార్థములను తగిన జాగ్రత్త చేయునో అతిథి, అభ్యాగతులను, యతీశ్వరులను, పరివ్రాజకాది సన్యాసులను తగిన మర్యాద చేయునో ఆమెయే పతివ్రత. భర్త తెచ్చిన పదార్థములను గృహకృత్యములకు తగినట్లు ఖర్చుచేసి మిగిలిన పదార్థములను జాగ్రత్త చేయవలెను. పెనిమిటి గ్రామాంతరము వెళ్ళినప్పుడు తలంటుకొనుట, స్నానము చేయుట, తల దువ్వుకొనుట, పువ్వులు, పరిశుభ్ర వస్త్రములు ధరించకూడదు. సాధారణముగా స్త్రీలు నెల నెలకు ముట్టగుదురు. ఆ ముట్టగునప్పుడు మొదటి రోజున ఛండాల స్త్రీవలెను, రెండవరోజున, బ్రహ్మహత్యచేసి దానివలెను, మూడవరోజున తిల ఘాతకురాలుగను, నాల్గవ రోజున శూద్రస్త్రీవలెగాను జూడవలెను.

ముట్టయినప్పుడు ఏడ్చుట, నవ్వుట, దూరము నడచుట, జూదమాడుట, గంధము పూసుకొనుట, పగలు నిద్రపోవుట, పండ్లు తోముకొనుట, పరపురుషులతో మాట్లాడుట, దేవతా కార్యములను జూచుట,

నోటితో చెప్పుట పనికి రాదు. బహిష్టయైన మరియొక ముట్టుదానిని తాకరాదు. గట్టిగా మాట్లాడరాదు. అడవులకు, పూల తోటలకు వెళ్ళరాదు. నూనె రాచుకొనరాదు. గోళ్లు తీసుకొనరాదు. పండ్లు కాయలు మొదలగునవి తినగరాదు. త్రాడు పేనరాదు. ఆవును దూడను తాకరాదు. సూర్యచంద్రులను చూడరాదు. మైలబట్టలు విడుచుట, తలదువ్వుట, పనికిరాదు. చిన్నపాత్రము యింటికి దూరముగా పారవేయవలెను. కాళ్ళు కడుగుకొనుట పుక్కిలించి ఉమియుట మలమూత్రములను యింటికి దూరముగా చేయవలెను. నాలుగవనాడు ప్రొద్దున్న తాను పండుకున్న స్థలము అలికి శుభ్రపరచి తాను నదికి స్నానమునకు పోవలయును. తాను కట్టిన వస్త్రములు చాకలి వానికి వేయవలెను. చాకలి దొరకని యెడల తానే ఉతుకుకుని శుభ్రము చేసుకోవచ్చును. తానే ఉతుకుకునేయెడల ముందట చవుటి మట్టితో టిన్ని ఉడుకబెట్టి శుభ్రము చేసుకోవలెను. పిమ్మట మట్టితో శుభ్రము చేసుకుని ముఖము కడుగుకుని నీళ్ళలోదిగి ముప్పదిరెండు పర్యాయములు స్నానము చేయవలెను. తిరుగా వస్త్రములను ముప్పది పర్యాయములు జాడించి ముప్పదిమారులు మునగవలెను. స్నానము చేసి యింటికి వెళ్ళునప్పుడు తలవంచుకుని యితర పురుషులను జూడక యింటికివెళ్ళి మగనిని జూడవలెను. పిమ్మట పంచగవ్యము పుచ్చుకోవలెను. లేక ఆవు పాలు త్రాగవచ్చును. పిమ్మట అన్నకబలము పుచ్చుకోవలెను. అన్నకబళము పుచ్చుకున్న పిమ్మట పసిబిడ్డలను చూచినను దోషములేదు.

స్త్రీ గర్భిణియైనప్పుడు నియమము గలిగి యుండవలెను. దుష్ట స్త్రీతో మాట్లాడరాదు. భయమును కలుగుకథలు వినరాదు నాటకములు చూడరాదు. ముట్టుస్త్రీ స్నానముచేసివచ్చుదానిని చూడరాదు. సుఖముగా నుండు పనులు చేయవలెను. ఒళ్లువిరుచుకోకూడదు. పకపక నవ్వరాదు. గట్టిగా తుమ్మరాదు. గోళ్ళు పెదవులు, పండ్లు కొరకరాదు. ప్రతిదినము

పెనిమిటి పాదములను వత్తుచు సుఖ నిద్ర పోవచ్చును. తన ధర్మమును చక్కగా నడపునట్టి స్త్రీ పతివ్రతయై ఈ లోకమందును పరలోకమందును కీర్తి పొంది సుఖించును.

ఇట్టి పతివ్రతా ధర్మములందు ఏ స్త్రీ శ్రద్ధగలిగి యుండునో ఆ యింటి స్త్రీపురుషులు సుఖముగా ధనధాన్యములతో సుఖించెదరు. లేనియెడల దేశాంతరమునకు పోవుటగాని, అడవికి పోయియుండుట గాని మంచిది.

ఈ చెప్పబడిన పతివ్రతా ధర్మములతో గూడిన భార్యలు గలవాడై మృగశృంగుడు సంసారసుఖమును బొందుచు అతిరాత్రచయము వాజపేయము మొదలైన యజ్ఞ యాగాదులు చేసి కృతార్థుడయ్యెను.

స్కాంధ పద్మ పురాణాదులందు
గల పతివ్రతా ధర్మములు
పదునాల్గవ అధ్యాయము

# పదునైదవ అధ్యాయము
## మృగశృంగుడు సంతానముగనుట

పరీక్షిత్తు మహారాజు ఓ శుక మహాఋషీ! మృగశృంగుడు పితృ దేవతా ఋణములను ఎటుల నిర్వర్తించెనో ఆనతిమ్మని కోరెను. శుకమహాఋషి చెప్పుచున్నాడు. ఓ పరీక్షితా! ఆ ప్రకారముగా మృగశృంగుడు గృహస్థాశ్రమమునందు ప్రవర్తించుచుండగా కొంతకాలమునకు ఆయన భార్యలలో ముఖ్యురాలైన సువృత అను నామె ఒక కుమారుని కనెను. అంతట అతడు పితృఋణమును తీర్చుకొన్నవాడై ఆచిన్నవానికి జాతకర్మాదులు చేయించి యిక తాను తపంబునకు పోవ తలంపున నుండెను. మృగశృంగుడు తన కుమారునకు మృకండుడని నామ

కుమారులను భార్యలను యోగ్యముంచుకుని తనయందు అగ్ని సమా
రోపణముచేసి తన భార్యా పుత్రాదులతో జెప్పి అనుజ్ఞ తీసుకుని అవ
ధూతాశ్రమము తీసుకుని అడవికి జని ఆకు అలము తినుచు నీరు
త్రాగుచు బహుకాలము గడపి దేహమును వదలి బ్రహ్మలోకమునకు
జనెను. మహా తపశ్శాలియైన మృగశృంగ మహాముని బ్రహ్మలోకము
నకు రాగా బ్రహ్మ గౌరవించి తగిన పీఠమందు గూర్చుండబెట్టెను. మృగ
శృంగ మహాఋషి బ్రహ్మలోకమందు చాలా కాలము సకల సుఖం
బులు అనుభవించి శ్వేతవరాహ కల్పమందు ఋభువు అను పేరుతో
బ్రహ్మమానస పుత్రుడై జన్మించెను.

ఓ పరీక్షితా! వింటివా! మృగశృంగ మహాఋషి చరిత్ర, యీ
ఋషి పుంగవుడు ఏ కాలమందుండినను మాఘమాస వ్రతాదులు మాని
ఎరుగడు. మాఘమాస వ్రతాదులు నానాధర్మములందు యింత ఫలితము
గలదు. అట్టి మృగశృంగ మహాఋషి యొక్క నలుగురు భార్యలు,
నలుగురు కుమారులు, కోడండ్రతో సుఖముగా గృహస్థాశ్రమము
నడుపుచు సుఖించుచు కాలక్షేపము జేయుచుండిరి.

మృగశృంగుని భార్యలు నలుగురును, తమ కుమారులవద్దను,
కోడండ్రవద్దను, మనుమలవద్దను తాము చేయవలసిన వ్రతములను,
దాన ధర్మములను చేయుచు క్రమముగా కాలము గడపిరి. తుదకు
ముసలివాండ్రై శక్తి సన్నగిలిన, యింద్రియ వ్యాపారములుడిగి,
చెట్టున మగ్గిన పండ్లవిధముగా నుండిరి. మృగశృంగుని పెద్దకుమారు
డైన మృకండు మహాఋషి తల్లుల వార్ధక్యమునకు విచారించి యీ
విధముగా పలికెను. నా తల్లులు ముగ్గురకు సంతాన సౌఖ్యము కలిగి
నది. నాకు భార్యయైన మరుద్వతియందు సంతానము పడయుటలేక
పోతిని అని విచారించి, ఎచ్చట తారకమంత్రమును చనిపోవునప్పుడు
కుడి చెవిలో జెప్పునో అట్టి దివ్యస్థానమైన కాశీపట్టణమునకు నా భార్యా
సహితముగా నా తల్లులను వెంటబెట్టుకుని వెళ్ళి సంతానము కొరకు
తపంబు జేసెదనని తలచి, తన భార్యతోను తల్లులతోను, మరదండ్ర

తోను, తమ్ములతోను, తమ్ములకుమారులు బంధువర్గముతోను జెప్పదగిన ముహూర్తమందు కాశీపట్టణమునకు బయలుదేరుటకు సిద్ధముగానుండిరి.

ఇట్లుంటగా ఆంధ్రదేశమును పరిపాలించు ఆంధ్రవివర్ధనుడను రాజు కాశీ యాత్రను జేయదలచి భార్యా పుత్రాదులతోను, మంత్రి పురోహితులతోను, తగినంత సేనలను తీసుకుని బయలుదేరగా తామును వారలతో గలసి ప్రయాణము సాగించుచుండిరి.

మృకండు మహాఋషి ప్రయాణ కాలమందు ముసలివాండ్రైన తన తల్లులకు భార్యకు ప్రయాణ బడలిక కలుగకుండునట్లు యిట్లని చెప్ప నారంభించెను. ఎవరు తల్లిదండ్రులచేత బంధు వర్గముచేత విడువ బడుదురో వారికి కాశీ దిక్కగును. ఎవరు వార్ధక్యమున నుందురో వారికి కాశీ దిక్కగును ఎవరు రోగముచేతను, పాపములచేతను, దారిద్ర్యముచేతను బాధపడుచుందురో వారికి కాశీదిక్కగును. ఎవరు దిక్కు-లేకను సంసార బాధలు అనుభవించలేక బాధ పడుదురో వారికి దిక్కగును. ఎవరు యోగాభ్యాసముచే చెడిపోయి యుందురో వారికి కాశీదిక్కగును. అయోగ్యురాలగు భార్యకలవానికి చెడ్డసంతానము కలవారికి క్షయపిచ్చి మొదలగు బాధలు కలవారికి కాశీ దిక్కగును. ఏ విశ్వేశ్వరుని సన్నిధానమందు పాపకర్మలు తగులబెట్టబడునో అట్టి మహా స్మశానమందున్న వారికి కాశీ దిక్కగును.

ఈ చెప్పబడిన వారికి కాశీని పొందుటయే యోగముగాని, అటవికిజని ఆకు అలము దిని తపస్సు జేయు యోగము కాదు, కాశి యందు నివశించుటయే మంత్రజపమును శివపూజయు నగును. కాశీ యందు నివశించుటయే స్వర్గముకాని వేరు స్వర్గము లేదు. తల్లి, దండ్రి, గురువు, చుట్టములు, విద్య యివి అన్నియు కాశీయేగాని యితరములు కావు. కాశిలో నివశించిన యడల, ధర్మ, కామ, మోక్షములు లభించును. కాశీయందు నివశించువారికి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆరు దుర్గుణములు నశించును. అని ప్రతిదినము తనతల్లులకు జెప్పుచు నడచుటయును బడలికపోవునట్లు జేయుచు కొలది కాలమునకు భార్యతోను, తల్లులతోను కాశీని జేరెను.

మృకండు మహాఋషి భార్యతోను తల్లులతోను కాశీచేరి ఆలస్యము చేయక వెంటనే మణికర్ణికయందు యథా విధిగా స్నానాదులు జేసి సంధ్యావందనాది సత్కార్యములు దీర్చుకుని పిమ్మట పువ్వులు, నువ్వులు, అక్షతలు, నీళ్ళు వీనితో దేవఋషి పితృతర్పణములుచేసి సంతోషించి తీర్థవాసులకు భోజనాది సత్కార్యములుజేసి తృప్తిపర్చెను.

దరిద్రులకు, దిక్కులేనివారికి అమృతాన్నమును పెట్టించి యథా విధిగా దండి వినాయకుడు మొదలగు క్షేత్రపాలకులనెల్ల ఆరాధించి విశ్వనాథుని దర్శించి స్తోత్రములు జేసి మృకండుడు తల్లులు సహితముగా క్షేత్రోపవాసము జేసెను. రాత్రి నాల్గుఝాములు జాగరమును జేసి మరునాడు తెల్లవారుఝామున మణికర్ణికాది ఘట్టములందు స్నానములనుజేసి నిత్యకృత్యములను నెరవేర్చుకుని శైవాగమము తెల్సిన పెద్దల తనవద్దనుంచుకుని సకలకోరికలను నెరవేర్చునట్టి లింగమును తన పేర ప్రతిష్ట జేసెను.

ఆతని తల్లులను తమతమ పేర్లు చెప్పి ఒక్కొక్కరు ఒక్కొక్క లింగమును దర్శనము చేసినంతమాత్రమే మోక్షమునిచ్చునట్టి నాలుగు లింగములను ప్రతిష్టచేసిరి. ఢుండి వినాయకుని ఎదుట నిలువబడి యుండు మృకండేశ్వరుని దర్శనము జేసిన వారికి తలచిన పనులన్నియు నెరవేర్చుకుని కాశీయందు నివశించుచుందురు.

ఆలింగమునకు ఎదుట సుమిత్రేశ్వరుడు, ఆలింగమునకు తూర్పున కమలేశ్వరుడు, దండి వినాయకుని గడపవద్ద విమలేశ్వరుడు, ఆ విమలేశ్వరునకు ఈశాన్య మూలయందు సురసేశ్వరుడు. ప్రతిష్టింపబడి యుండిరి. ఈనాల్గు లింగములను దర్శించువారికి సకల కోరికలు నెరవేరి కాశీయందే మోక్షమును పొందుదురు.

మృకండుని భార్య మరుద్వతి మణికర్ణికకు పడమటి తట్టున ఒక లింగమును ప్రతిష్టజేసెను. ఆ లింగమును దర్శనము చేసిన వారికి మనుష్యత్వము పోయి దేవత్వము లభించును. ఈ విధముగా కాశీ క్షేత్రము

నందు మృకండుడు మొదలగు వారు లింగములను ప్రతిష్టలు జేసి కాశీ యందు సంవత్సరము శివపంచాక్షరీ మహా మంత్రమును జపించుచు నివశించియుండిరి.

ఇట్లు నివశించుచు మహాపర్వములందు అచ్చటి తీర్థయాత్రలు జేయుచు అష్టాదశ క్షేత్రములందు గల చిత్రములను జూచుచు కాశీయందుగల పుణ్య తీర్థములన్నిటియందు స్నానాదులు జేయుచుండిరి.

ఇట్లుండగా తల్లులు సహితముగా మణికర్ణికా ఘట్టమునందు స్నానముచేసి శివాలయమునకు ప్రవేశించుచు ఓ విశ్వేశ్వర! రక్ష మాం అని కేకవేసి నేల బడిపోయిరి. అంతట విశ్వేశ్వరుడు వారలను పట్టుకుని దయకలవాడై వారి తలలను చేతనెత్తి అందరికి ఒకే పర్యాయము వారి కుడి చెవులలో, ఓం, ఓం, ఓం, అని ఓంకారమును ఉప దేశించెను.

స్కాంధ పద్మ పురాణములందు గల మృకండు
మహాఋషిచరిత్ర సంపూర్ణమగుట

పదునైదవ అధ్యాయము
మొదటి భాగము

శ్రీ రాజేశ్వరీ సోమలింగేశ్వరార్పణమస్తు (సర్వ) ఇది
శ్రీ వేమూరి సూర్యనారాయణ సిద్ధాంతి సర్వ గుణగణంకీ శ్రీ రాజ
రాజేశ్వరీ సోమలింగేశ్వర సుప్రసాద లబ్ధ పేటి వంశ పారావార
సుధాకరస్య సంజీవరాయామాత్య పుత్ర రామమంత్రామాత్య
తృతీయ పుత్రస్య బుధజన విధేయ వెంకట లక్ష్మీ
నృశింహ శర్మ ప్రణీత స్కాంధ పద్మ పురా
ణములందు గల మాఘమాస స్నాన దాన
వ్రతాదుల మహాత్మ్యము మాఘపురాణ
వచన కావ్యమున మొదటి భాగము
సమాప్తము,

# మా ఘ పు రా ణ ము

## రెండవ భాగము
## పదియారవ అధ్యాయము
## మృకండు మహాఋషియొక్క చరిత్ర

శ్రీశుకులు జెప్పుచున్నారు, పరీక్షిత్తుమహారాజును జూచి ఓ పరీక్షితా! వింటివిగదా మృకండు మహాఋషియొక్క చరిత్ర అని చెప్పగానే పరీక్షితుడిని ఓ శుకయోగీంద్రా! మృకండుని తల్లులు అట్లు పడిపోయిరిగదా వారేమైపోయిరి? మృకండునికి సంతానము కలిగి నదా! ఎట్లు కలిగినది? ఆ సంగతి నాకు విశదముగా జెప్పవలసినదని కోరెను.

శ్రీశుకులు జెప్పుచున్నారు. ఓ పరీక్షిత్తు మహారాజా! శ్రద్ధగా ఆలకింపుము. నీవు కోరిన విషయంబులను జెప్పుచున్నాను.

మృకండుని తల్లులు నలుగురును శివునిచే ఓంకారమును ఉపదేశింపబడి విమానములనెక్కి శివలోకమునకు జనిరి. మృకండుడు తల్లులు శివలోకమునకు జనుట చూచి తల్లులు నలుగురకు చేయవలసిన ఉత్తరకార్యములను కాశీయందే యథావిధిగా నిర్వర్తించి కాశీయందు చాలా కాలము ఈశ్వరుని పూజించుచు, శివుని అనుగ్రహముపొంది దీర్ఘాయుష్మంతుడైన కుమారుని కనెను. అతడే మార్కండేయుడని ప్రఖ్యాతి పొందెను.

అని చెప్పగానే పరీక్షితు శుక యోగీంద్రా! మృకండునకు శివుడు ఎటుల వరము యిచ్చెనో మార్కండేయులు ఎటుల జన్మించెనో చెప్ప వలసినదని కోరెను.

శుకమహాఋషి ఓ పరీక్షితా! మార్కండేయుని పుట్టుకను జెప్పెదను వినుము. మృకండుడు కాశీయందు చాలాకాలము విశ్వే శ్వరుని గూర్చి తపంబుచేసి పిమ్మట భార్యతో గూడ గోమతియను పుణ్యనదికి మాఘమాసము రాగా వెళ్ళి పర్ణశాల నిర్మించుకుని ఆ యేటిలో భార్యాభర్తలిరువురు స్నానాదికములు నిర్వర్తించుకుని "త్ర్యంబకంయజామహే" అను మంత్రరాజమున ఈశ్వరుని పూజిం చుచు, పూజించుచు పితృ దేవతలకు తర్పణాదులను జేయుచు పండ్లే ఆహారముగా జేసుకుని ఒక నెల కాలమున్న, ఆకులు మాత్రమే తినుచు రెండు నెలలున్న, ఆహారముమాని ఎండలోనిలుచుండి రెండు నెలలున్న, వానాకాలమందు వర్షములో తడియుచు, మంచుకాలమందు మంచులో నిలుచుండియు తపమును జేసియు, ఈశ్వరుని దర్శనము లభించకపోవుట చేత యిట్లు అని విచారించెను.

ఆహా! ఈశ్వరుడు తపో ప్రియుడు. నా పూర్వకర్మ ఫలితము చేత నా తపస్సు ఈశ్వరునకు తృప్తి కలుగజేయలేదు. ఉగ్రతపంబు జేసి ఈశ్వరుని సంతోషింపజేసెదగాక, యని విచారించి ఒకానొక మాఘ మాసమందు పంచాగ్ని మధ్యమందునిలచి సూర్యుని జూచుచు ఘోర తపంబు చేయసాగెను.

ఆ తపంబునకు దేవేంద్రాదులు తమతమ పదవులకు హాని కలుగునని భయపడి మృకండుని తపంబు జెడగొట్టుటకు అనేక విఘ్న ములను కలుగజేసిరి. గాని నిశ్చల ధ్యాన పరాయణుడైనమృకండుని తపంబునకు విఘ్నములు కలుగిచేయలేక పోయిరి. మృకండుడు చేయు తపంబునకు మూడు లోకములు తపింపసాగెను. తపోవేడిమికి మూడు లోకములందు పొగ వ్యాపింపసాగెను. ఈ విపరీతమునకు దేవతలు భయపడి కైలాసగిరియందు పార్వతీ సమేతుడై యున్న ఈశ్వరుని వద్దకు వెళ్ళి మృకండుడు జేయు తపోవేడిమి భరింపలేమనిన్ని, మూడులోక ములను రక్షింపవలసినదనిన్ని ప్రార్థించిరి.

ఆ మాటలు పార్వతీ పరమేశ్వరులు విని, ఓ దేవతలారా! మీరు భయపడకుడు. మృకండునికి వరంబులనిచ్చి తపంబు మానిపించెదనని చెప్పి దేవతలను ఎవరి తావులకు వారినిపంపించి వేసెను. పిమ్మట నందీశ్వరునెక్కి పార్వతీ పరమేశ్వరులు రుద్రగణములు పరివేష్టించి రాగా, బయలుదేరివచ్చి మృకండు మహాఋషి ఎదుట నిలువబడి ఓమృకండా! మేము పార్వతీ పరమేశ్వరులము. నీవు నీ భార్యతో సహితముగా తపోనిష్ఠతో నుంటివి. అందువలన మీ యిద్దరయందు దయగలిగి వరము లీయవచ్చితిమి. మీ ఉభయులకు కావలసిన వరంబులను కోరుకొనుడు. యిచ్చెదమని పలికిరి.

ఆ మాటలు తపోనిష్ఠలోనున్న మృకండు మహాఋషికిన్ని, భార్య మరుద్వతికిన్ని వినిపించినందున మెల్లగా కన్నులు తెరచి చూచి ఎదుట వృషభవాహనారూఢుండై రుద్రగణములచే సేవింపబడుచున్న పార్వతీ పరమేశ్వరులను జూచి అహా పరమేశ్వరా! తెల్లని దేహమందు నీలమేఘచ్ఛాయ గల పార్వతి అర్ధాంగియైన కొండవంటి దేహమున్ను, బాలచంద్రుని ధరించినవాడవున్ను, సర్పములే అలంకారములుగా గలవాడవున్ను, మూడు కన్నులు గలవాడవున్ను, హాలహలమను విషము కంఠమందు ధరించి నీలకంఠుడవను బిరుదము ధరించిన వాడవున్ను, నాల్గు భుజములందు అంకుశాది ఆయుధములు ధరించిన వాడవున్ను, వరదా! భయముద్రలను దాల్చిన వాడవైన పరమేశ్వరా! పాహిమాం రక్ష అని సాష్టాంగ నమస్కారములను జేసి చేతులు జోడించి ఈ ప్రకారము స్తోత్రము జేసెను.

ఓ మహాదేవా! దేవాదిదేవా! పరమేశ్వరా! నీలకంఠా, త్రినేత్రా, పరమేశ్వరా, ఆదిమధ్యాంత రహితుండవైన శంకరా, వేదాంత స్వరూపా, త్రికాలాత్మా, త్రిమూర్తిస్వరూపా, సృష్టి, స్థితి, లయకారకా విశ్వేశ్వరా. విశ్వాత్మక, హరిహర స్వరూపా, పిపీలకాది సర్వభూత స్వరూపా, సోమ, అగ్ని నేత్రుండవైన శ్రీ సోమలింగేశ్వరా,

నీవు నా తల్లియైన పార్వతీదేవితో కూడా ప్రత్యక్షమైతివి. నేను నా భార్యయున్ను, తరింపబడితిమి. మాకు మీ నిజ స్వరూపము జూపించుటచే యీ లోకమందు మాకు కావలసిన కోరికలు నేమి యుండును. సంసార విషవృక్షమును నిర్మూలించి పితృ, దేవతా ఋణాములను తీర్చునట్టిన్ని, సకలగుణ సంపన్నుడైనట్టిన్ని, త్రిలోక పూజ్యుడైనట్టిన్ని, నీకు మహాభక్తుడైనట్టిన్ని, మంచి గుణములుగల ఒక కుమారుని దయచేయవలసినదని కోరుకొనెను.

ఆ మాటలు పార్వతీపరమేశ్వరులు విని ఆలోచించి ఓ మృకండ! నీకు పూర్వకర్మ విశేషముచేత సంతానయోగము లేదు. అయినను నీ తపస్సునకు మెచ్చితిని గాన గుణరహితుండును, చిరాయువును గల కుమార్డు కావలెనా? సకలగుణ సంపన్నుండై, సకల విద్యాపారంగతుండై నాకు మహాభక్తుండగు పదియారు సంవత్సరములు పూర్ణాయువు గల ఒక్క కుమారుడు కావలెనా? నీవు నీ భార్యతో ఆలోచించి చెప్పుము. అనెను. ఆ మాటలు మృకండుడు విని భార్యతో ఆలోచించి, ఓ మహాదేవా! పుట్టిచచ్చినా సుపుత్రుడే మేలని పెద్దలు చెప్పుదురుగాన, సకల గుణ సంపన్నుండైన ఒక్క కుమారుని యిమ్మని కోరెను. ఆ మాటలు పార్వతీ పరమేశ్వరులు విని ఓయి నీకు, సకలగుణ శ్రేష్ఠుండును నాకు భక్తుండునై పదియారేండ్లు జీవించు పుత్రుడు కలుగునని దీవించి పార్వతీ పరమేశ్వరులు అదృశ్యులయిరి.

మృకండు మహాముని పార్వతీ పరమేశ్వరులవద్ద వరంబును పొంది, భార్యా సమేతుడై, కొలది దినంబులకు తన ఆశ్రమమునకు వచ్చి, తన సహోదరాదులతో యాత్రా విశేషంబులను తమకు పార్వతీ పరమేశ్వరులిచ్చిన వరంబును క్రమముగా వినిపించిన వారలు సంతోషించి సుఖంబుగా నుండిరి.

ఇట్లుండగా కొంతకాలమునకు మరుద్వతి గర్భిణియైన సంగతి తెలుసుకుని గర్భధారణ శిశు సంరక్షణార్థమైన గృహ్యా సూత్రమందు చెప్పబడిన పుంసవనాది, సీమంతాదులు యథావిధిగా చేయించెను.

యీ ప్రకారము తొమ్మిది మాసములు, పదిహేను రోజులు పూర్తి కాగా గురువు ఉచ్ఛస్థానమైన కర్కాటకమందును తక్కిన గ్రహములు తమతమ స్వస్థానాదులయందును నుండగా ఎల్ల శుభ లక్షణములతో గూడిన శతభిషా నక్షత్ర వృశ్చికలగ్నమందు మరుద్వతి సుపుత్రుని కనెను. సర్వారిష్టములు పోగొట్టునట్టి సూర్యబింబమువలె స్వచ్ఛమైన తేజస్సుతో దశదిక్కులను ప్రకాశింపజేయుచుండెను.

అప్పుడు దేవదుందుభులు మ్రోగెను. గంధర్వులు నృత్యము జేసిరి. పుష్పవర్షము కురిసినది. దేవేంద్రాదులు వేదవ్యాసాది మహామునులును, ఆ శిశువును చూడవచ్చిరి. వేదవ్యాసుడు ఆ శిశువునకు జాతకర్మాదులు చేయించి మార్కండేయుడని నామకరణము యధావిధిగా జేయించెను. మృకండు మహాఋషి దేవేంద్రాది దేవతలను వేదవ్యాసాది మహా మునులను షోడశోపచారంబుల పూజించెను. వారు మృకండునివద్ద శలవును పొంది తమతమ నివాసముల కరిగి సుఖంబుగా నుండిరి.

ఇట్లుండగా కొంతకాలమునకు నారద మహాముని మార్కండేయుని చూచుటకు రాగా మృకండు మహాముని నారదుని పూజించి అర్ఘ్యపాద్యాదులనిచ్చి కూర్చుండబెట్టెను. నారదుడు కొంతసేపు విశ్రమించి మృకండుని తొడ మీద కూర్చున్న మార్కండేయుని జూచి అతని సర్వావయవములు చేతితో పట్టిజూచి అన్ని సుభ లక్షణములను, పరీక్షించి తొంబది ఆరు అంగుళముల పొడవు గలవాడున్ను, ఆజాను బాహువులు గలవాడున్ను, అయిన మార్కండేయుని చేయి తనచేతితో పట్టుకుని మృకండునితో ఓ మునిశ్రేష్టా ! నీ కుమారుడు ఎల్లసుఖములను కలుగజేయుగల మంచి లక్షణములు గలవాడును, చిరంజీవి అగునట్టి అవయవములుగలవాడును, పాదములందును, అరచేతులందును, మత్స్య, ధ్వజ, పద్మ, శంఖ, చక్ర, కుంభ రేఖాదులు గలవాడును, అందువలన పదివేలయేండ్లు జీవించు లక్షణములు గలిగియున్నవి.

ఈ లోకమునందు ఈ శుభలక్షణములు గలవాడు వీనికి సమానుడు లేడు. అయినను వీనికి ఆయువ పదియారేండ్లే యున్నదని చెప్పి నారదుడు తన ఆశ్రమమునకు వెళ్లెను. మృకండు మహాముని నారదుడుచెప్పిన మాటలువిని ఈశ్వరుడిచ్చిన వరంబును దలచుకొనుచు సుఖంబుగా బాలుని పెంచుకొనుచుండిరి. యిట్లు సుఖంబుగా కాలమును గడుపుచు, అన్నప్రాశనము జేయించి, మూడవ మాసంబున అనగా రెండున్నర సంవత్సరమున కేశఖండనము జేయించి శ్రవణా నక్షత్రమందు చౌర కర్మచేయించి అయిదవ వత్సరమున అక్షరాభ్యాసమున్ను, గర్భాష్టమందు ఉపనయనము జేయించెను. పిమ్మట ఉపాకర్మ జేసి సకల వేదములను జెప్పించుచు, కుమారుని జూచి నాయనా నీవు ఎచ్చటనైనా సరే బ్రాహ్మణులు కనబడిన వారికి నమస్కారము జేయుచుండుము. అందువలన నీవు దీర్ఘాయుష్మంతుడవు కాగలవు అని చెప్పెను. వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణ వాక్యములు వ్యర్థములు కానేరవు. అని మృకండుడు మార్కండేయుని బ్రాహ్మణులకు నమస్కారములు జేయుటకు పంపించెను.

ఇట్లు తండ్రిచే బోధింపబడిన మార్కండేయుడు పగళ్లయందును, రాత్రులయందును అతిభక్తితో కనబడిన బ్రాహ్మణులకు దేవాలయమందున్న దేవతలకు నమస్కరించుచు, వారివలన ఆశీర్వచనములను పొందుచుండెను. ఈ విధముగా మార్కండేయుడు వేదాధ్యయనము జేయుచు, బ్రహ్మచర్య వ్రతమును నడపుచు, బ్రాహ్మణులకు, దేవతలకు నమస్కరించుచు, పదునైదేండ్లు సుఖంబుగా నడచెను.

ఇట్లుండగా ఒకానొకప్పుడు శ్లో. కశ్యపోత్రి, భరద్వాజ, విశ్వామిత్రో, గౌతమః, వశిష్టో, జామదగ్నిశ్చ సప్తైతేఋషయ స్తథా. అను సప్త మహాఋషులు మార్కండేయుని జూచుటకు మృకండు మహాముని ఆశ్రమమునకు వచ్చిరి. మృకండుడు వారిని అర్ఘ్యపాద్యాది షోడ

షోపచారముల పూజించి కూర్చుండబెట్టెను. అంతట మార్కండే యుడు, కశ్యపుడు, అత్రి, భరద్వాజ, విశ్వామిత్రుడు, గౌతముడు జాను దగ్ని అను మహాఋషులకు నమస్కరించెను. వారు, దీర్ఘాయురస్తు అని దీవనల పొంది, వశిష్టునకు నమస్కరించుటకు వచ్చెను. వశిష్టుడు మార్కండేయుని చేతితో పట్టుకుని నమస్కరింప వద్దని ఆజ్ఞజేసెను.

పిమ్మట మార్కండేయుడు చేతులు జోడించుకుని నిలువబడెను. తక్కిన ఆర్గురు మహా ఋషులున్న వశిష్టుని జూచి వశిష్టా ! ఎవరైనను నమస్కరింపవచ్చినవారిని వలదని చెప్పరాదు గదా ? యిప్పుడు నీవు నమస్కరింపవచ్చిన మార్కండేయుని నమస్కరింపవలదనుట కార ణము చెప్పవలసినదని అడిగిరి.

వశిష్టుడు జెప్పుచున్నాడు, ఓ మునులారా ! మీరు ఉపయో గములేని దీవనలు జేసితిరి. మీ దీవనలు అసత్యములయినవి. అనగానే మేము ఎట్లు అసత్యమును పలికితిమి. మేము ఎన్నడును అసత్యము పలికి ఎరుగము. ఎచ్చట ఎప్పుడు అసత్యము పలికితిమో చెప్పుము అని యడి గిరి. వశిష్టుడు ఓ మునులారా ! యిప్పుడు మీరు యీ మార్కండే యుని దీర్ఘాయుష్మంతుడవు కమ్మని దీవించితిరి. వీనికి ఈశ్వరుడు పది యారు సంవత్సరములే ఆయువు యిచ్చినాడు. యిప్పుడు పదునైదేండ్లు గడచినవి. పదియారవ సంవత్సరము పూర్తికాగానే యీ బాలుడు మృతిపొందును. అందువలన మీ దీవనలు వ్యర్థములగును అని చెప్పెను.

మహాత్ముడైన వశిష్టుని మాటలు విని అప్పను యితనికి పైసంవ త్సరమున చావు తప్పదు. యిందులకు తగిన సాధనమేమియున్నది. మా వాక్యములు వ్యర్థములు కాకుండునట్లును వీనికి దీర్ఘాయుర్దాయము కలుగు నట్లును జేయు సాధనమును జెప్పవలసినదని కోరిరి.

అప్పుడు వశిష్ట మహాఋషి ఆ ఋషులను చూచి మీరు భయ పడకుడు. మనమందరము బ్రహ్మవద్దకు బోయి ఈ మార్కండేయుని చే బ్రహ్మకు నమస్కారమును చేయించెదము. అప్పుడు బ్రహ్మ ఏమి

జెప్పునో విని అటుపిమ్మట బ్రహ్మతో ఆలోచన జేయుదము అని చెప్పెను.

ఆ మాటలకు అందరును సమ్మతించిరి. అంతట వశిష్టాది మహా మునులు అందరును మార్కండేయుని వెంటబెట్టుకుని సత్యలోకము నకు వెళ్ళిరి. సత్యలోకమందు బ్రహ్మ ఇంద్రాది సకల దేవతలతోను వాలఖిల్యాది మహామునులతోను కూడుకుని మహాసభ జేసి యుండెను. గంధర్వులు పాడుచుండిరి. రంభ ఊర్వశి మొదలగు వేశ్యకాంతలు నృత్యములు జేయుచుండిరి. అటువంటి సమయమందు వశిష్టాది సప్త మహాఋషులు మార్కండేయుని బ్రహ్మ ఎదుటకు తీసుకుని వెళ్ళి తాము నమస్కరించి మార్కండేయుని చే నమస్కారము చేయించిరి. ఆ బ్రహ్మ మార్కండేయుని చూచి నాయనా మార్కండేయా! నీవు దీర్ఘాయుష్మంతుడవు అగుదువని ఆశీర్వదించెను. తరువాత అచ్చటనున్న దేవేంద్రాదులకున్ను, మహాఋషులకున్ను మార్కండేయుడు యథా విధిగా నమస్కరించి చేతులు జోడించుకుని నిలుచుండెను. వారంద రును దీర్ఘాయుష్మంతుడవు కమ్మని దీవించిరి.

అంతట వశిష్ట మహాముని అచ్చటనున్న వారినందరను చూచి చిరునవ్వు నవ్వుచు, బ్రహ్మతో ఓ తండ్రీ! ఈ మునులందరితో పాటు నీవును అసత్యము పలికితివి. అని చెప్పెను. అనగానే మేమందరము ఎటుల అసత్యము పలికితిమో చెప్పుమని అడిగెను.

వశిష్ట మహాఋషి చెప్పుచున్నాడు, ఓ తండ్రీ! మీరందరు అసత్యమును పలుకనివారని నేనును ఎరుగుదును. అయినను నీవు సృష్టిం చుటయందు గల ప్రకారము ఈ మార్కండేయుని దీర్ఘాయుష్మంతుడవు కమ్మని దీవించితివి. ఈ మహాఋషులును అట్లే దీవించిరి. ఈ మార్కం డేయునికి ఈ సంవత్సరాంతమందు చావు సిద్ధించును. కాబట్టి మీరంద రును ఈ మార్కండేయునికి చావు లేకుండునట్లును మీ ఆశీర్వచన ములు వ్యర్థములు కాకుండునట్లును ఉపాయమును ఆలోచింపుమని

చెప్పెను. ఆ మాటలు బ్రహ్మవిని కొంచెము ఆలోచించి యేమిజేయుటకు దోచక దీర్ఘముగా యోచించి యిట్లని చెప్పెను. ఓ పుత్రా! వశిష్టా! ఈశ్వరుడు శ్లో. మాంచవిష్ణుం, గిరుత్మంతం, శుకం, ప్రహ్లాదమేచ్ఛ, హనూమంతం బలిం, బాణం, ధ్రువం, వ్యాసం, విభీషణం, చక్రేయస్మా, ధృతేతస్మా, న్యాన్యంపశ్యామి, శంకరాత్. అనగా ఈశ్వరుడు నన్ను, బ్రహ్మను, విష్ణువును, గరుత్మంతుని, శుకుని, ప్రహ్లాదుని, హనుమంతుని, బలిని, బాణుని, ధృవుని విభీషణుని, చిరాయువులుగా నుండునట్లు జేసెను. ఆయువుయిచ్చుటకు కారకుడైన ఈశ్వరుడు తప్ప యితరులకు శక్యముకాదు. అని చెప్పి బ్రహ్మ మార్కండేయుని ఎడమ చేతితో జేదీసి కౌగలించుకొని, కుడిచేయి శిరస్సునయుంచి, నేను మనస్సుచేతను, వాక్కుచేతను, కర్మచేతను అసత్యము పలుకనివాడనై శివభక్తుడనైతినేని ఈ చిన్నవాడు సప్తకల్పాంతములు వరకు దీర్ఘాయుష్మంతుడు అవునుగాక యని పలికెను.

ఆ మాటలకు మహాఋషులందరును సంతోషించిరి, బ్రహ్మ ఓ చిన్నవాడా! నీవు కాశి, సిద్ధిజనార్ధన క్షేత్రము మొదలగు మహాక్షేత్రములకు వెళ్ళి ఈశ్వరుని పూజింపుము. అని చెప్పెను.

మార్కండేయుడు బ్రహ్మవద్ద శలవు తీసుకుని భూలోకమునకు వచ్చి తల్లిదండ్రులకు సాష్టాంగ నమస్కారములు జేసి బ్రహ్మలోకమునందు జరిగిన వృత్తాంతమును తల్లి దండ్రాదులకు జెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మృకండు మహాఋషి
సంతానము గనుట అను వృత్తాంతము గల
పదునారవ అధ్యాయము

# పదునేడవ అధ్యాయము

## మార్కండేయుడు దీర్ఘాయుష్మంతుడగుట

శుకమహాఋషి యిటుల జెప్పగానే పరీక్షితు మహారాజు శుకుని జూచి మహాత్మా! మార్కండేయుడు ఎటుల దీర్ఘాయుష్మంతుడయ్యెనో ఆనతిమ్మని కోరెను.

శుకుడు జెప్పుచున్నాడు. ఓ రాజా! వినుము. మార్కండేయుడు బ్రహ్మలోకమునుండివచ్చి చెప్పిన వృత్తాంతమును మృకండు మహా ఋషిన్ని, తల్లి మరుద్వతిన్ని విని తమ కుమారునకు నేటికి ఆరు మాసములు మాత్రమే ఆయువ యున్నదని తెలుసుకుని యిట్లని విచారింప సాగిరి.

కుమారా! నిన్నువదలి ఒక్కఘడియు కాలమైనను మేము బ్రతుకలేము. నిన్ను అనేక వ్రతములు తపములు జేసి ఈశ్వరుని వరమున బడసితిమి. నీవులేని ఘడియయు మాకు ఈ సృష్టి జాలమంతయు లేని దానిగా కనబడును. కొడుకులు లేనివారికి జేయబడు క్రియలన్నియు వ్యర్థములు. పుత్రులు లేనివారికి లోకములుగాని, లోకములోని సుఖములుగాని లేవు. పుత్రులు లేనివారికి గృహస్థ ధర్మము లేదు. పుత్రులు లేని గృహము శూన్యగృహమందురు. సూర్యుడు లేని పగలు చంద్రుడు లేని రాత్రి పుత్రులు లేని గృహము శూన్య గృహంబులని పెద్దలు చెప్పుదురు. మేఘచ్ఛన్నేన దుర్దినః అనివున్నది. దుర్మార్గులైన పుత్రులు పుట్టుటయు శూన్య గృహంబులని పెద్దలు చెప్పుదురు. అన్నిటికంటె సుగుణ సంపత్తిగల పుత్రుని చావు మిక్కిలి దుఃఖము కలుగజేయును. ఓ పార్వతీ పరమేశ్వరులారా! మా యందు నీకు దయలేదా ఓ దైవమా! పూర్వజన్మమునందు బ్రాహ్మణుల ధనమును అపహరించితినా, తల్లిదండ్రులనుండి బిడ్డలను విడదీసితినా, రాత్రి పూట వచ్చిన అతిథిని తిట్టి పొమ్మంటినా, బిడ్డలు గలవారినిజూచి ఓర్వలేక పోతినా, దేవతానిందా, బ్రాహ్మణనిందా, యతినిందా చేసినా, పరస్త్రీలను బలత్కరించితినా, "నాథజన సంతాపం కిమాశ్చర్యం కులక్షయం" అనునట్లు సాధు జనులను బాధించితినా, అని అనేక విధముల ప్రలాపములు జేయుచు యేడువ సాగెను. తల్లి మరుద్వతి యిట్లని యేడువ సాగెను. పాలు త్రాగెడి పిల్లలను తల్లులనుండి విడదీసితినా, యితరుల పిల్లలను జూచి ఓర్వలేక పోతినా, పరపురుషుని చూచి సంతోషించితినా, జారునితో భోగింపగోరి పతిని తిరస్కరించితినా, యింటి ద్రవ్యమును పాము

జేయుట, పొరుగు యిండ్లకు తిరుగుట మొదలగు చెడ్డపనులు జేసితిరా, ఇట్లు చెడ్డపనులను ఎన్నడును జేసియుండలేదుకదా, నాకు యీ పుత్రశోకము యెటులవచ్చినది?

అని అనేక విధముల విచారించుచున్న తల్లిదండ్రులను మార్కండేయుడు చూచి మీకు విచారము కలుగుటకు కారణము ఏమని అడిగెను. అటుల అడిగిన కుమారుని మాటలు మృకండుడు విని, నాయనా! మేము నీ కొరకు యేడ్చుచున్నాము. నీకు ఈశ్వరుడు పదియారు యేండ్లు ఆయువ యిచ్చియున్నాడు. నేటికి పదునైదు సంవత్సరములు ఆరుమాసములు గతించినవి. యింక నీవు ఆరునెలలు మాత్రమే జీవింతువు, ఆరునెలలు ఆరునిముషములవలె మాకు కనబడు చున్నవి. నీకు ఆయువులేదు గదా, యని విచారించుచున్నాము, కన్నులులేని వానికి ఈ లోకమంతయు చీకటిగా నుండును. బిడ్డలులేని వారికి అన్నిలోకములు చీకటిగానే యుండును, అని తండ్రి చెప్పగానే మార్కండేయుడు విని మీరు నాకొరకు విచారింపనక్కరలేదు. శివుని వరమున బుట్టిన నాకు అల్ప ఆయువ ఎట్లుగలుగును. మృత్యువును, జయించిన ఈశ్వరుని వలన నాకు ముదిమిని చావు లేకుండునట్లు వరంబులను పొందుదును. నేను శ్రీ మహావిష్ణువును సేవించి వరంబులను పొందుదును. అని మార్కండేయుడు పలుకగానే తల్లిదండ్రులు విని దుఃఖమును విడచి కుమారునితో యిట్లని చెప్పిరి.

మృకండు మహాఋషి కుమారా! మార్కండేయా నీవు మా యిరువురి దుఃఖమును పోగొట్టుటకు మృత్యువును జయించు మహాశివుని పూజించుటయును మహాభక్తిని చెప్పియుంటివి అంతకంటె యితరమైన దిక్కులేదు. నీవు యిప్పుడే కార్యము నెరవేరునట్టి పుణ్యక్షేత్రమునకు వెళ్ళి ఈశ్వరుని ఆరాధించి చిరంజీవత్వము పొందుము. శ్లో. గచ్ఛగోదావరీం, రమ్యాం, తత్రాశ్రమపదం, శుభం, సిద్ధి, క్షేత్రం, పరం, ప్రాహుస్మునయస్సిద్ధివేదినః, గోదావరీ, తటంగత్వా, సిద్ధక్షేత్రం పరం ప్రభో. అనగా గోదావరీ నదీతీరమందు అనేక పుణ్యా

క్షేత్రములు గలవు. కనుక నీవు అచ్చటకు పోయి కార్యసిద్ధి నిచ్చెడు సిద్ధిజనార్దనక్షేత్రమందు యిప్పుడు దీనినే కోటిఫలీ క్షేత్రమని పిలిచెదరు. ఆ కోటిఫలీ క్షేత్రమందు ఆశ్రమము జేసుకొని మహాఋషులు తపంబుచేయు ఆ ప్రదేశమందు దేవతలకు దేవుడైన శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరుని ఆరాధింపుము. నాయనా! పూర్వకాలమందు శ్వేతకేతువను వాడు యముని పాశములచేత కట్టబడగా ఆ సోమలింగేశ్వరుడే కట్టు వదలించి యమ పాశమునుండి రక్షించెను. పాల సముద్రము తరచునప్పుడు బుట్టిన హాలాహలమును ఆ సోమలింగేశ్వరుడే మ్రింగి మూడులోకములను రక్షించెను.

జలంధరుడను రాక్షసుడు మూడు లోకముల సంపదను అపహరించి గర్వించి యుండగా ఆ జలంధరుడు శివుని వలన జల మధ్యమందు బుట్టిన చక్రమును శ్రీ మహావిష్ణువునకు యిచ్చెను. శ్రీ మహావిష్ణువు జలమధ్యమందు ధ్యానించగా బుట్టిన త్రిశూలమును ఈశ్వరునకు యిచ్చెను. శివకేశవులిరువురు జలంధరుని చక్ర త్రిశూలముల చేత జంపిరి. కనుక నీవు సిద్ధులచేతను, గంధర్వులచేతను, దేవతలచేతను, ఎల్లప్పుడు సేవింపబడుచుండెడి శ్రీ కోటిఫలీ క్షేత్రమునకు వెళ్ళి శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరుని పూజింపుము అని మార్కండేయునితో జెప్పెను.

పరీక్షిత్తు మహారాజు శ్రీశుకుని చూచి జలంధరుడనువాడు ఎవడు? వాని వీర్యము ఎటువంటిది ? సవిస్తరముగా జెప్పవలశినదని కోరెను.

శ్రీ శుకులు జెప్పుచున్నాడు. పూర్వకాలమునందు హిరణ్యుడను వాని పదియవ కొడుకు (వీనినే హిరణ్యకశిపుడని పిలచెదరు) అగ్నిజిహ్వుడను వాడు కలడు. వాని పేరు విన్నమాత్రము చేతనే మూడు లోకములు గజగజ వణకుచుండును. ఆ అగ్ని జిహ్వునకు సూకరుడను కొడుకు గలడు. వాడు తపంబుల బ్రహ్మను మెప్పించి, దేవతలు, రాక్షసులు నాగులు మొదలగు వారిచేత గాని వారివారి ఆయుధములు చేత

గాని చావు లేకుండునట్లును నీటి అడుగు భాగమునందు నివాసముగా నుండునట్లును వరంబులను పొందెను. వాడే జలంధరుడని పిలువ బడు చున్నాడు వాడు మూడు లోకములను జయించి, శివకేశవులను జయించుటకై బయలుదేరెను.

ఈ వార్త శివకేశవులు విని వానికి భయపడి మేరు పర్వతము నందు గల మానసరోవరంబున నీటిలో దాగియుండిరి. ఆ జలంధరుడు అన్నిదిక్కులను వెదకి ఎందును గానక విచారించుచుండెను.

ఇట్లుండగా శివకేశవు లిద్దరును వానిని జంపునట్టి ఉపాయమును ఆలోచించు తపోనిష్టలో నుండగా శివుని చేతికి చక్రమున్ను, కేశవుని చేతికి త్రిశూలమున్ను వచ్చి నిలచెను. వారు వాటిని జూచి సంతోషించి, చక్రమును కేశవుడున్ను త్రిశూలమును ఈశ్వరుడున్ను పుచ్చుకుని జలంధరుని రాకకెదురు జూచుచుండిరి.

ఒకనాడు నారదుడు జలంధరుని వద్దకువెళ్ళి, శివకేశవులు మానస సరోవరమందున్నారని చెప్పెను. ఆ మాటలు విని జలంధరుడు మానససరోవరమునకు వెళ్ళి నీటిలో మునిగి వారిని వెదకుచు రాగా వారు వీనికి తెలియకుండగా గట్టునకు వచ్చిరి. ఆ రాక్షసుడు నీటిలో వెదకి కానబడక గట్టునకు వచ్చెను. శివకేశవులు ఒకరి ఆయుధమును మరిఒకరు ధరించినవారు గాన జలంధరుడు పైకి రాగానే యిద్దరును ఒక్కపెట్టున వానిపై బడి చంపివేసిరి. అంతట మూడు లోకములు సంతోషించెను.

నాటినుండియు చక్రము మహావిష్ణువుదనిన్నీ, త్రిశూలము ఈశ్వరుని దనిన్నీ పిలువబడుచున్నవి అని జెప్పెను.

మృకండు మహాఋషి తన కుమారుడైన మార్కండేయుని జూచి కుమారా! ఈశ్వరుని మహాత్మ్యమును జెప్పెదను వినుము. మూడు లోకములను గెల్చిన మన్మథుని భస్మము జేసెను. గనుక నీవు కోటిఫలీ క్షేత్రమునకు వెళ్ళి ఆశ్రమము యేర్పరచుకుని శ్రీ సోమలింగేశ్వరుని పూజింపుమని జెప్పెను.

తల్లిదండ్రులు చెప్పిన మాటలు మార్కండేయులు విని నదులలోకెల్ల శ్రేష్ఠమైనదియు, గౌతమ మహాముని చే పూజింపబడుచున్న గోదావరినదికి పోయి గొప్పవాడును అందరిచేతను పూజింప దగిన వాడును అయిన మార్కండేయుడు సిద్ధిజనార్ధన క్షేత్రమునకు వెళ్ళి ఆ యేటికి దక్షిణభాగమందు బ్రహ్మమేధ్యమను స్థలమందు లింగమును స్థాపించి, శాస్త్రములందు జెప్పబడిన ప్రకారము ప్రాతఃకాలమునందు స్నానాదులను జేయుచు, తాను ప్రతిష్టించిన లింగమును పూజించి, పిమ్మట సిద్ధి జనార్ధన క్షేత్రమునకు వచ్చి శ్రీ సోమలింగేశ్వరుస్వామిని మూడు వేళల పూజించుచు, ధ్యానించుచు, తపంబు జేయుచుండెను. యిట్లుండగా మాఘ మాసము రాగా మార్కండేయుడు ఆహారమును విసర్జించి నిరాహారుడై త్రికాలములయందు, పంచబిల్వంబులు శ్లో. తులశీ, బిల్వ, నిర్గుండీ, జంబీరామలకతథా. అనగా తులశీదళములు, బిల్వదళములు, వావిల దళములు, నిమ్మ దళములు, ఉశిరిక దళము లున్ను అనేక విధములైన ఫల పుష్పాదులను శ్రద్ధగా సంగ్రహించి పూజించుచు, సర్వవ్యాపకుడైన ఈశ్వరుని ధ్యానించుచుండెను.

ఇట్లుండగా మార్కండేయునకు మాఘశుద్ధ పంచమీలతో పది ఆరు సంవత్సరములు పూర్తి ఆయెను.

ఆ సమయమందు బ్రహ్మ దేవతా గణము పరివేష్టించి రాగా కైలాస పర్వతమునకు వెళ్ళి పార్వతీ పరమేశ్వరులను జూచి, ఓ పార్వతీ పరమేశ్వరులారా! దక్షిణా మూర్తియున్ను, మహేశానుడవున్ను, ఈశ్వరుడవు నైన నిన్ను శివునిగా పూజించుచున్నాను. అని నమస్కరించెను,

అంతట పార్వతీ పరమేశ్వరులు, బ్రహ్మాదులను గౌరవించి పూజించి కూర్చుండ నియమించి మీరు వచ్చిన కార్యమును జెప్పవల శినదని అడిగెను బ్రహ్మ జెప్పుచున్నాడు. శ్రీ సోమలింగేశ్వరా! నీవు మార్కండేయునకు పదినారు సంవత్సరములు మాత్రమే ఆయువు

యిచ్చియున్నావు. ఆ సంగతి నేను పరాకున తెలుసుకొనక మార్కండేయులు ముక్కగా తక్కిన మునులవలెనే నేనును దీర్ఘాయుష్మంతుడవుకమ్మని ఆశీర్వదించితిని.

కాబట్టి నీవు మా దీవనలు వ్యర్థములు కాకుండునట్లు జేయవలశిన్నదని జెప్పెను. ఆ మాటలు ఈశ్వరుడు విని తాను జేసిన జీవిత కాలమును తెలుసుకొని బ్రహ్మేంద్రాదులను వారివారి తావులకు పంపించి వేసెను. పార్వతీ పరమేశ్వరులు, మార్కండేయుడు జేయుచున్న పూజాదులకున్ను, స్తోత్రములకున్ను, సంతోషించుచుండిరి.

మార్కండేయునకు మాఘశుద్ధ పంచమినాటికి పదిఆరు సంవత్సరములు పూర్తికాగా యమధర్మరాజు భూలోకమందు గల మార్కండేయుని తీసుకొని రావలశిన్నదని తమ దూతలకు ఆజ్ఞాపించెను. వెంటనే యమదూతలు వచ్చి మార్కండేయుడు పుష్పాదులకు రాగా జూచి భయంకర రూపములతో వానిని కొట్టి పట్టుకొన బోయిరి. అంతట మార్కండేయుడు యమదూతల భయంకర రూపంబులు జూచి భయపడి శంకరా! శంకరా! యని కేకలు వేయుచు దేవాలయంబున ప్రవేశించి ఈశ్వరుని పూజింపుచుండెను. యమదూతలు దేవాలయమందు ప్రవేశించుటకు రుద్రగణములు కాలభైరవుడు అడ్డురాగా వారు తిరుగా యమలోకమునకు వెళ్ళి యమధర్మరాజుతో మనవి జేసుకొనిరి.

ఆ రోజు మాఘశుద్ధ సప్తమి రథసప్తమి యనియు, సూర్యజయంతి యనియు పిలిచెదరు. అది మహాపర్వదినమున్ను, అష్టైశ్వర్యములను, ఆరోగ్యమున్ను, యిచ్చునట్టిదై యున్నది యమధర్మరాజు యథావిధిగా మాఘ స్నానము జేసి సూర్యజయంతి వ్రతమును పూర్తి జేసుకుని హరిహరాదుల పూజించి మహిషమునెక్కి పాశాది, ఆయుధంబులు ధరించి, మృత్యుదేవతాదులు కొలుచుచు రాగా యమదూతలతో మార్కండేయుని వద్దకువచ్చి ఓ మార్కండేయా! నీ ఆయువు గతించి రెండురోజులు గడచినవి నీ సుకృతము కాపాడినది. యింక నీవు

యమలోకమునకు రాకతప్పదు. గాన నీవు గుడిలోనుండి యవతలకు రావలసినదని చెప్పెను. ఆ మాటలు మార్కండేయుడు విని ఓ యమ ధర్మరాజా! ఈ రథసప్తమీ వ్రతము సకల కోరికలను నెరవేరునట్టిది. గాన నేను యిప్పుడు శివుని స్తోత్రము జేయుచున్నాను.

ఈ స్తోత్రము ముగియువరకు నా జోలికి రాక ఆగవలసినదని చెప్పెను. నేను యీ సోమలింగేశ్వర స్తోత్రము జేసి పూజించువరకు నిద్రపోను. ప్రపంచకము లేనట్లుగా భావించెదను అని చెప్పెను.

తరువాత యిట్లని చెప్పసాగెను. ఓ ధర్మరాజా! నేను ఎన్నడును బొంకి ఎరుగను. మనో వాక్కాయ కర్మలచే యదార్థమును జెప్పితిని. నేను ఎన్నడును అసత్యము పలుకక, భక్తితో శివపూజను జేయుచున్న వాడనైతినేని శివుడు ప్రత్యక్షమగుగాక, అని చెప్పి నాయందు దయ యుంచి ఈ శివస్తోత్రము ముగింపు జేయువరకు నన్ను ఏమియు అన కుండగా నుండుమని ప్రార్థించెను.

ఆ మాటలు యమధర్మరాజు విని ఓ చిన్నవాడా! ఎవరు ధాన ధర్మములను స్నానాది వ్రతాదులను జేయరో వారు దారిబత్తెములేక విచారించెదరు. ప్రతిమనుష్యుడు ఆషాఢమాసము మొదలు మాఘ మాస పర్యంతము ఎనిమిది మాసములు పాటుపడునో? అట్టి మను ష్యుడు సంవత్సరమంతయు సుఖించును. చిన్నతనమునందు శ్రమపడి సంపాదించిన ధనము ముసలితనము వచ్చినప్పుడు సుఖముగా జీవింప వచ్చును. ఏ పూట చేయవలసిన పనులను ఆ పూటయే ముగింపు జేయ వలెను గాని ఎప్పుడో జేయవచ్చునని మానరాదు.

నేను నీ కొరకు కాసుకొని యుండు వాడనుగాను. నీవు చెప్పిన మాటలు నాకు సరిపడవు అని చెప్పి యమపాశమును మార్కండేయుని మెడకు వేసి లాగెను. అంతట మార్కండేయుడు ఓ ధర్మరాజా! ఆగుము, ఆగుము అని ప్రార్థించెను.

యమధర్మరాజు జెప్పుచున్నాడు. మార్కండేయా! మనుష్యుడు చావు కాలము రానినాడు బాణములతో పొడిచినను పర్వతములనుండి క్రిందకు త్రోచినను చావడు. చావు కాలము వచ్చినప్పుడు, గడ్డిపోచ తాకిన చావు వచ్చును. గాన నీ ఆయువు పూర్తి అయి రెండు దినములు గడచినవి. నాచేత వేలకొలది చక్రవర్తులు, వందలకొలది యింద్రాదులు యమలోకమునకు తేబడిరి. గనుక విచారింపకుము. అని చెప్పెను.

మార్కండేయుడు అటుల దయలేక చెప్పుచు మాటలాడుచున్న యముని మాటలు విని ఈశ్వరుని స్తోత్రము జేయుటయందుగల పట్టుదలను వదలక ఓ యమధర్మరాజా! నీవును ఈశ్వర పూజా ధురంధరుడవే! ధర్మాత్ముడవు, ధర్మకార్యార్థపరుడవు, పాపాత్ములయందు భయంకరాకారుడవు గాని పుణ్యాత్ములకు ధర్మ స్వరూపుడవే. నేను జీవితాశమీద నిన్ను వలదని చెప్పలేదు. ఈశ్వర పూజయందు గల ధ్యానమున కొంతకాలము ఆగమని జెప్పితిని గాని వేరుకాదు. ఈశ్వర పూజకు విఘ్నములను జేయువారు శీఘ్రముగా నశింతురు. శివభక్తుల యందు తప్పు ఉన్నయెడల శివుడే శిక్షింపవలెను, గాని యితరులు శిక్ష జేయుటకుతగరు. ఈశ్వరభక్తులకు చేయలేని కార్యములు లేవు. కొండలను పిండి క్రింద కొట్టుటకు సముద్రమందు గల నీటినంతయు త్రాగుటకును భూమి ఆకాశములను క్రింది మీదులను చేయుటకును చాలియుందురు. శివభక్తులకు బ్రహ్మాది దేవతలు సహితము గడ్డిపరకవలె కానబడుదురు. ఈశ్వరభక్తులకు చావుగాని భయముగాని లేదు. ఈశ్వర భక్తులకంటె ప్రపంచకమున గొప్పపదార్థము లేనే లేదు. ఈశ్వరభక్తులను బ్రహ్మాది దేవతలే చంపలేరు. ఓ యముడా! నీవు మాత్రము నాకు ఒక లెక్కలోనివాడవు. గావు అని బెదరించి పలుకుచున్న మార్కండేయుని మాటలను యమధర్మరాజు విని మండిపడుచు మండుచున్న అగ్నిహోత్రమందు నేయిపోసిన విధముగా నుండి పండ్లు

పటపట కొరికి ఓరీ! దుష్టబుద్ధిగల మార్కండేయా! ఈ గౌతమీ నది లోని యిసుక రేణువులను లెక్కపెట్టవచ్చునుగాని నాచేత యమ లోకమునకు తేబడిన బ్రహ్మలు, విష్ణువులు, ఈశ్వరులు, ఇంద్రాదులను లెక్కపెట్టలేరు. బ్రహ్మ, విష్ణు, శివకల్పములు గలవుగాని యమకల్పము మాత్రము లేదు. నేనే శాశ్వతుడను. నీవు శివభక్తుడవు గనుకనే నీకు దర్శనమిచ్చి యింతకాలము మాట్లాడితిని. నీ ఆయువు పూర్తి అయి నప్పుడు నిన్ను యెవరు రక్షింపగలరు అని చెప్పి యమపాశమును బిగ బట్టి లాగెను. అప్పుడు యమపాశము మార్కండేయుని శరీరమంతయు చుట్టుకొని బాధింప సాగెను. మార్కండేయుడు అట్లు బాధించుచున్న యమపాశమును లెక్కచేయక, హరహరా, మహాదేవ శంభో శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరా! రక్షమాం, రక్షమాం, పార్వతీ పరమేశ్వరా! ఓం హరహరా! మహాదేవ శంభో అని బిగ్గరగా పలుకుచు శివలింగమును కౌగిలించుకుని ఈశ్వరుని ప్రార్థించుచుండెను.

అప్పుడు యముడు, యమపాశమును లింగమునకున్ను, మార్కండేయునకున్ను, చుట్టబెట్టి గట్టిగా బిగలాగెను. ఆ ప్రకారము యముడు పాశమును బిగబట్టి లాగగానే శివలింగమునుండి ఫెళఫెళమని ధ్వని బయలుదేరి బ్రహ్మాండము పగులునంత శబ్దము గలిగి దశదిక్కులు కన్నులు మిరుమిట్లు గొలుగునట్లు ప్రకాశముగలిగి గజచర్మాంబర ధరుండును, త్రిశూల, శంఖ, ఢమరుక, గదాధరుండును, నానాయుధ మహిత మహోత్తుంగ మేరుపర్వత సన్నిభ మహాప్రభావుండై పార్వతీ సమేతముగా లింగమునుండి ఆవిర్భవించి భక్తవత్సల పరాయణుడైన శంకరుడు సదా! అభయ హస్తంబుల మార్కండేయుని బట్టుకుని రక్షించితిని, రక్షించితిని అని చెప్పి యమునివైపు జూచి ఓ యముడా! నీవు అధర్మమును జేసితివి. నీవు నన్ను పాశమున బిగబట్టితివి. అని చెప్పి కోపమును అపుకొనలేక బ్రహ్మాండము బద్దలగునట్టుల హుంకారమును జేసి యముని కాలితో ఒక్కతన్ను తన్నెను. యముడు

ఆ తన్నును అపుకొనలేక, మహిషము సహితముగా క్రిందబడి మూర్ఛ పోయెను. యమపాశము పట్టు వదలిపోయెను. యముని పరివారము పటాపంచలై పలుదిక్కులకు పారిపోయిరి.

శ్రీ శుకులు పరీక్షితా! వింటివిగదా ఈశ్వరుడు తన మహా భక్తుడైన మార్కండేయుని ఎటుల కాపాడెనో అనిజెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందలి మాఘమహాత్యమున,
మార్కండేయ యమసంవాదము
పదునేడవ అధ్యాయము

# పదునెనిమిదవ అధ్యాయము
## ఈశ్వరుడు మార్కండేయునకు వరంబుల నిచ్చుట

పరీక్షితు ఓ శుకమహాఋషీ! అట్లు ప్రత్యక్షమయిన పార్వతీ పరమేశ్వరులు మార్కండేయునికి యిచ్చిన వరాములను గురించి బాగుగా వినిపించవలశినదని కోరెను.

శ్రీ శుకులు జెప్పచున్నాను. ఓ పరీక్షితా! ఈశ్వరుడు యముని కాలితో తన్నెను గదా? ఆ తన్ను వలన గలిగిన శబ్దమునకు బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది దేవతలు భయపడి ఈశ్వరుని సన్నిధికివచ్చి స్తోత్రము లను జేయుచు నిలుచబడిరి. మార్కండేయుడు ఆ శబ్దమునకు నిశ్చల ధ్యానముచెడి కన్నులు తెరచి, చూచి తన ఎదట లింగ మధ్యమందు వున్న పార్వతీ పరమేశ్వరులను పరివేష్టించి యున్న బ్రహ్మాదులను, క్రిందపడి మూర్ఛజెందియున్న యముని ఆకారమును జూచి భయ పడి జేతులు జోడించి పార్వతీ పరమేశ్వరులను ఈ విధముగా ప్రార్థిం చెను. ఓ పార్వతీ పరమేశ్వరులారా! ఓ మృత్యుంజయా! మృత్యువు నకు మృత్యువునైన శంకరా! రక్షింపుము, రక్షింపుము.

భూమండలము రథముగాను, మేరుపర్వతము విల్లుగాను ఆది శేషుడు అల్లెత్రాడుగాను, వేదములు గుఱ్ఱములుగాను, బ్రహ్మ సారథి గాను, సూర్యచంద్రులు రథ చక్రములుగాను శ్రీమహావిష్ణువునారాయ ణాస్త్రము గాను సంధించి త్రిలోక కంటకులైన త్రిపురాసురులను రాక్షసులను, సంహరించిన, నీకు యీ యముని శిక్షించి నీ భక్తుడ నైన నన్ను రక్షించుట ఒక లెఖ్కలోనిది కాదు. నన్ను యముని భయమునుండి రక్షించితివి. మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము అను అయిదు దేవతావృక్షములు ఎల్ల ప్పుడు నిన్నే ఆశ్రయించి యుండును. అటువంటి వాడవు భక్తులను కాపాడుట ఒక లెఖ్కలోనిది కాదు. లోకమునందు స్త్రీపురుషాదు లకు విరహ తాపమును బుట్టించి అన్యోన్య ప్రేమను బుట్టించు మన్మ థుని శరీరము లేనివానినిగా జేసిన నీకు భక్తులను కాపాడుట ఒక లెక్కలోనిద కాదు. లోకములను బాధించుచున్న గజాసురుని జంపి వాని చర్మమును వస్త్రముగాను, ఉత్తరీయముగాను ధరించిన నీకు భక్తులను రక్షించుట లెక్కలోనిదికాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, రూపంబులచే, సృష్టి, స్థితి, లయకారకుడవైన నిన్ను శరణు పొందితిని. పరదేవతా సమేతుడవైన పరబ్రహ్మ స్వరూపుడవు నీవేగాని వేరు లేదు. అట్టి శివుని, పరమేశ్వరుని, పరబ్రహ్మ స్వరూపుని, జ్ఞాన వీర్యాది గుణములచేతను, రుద్రాక్ష మాలలచేతను, పాములనెడి భూషణముల చేతను, అలంకరింపబడిన వాడవైన నిన్ను శరణు పొందితిని. మనో వ్యాకులాది సకల రోగములను, పోగొట్టునట్టి శ్రీ సోమలింగేశ్వరుడ వైన నిన్ను శరణు పొందితిని. త్రినేత్రుండవున్ను, సకల సుఖంబులను యిహపరంబులను నిచ్చునట్టి నిన్ను శరణు పొందితిని, నీలకంఠా! మృత్యుంజయా, రుద్రగణాధిపా, వేదాదులేనిన్ను అనేక వేల ముఖము లతో స్తుతించుచుందురు. అటువంటి నిన్ను ఏమని స్తుతించగలను గొప్పదేవుడవున్ను, ఎడమభాగమందు పార్వతీదేవిని ధరించిన వాడ

వున్ను, అయిన సదాశివా! ప్రళయాంత పర్యంతము బ్రతికియుండు నట్లున్ను, బ్రతికినవాళ్లు జరా, ముదిములు నాకు లేకుండు నట్లును వరంబులను దయ చేయు వలసినదని పార్వతీ పరమేశ్వరుల పాదంబులపై బడి ప్రార్థింప దొడగెను.

అటుల ప్రార్థించుచున్న మార్కండేయుని లేవనెత్తి ఓ మార్కండేయా! నీచే చెప్పబడిన యీ స్తోత్రము నెవరు పఠించెదరో వారు అపమృత్యు భయమును పొందరు. నీవు ఒక్క కల్పాంతము వరకే ఆయువు కోరితివి. నీవు బ్రహ్మకున్ను, సప్తమహాఋషులకున్ను నమస్కరించి నప్పుడు ఏడు కల్పాంతరముల వరకు ఆయువు యిచ్చి వున్నారు. నేనున్ను నీకు ఏడు కల్పాంతరముల వరకు ఆయువు యిచ్చి వున్నాను. నా భక్తి వలన నీకు కావలసిన కోరికలన్నియు నెరవేరును.

అని చెప్పి బ్రహ్మాదులతో కూడా అంతర్థాన మాయెను. అంతట మార్కండేయుడు ఈశ్వరుని వలన వరంబులను బడసి తల్లిదండ్రులను జూచుటకు గాను ఆశ్రమమునకు వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి, శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరుని వలన ఏడు కల్పాంతరముల వరకు జీవించి యుండుటకున్ను, జరా, మరణంబులు లేకుండు నట్లున్ను వరంబులను పొందివచ్చి యున్నానని చెప్పెను.

తల్లి దండ్రులున్ను, బంధువర్గమున్ను ఆ మాటలను విని చాలా సంతోషించి కుమారుని కౌగలించుకొని, కుమారా! నీవు మాకు కడుపుశోకము లేకుండునట్లున్ను, కుమారుడు అల్పాయువు గలవాడు గదా యని విచారము లేకుండునట్లును శ్రీ పార్వతీ పరమేశ్వరుల దయవలన వరంబులను పొందియున్నావని సంతోషించి సుఖంగా నుండిరి.

ఈ విధముగా మహామునియైన మార్కండేయుడు ఈశ్వరునివలన వరములను పొంది తల్లిదండ్రుల పాదసేవ జేయుచు సుఖంబుగా నుండిరి. మాఘమాసము రాగా తల్లిదండ్రుల అనుమతిని పొంది తీర్థ

యాత్రలు జేయుచు, భూమియందుగల మహా క్షేత్రములకు వెళ్లుచు ఒక్కొక్క మహాక్షేత్రమునందు ఒక్కొక్క సంవత్సరము మాఘ మాస స్నాన వ్రతములను జేయుచుండెను. ఈ ప్రకారముగా లోక మందు గల మహా క్షేత్రములలో మాఘమాస వ్రతములను జేసెను.

ఓ పరీక్షితా! మార్కండేయుడు మాఘమాస వ్రతమును జేయని పుణ్యనది యొక్కటియు భూమియందు లేనేలేదు. మాఘమాస స్నానాదులయందు గల ఆసక్తి మృగశృంగునికిన్ని సుశీలా మొద లగు భార్యలకున్ను యుండుటచేతనే గదా వారికి మృకండుడు మృకండునికి మార్కండేయుడు పుట్టి తమ వంశమునకు సిరి, సంపత్తు లను, మహాకీర్తిన్ని కలుగజేసెను. ఎవరుగాని మాఘమాస వ్రత స్నానాదులను జేయుదురో వారు ఈ లోకమునందు అష్టైశ్వర్యము లున్ను కీర్తిన్ని ఆయుస్సున్ను అనుభవించి స్వర్గసుఖమును పొందుదురు. దీనికి యేవిధమైన సంశయమును లేదు. అందుకు యీ మృకండుని వృత్తాంతమే సాక్షియని చెప్పెను. ఈ మార్కండేయుని వృత్తాంతము చదివినను, విన్నను, అపమృత్యువులుగాని, దరిద్రములుగాని, విచార ములుగాని, రోగములుగాని లేక సకల సుఖంబులను పొందుదురు.

అని ఈ విధముగా శ్రీశుకులు జెప్పగానే పరీక్షిత్తు మహారాజు ఋషిపుంగవా! ఈశ్వరుడు యముని తన్నగానే యముడు మూర్ఛ పోయెను. గదా! తరువాత జరిగిన వృత్తాంతములు వినిపించవలసినదని ప్రార్థించెను.

శుకమహాఋషి జెప్పుచున్నాడు. పరీక్షితా! శ్రద్ధగా వినుము. పార్వతీ పరమేశ్వరులు శ్రీమార్కండేయునకు యేడు కల్పాంతరముల వరకు ఆయుర్దాయము నిచ్చి బ్రహ్మాదులు జేయు స్తుతి వాక్యములు విని ప్రసన్నులై సంతోషముతో నుండగా బ్రహ్మ యిట్లని జెప్పెను.

ఓ పార్వతీ పరమేశ్వరులారా! యముడు మూర్ఛను పొందియున్న కాలమందు భూమిమీద ప్రజలు వృద్ధి పొందియుండిరి. అందువలన

భూమి భారమును మోయలేక బాధపడుచున్నది. కాబట్టి భూభారమును తగ్గించుటకు యముని కటాక్షించి మేలుకొల్ప వలసినదని మనవి జేసిరి. ఆ మాటలను పరమేశ్వరుడు విని వరదా! అభయహస్తములను యముని శిరస్సున నుంచగా నిద్రనుండి లేచిన విధముగా లేచి పార్వతీ పరమేశ్వరులను బ్రహ్మాది దేవతలను జూచి నమస్కరించి పరమేశ్వరుని స్తోత్రము చేసెను.

పార్వతీ పరమేశ్వరులు సంతోషించి ఓ యమధర్మరాజా! నీవు యీరోజు మొదలు నా భక్తులను నన్ను పూజించువారిని నన్ను ధ్యానించువారిని మాఘమాస వ్రతస్నాన దానములను జేయు వారని హరిహరాదులు నివశించు ఆలయంబునకు వెళ్ళుచుండు వారిని ఈ మాఘమాసమందు రథసప్తమి, శుద్ధ ఏకాదశి, పూర్ణిమ, బహుళ చతుర్దశి, మహాశివరాత్రియను ఈ నాల్గు దినసంబులందు నియమ వ్రతము జేయు వారిని నన్నుగా భావించుచుండుము. నా వ్రతాదులు గాని, నన్నుగాని పూజించని వారిని మాఘమాస వ్రతాదులు జేయని వారిని, దేవతానిందా పరులను నిందించుట బ్రాహ్మణులను నిందించుట, నేను గొప్పవాడనని జెప్పుకొనెడు వారిని వ్రత స్నానాదులను జేయువారిని జూచి హేళనము జేయు వారిని క్రూరులుగా జూడుము. ఈ రోజు మాఘశుద్ధ సప్తమి, రథసప్తమి, యందురు. దీనినే సూర్య జయంతి యనియు, వైవస్వత మన్వంతరమనియు పిలచెదరు. ఈదిన మందు నీ తండ్రియైన సూర్యుని ఆరాధించిన వారికి యేడు జన్మము లందు చేయు మహా పాపములు నశించి సకల వ్యాధులు నశించి పుణ్యాత్ములగుదురు. గాన యిటువంటి వారిని ఈ దినమందు నిన్నును (యముని) సూర్యుని హరిహరాదులను పూజించువారు పుణ్యాత్ములగుదురు. యిటువంటి వారిని నీవు యన్నమును క్రూరముగా జూడవలదని జెప్పి యముని దీవించి పంపించి వేసెను.

పార్వతీ పరమేశ్వరులు వృషభ వాహనమునెక్కి బ్రహ్మాదులు పరివేష్టించి రాగా యెవరి తావులకు వారు జనిరి. ఓ పరీక్షితా! వింటివి గదా రథసప్తమీ మహాత్మ్యమున్ను, మాఘమాస వ్రత మహాత్మ్యమున్ను మాఘమాస వ్రతాదులంటు యింత మహాత్మ్యము గలదు. ఈ మాఘమాస వ్రతమును జేసిన వారు పొందనేరని కార్యములు గాని శుభములుగాని మోక్షములుగాని లేవు గాన ప్రతీ మనుజుడు యీ మాఘమాస వ్రతమును చేయవలెను. అని శ్రీశుకులు పరీక్షిత్తు మహారాజుతో జెప్పెను.

స్కాంధ పద్మ పురాణములందు గల మాఘ
పురాణమను వచనకావ్యమున ఈశ్వరుడు
మార్కండేయునకు వరంబుల నిచ్చు
పదునెనిమిదవ అధ్యాయము.

# పందొమ్మిదవ అధ్యాయము

## మాఘస్నాన వ్రత దానములను జేయుటకు ముఖ్యములైన తీర్థముల మహిమ తెలుపుట

పరీక్షిత్తు మహారాజు శుక మహాఋషిని చూచి ఓ మహాత్మా! ఈ మాఘమాస వ్రత దానాదులను చేయుటకున్ను వెంటనే ఫలితములను నిచ్చునట్టివిన్ని ముఖ్యములయిన క్షేత్రములయొక్క తీర్థమహిమలను ఆనతిమ్మని కోరెను. ఆ వాక్యములను శ్రీశుకులు విని ఆనందించి ఓ పరీక్షితా! నీవు గొప్పవి గల రహస్యములను కోరితివి. వాటిని గూర్చి జెప్పెదను శ్రద్ధగా ఆలకింపుము.

శ్రేష్టములైన పుణ్య తీర్థములయొక్క చరిత్రలను వినుటచేతనే జంతువులు పాప సమూహమనెడి కవచమునుండి విడువబడుచుండెడి

తీర్థమహిమలను జెప్పుచున్నాను. మాఘమాసము రాగానే ఎచ్చట నైనను సరే స్నానము జేయుట ముఖ్యము. అటుల స్నానము చేయుటకు నదీ స్నానము ముఖ్యము. నదులు లేని ప్రదేశమునందు చెరువులు గాని నూతులుగాని లభ్యమయిన వాటియందైనను స్నానము చేయవలెను. మాఘమాసము రాగానే, నదులు, చెరువులు, నూతులు, మొదలగు వాటియందు గల జలము గంగా గోదావరి నదుల జలముతో సమానమగు నని మహా ఋషులు జెప్పుచున్నారు. అయినను మాఘమాసమందు స్నానము చేయుటకు ముఖ్యములయిన కొన్ని తీర్థములను జెప్పుచున్నాను. నదులని, నదములని రెండు విధములు గలవు. నదులు అనగా పడమటనుండి తూర్పు ముఖముగా ప్రవహించు నదులకు నదులను పిలువబడును. తూర్పునుండి పడమట ముఖముగా ప్రవహించు నదులకు నదములని పిలువబడును.

౧. పుణ్యక్షేత్రములలో శ్రేష్ఠములైనవి ప్రయాగ ఒకటి. యీ ప్రయాగయందు స్నానము జేయువారు సకల విధములయిన పాపములను పోగొట్టుకుని పుణ్యాత్ములగుదురు. దేవతలచేతను, యక్షులచేతను, కిన్నరులచేతను, సేవింపబడుచుండునని శాస్త్రములందును, పురాణాదులందును చెప్పబడి యున్నది.

౨. నైమికారణ్యము. శౌనకాదులయిన మహా ఋషులకు సత్రయాగాదులు చేయుటకు ప్రీతిగలిగియున్నట్టిన్ని రాజర్షియైన నిమిచక్రవర్తికి మహానందమును గలుగ జేయునట్టి మహాక్షేత్రము.

౩. శమంత పంచకము. దేవతలకు సహితము సంతోషమును కలుగచేయుచు తనయందు స్నానమును జేసిన వారికి సంసారబంధమగు దుఃఖములను పోగొట్టి ఆనందమును గలుగచేయును.

౪. కురుక్షేత్రము భీష్ముడు, ద్రోణుడు మొదలగు వారున్ను కౌరవ వంశీయులగు దుర్యోధనాదులున్ను యుద్ధము చేసి మోక్షమును

పొందియున్నారు. అందు స్నానమును చేసిన మానవులు పుణ్యాత్ము లయి సకల సుఖములు అనుభవించి మోక్షమును పొందుచున్నారు.

ఈ కురుక్షేత్రమందు మూడుకోట్ల యేబదిలక్షల తీర్థములు గలవని శ్రీకృష్ణుడు జెప్పియున్నాడు. దీనిని భూలోక స్వర్గమని చెప్పుదురు.

౫. గంగానది, కాశీక్షేత్రము. స్వర్గము పొందుటకున్ను సంతానాదులు గలుగుటకున్ను, సకల పాపంబులు పోగొట్టి అష్టైశ్వర్యములు గలుగచేయును.

౬. అవంతి యను పుణ్యక్షేత్రము. యిచ్చట మాఘస్నానము చేసిన వార్కి సకల పాపములను పోగొట్టి ఈశ్వరుడు మోక్షమును యిచ్చును.

౭. అయోధ్య సూర్యవంశపు రాజులకు ముఖ్య పట్టణమున్ను. కీర్తిన్ని, సకల సౌఖ్యంబులు నిచ్చునట్టి క్షేత్రమున్ను. శ్రీ మహావిష్ణువు శ్రీరాముడై పుట్టి లక్ష్మణుడు మొదలగు తమ్ములతోడను సకల ప్రజలను ధర్మము తప్పకుండునట్లు పదునొకండువేల సంవత్సరములు రాజ్యమును పాలించినట్టిన్ని సకల జీవులకు స్వర్గసుఖములను కలుగచేయుగల సరయూనది గల అయోధ్య. యీ సరయూనదియందు స్నానాదులను చేసి ముక్తి పొందుదురు

అట్టి సరయూనదిలో స్నానాదులను చేసి, దేవ, పితృ, తర్పణాదులను చేసిన యెడల వారి పితృదేవతలు యిరువదిరెండు తరముల వారు స్వర్గసుఖమును పొందుదురు. ఒక్క మాఘమాసము అయోధ్యలో కాపురముండి స్నానాదులు చేయువారు యీ లోకమునందు సకల భోగములు ననుభవించి పుత్ర పౌత్రాభివృద్ధి గలిగి అంతమందు విమానము నెక్కి స్వర్గమున నివశించుదురు.

౮. మధువనము. ఈ నదియందు స్నానాదులు మాఘమాసము నందు జేసినవారు విష్ణుస్వరూపమును పొందుదురు.

౯. యమునానది. ఈ నది సూర్యుని వలన పుట్టినది. నల్లని నీటితో ప్రవహించుచుండును. శ్రీకృష్ణునకు మిక్కిలి ఆనందమును కలిగించునదమై యున్నది. యీ యమునానదిలో స్నానమును చేసిన వారు తప్పక వైకుంఠవాసులగుదురు.

౧౦. ద్వారకా పట్టణము. ఈ పట్టణము మూడులోకములందును ప్రసిద్ధి పొందియున్నది. ఆ పట్టణమందు శ్రీ మహావిష్ణువు శ్రీకృష్ణుడను పేరుతో నివశించుచు పాండవులను కాపాడుచు భారత యుద్ధమందు భూభారమును తగ్గించుటకు నూరుకోట్ల దుష్టరాజులను స్వర్గమును పొందించి తాను పరమపదమును పొందెను. అటువంటి ద్వారకా నగరమునకు వెళ్ళి మకర మాఘమాసమందు స్నానాదులను చేసి దేవ పితృ తర్పణములు చేసిన యెడల స్వర్గసుఖంబులను పొందుదురు.

౧౧. మాధవావతి. అందు మలప్రహారిణి యను నది గలదు. ఆ నదియందు స్నాన దానాదులు జేసిన సకల పాపంబులు పోగొట్టునది గాన దానికి మలప్రహారిణీ నది యని పేరు గలిగినది. దీనియందు మాఘ మాసమునందు క్షేత్రోపవాసము జేసి మాఘమాస వ్రతమును చేసినవారు స్వర్గసుఖములను ఇహపరసౌఖ్యంబులు పొందుదురు.

౧౨. సరస్వతీనది. యిందు మాఘమాస వ్రత స్నానాదులను జేసినవారు సరస్వతీ అనుగ్రహము గలిగి సకల సుఖంబులను పొందుదురు.

౧౩. కాశీ, గంగానది. ఇందు మాఘ స్నానాదులను చేసి, నువ్వులు, నల్లగోవును దానము చేసిన పితృదేవతలు సంతోషించి సంతానమును సకల సుఖములను యిచ్చుదురు.

౧౪. కాంచీ ఈ పట్టణమందు శ్రీమహావిష్ణువు లక్ష్మీ సహితముగా నివశించి యుండును దీనిని భూలోకమునందు సత్యవ్రత క్షేత్రమని పిలచెదరు. యీ క్షేత్రమునందు స్నాన దాన వ్రతాదులు చేసిన

వారు కోటికోట్ల ఫలితమును పొందుదురు. గనుకనే యిచ్చటి దేవాలయమునకు పుణ్యకోటి యని పిలచెదరు.

౧౭. త్రయంబకము అను పుణ్యక్షేత్రము. ఇది గోదావరి నదికి పుట్టిన క్షేత్రిద్వారము యిచ్చట స్నానదాన వ్రతాదులను జేయు వారు మోక్షమును పొందుదురు.

ఈ క్షేత్రము మూడు లోకములను మోక్షమును పొందించు మహాత్మ్యమును గలిగియున్నది.

౧౮. గోదావరనది. దీనికే గౌతమీనది యని పిలచెదరు. ఈ గోదావరినది యొక్క ఉత్తరగట్టున గౌతమ మహాముని తన భార్య యగు అహల్యతోడ వాసము చేయుచుండెను. దీనిని గౌతమ సిద్ధాశ్రమమని పిలచెదరు. దీనినే సిద్ధి జనార్ధనక్షేత్రమనిన్ని శ్రీ సోమలింగేశ్వర క్షేత్రమనిన్ని మాతృఘువాపహారీ క్షేత్రమనిన్ని శ్రీ గోకర్ణ క్షేత్రమనిన్ని పిలచెదరు. గౌతమ ఆశ్రమమందు శుక్రుడు మర్రి కొమ్మకు కాళ్లు తగిలించి తల క్రిందుగా వ్రేలాడుచు క్రింద అగ్నిహోత్రము ప్రజ్వరిల్లుచుండగా అగ్నికిరణములు ఆహారముగా చేసుకుని యుగ్ర తపంబు చేసి ఈశ్వరుని మెప్పించి మృత సంజీవిని విద్యను పొందెను. ఈ క్షేత్రమునందే మార్కండేయుడు తపంబుచేసి యేడు కల్పాంతరములు పర్యంతము ఆయువును పొంది చిరంజీవియై కీర్తి పొందెను. యీ క్షేత్రమునందు మాఘమాస వ్రత స్నాన దానాదులు జేసిన వారు ఏడు జన్మంబులలో జేసిన పాపంబులను పోగొట్టుకొని పుణ్యాత్ములగుదురు.

౧౯. ద్రక్షవాటిక. దీనినే ద్రాక్షారామమని పిలచెదరు. ఇచ్చట దక్షప్రజాపతి యజ్ఞముజేసిన తావు. యిచ్చట సప్తగోదావరి అను తటాకము గలదు. అందు స్నానము జేసి శ్రీమాణిక్యాంబ భీమేశ్వరులను దర్శించి ఒక్క పగలు ఒక్క రాత్రి నివసించిన యిహపరంబుల నిచ్చును.

౧౮. మురమళ్ళ. ఇచ్చట కళ్యాణ వీరభద్రుడను పేరుతో వీర భద్రస్వామి భద్రకాళీ సహితముగా నివశించి యున్నతావు. యిచ్చట గోదావరీ నదిలో స్నానదానాలు జేయువారు యిహపర సుఖంబులను పొందుదురు.

ఇచ్చట పూర్వము కాలాత్మకమను కొండగలదు. ఆ కొండ యందుండి అమృతము తరచునప్పుడు పుట్టిన కాల కూట విషమును ఈశ్వరుడు కంఠమందు నిలపెను అందువలన నీలకంఠుడను ఖ్యాతి యీ క్షేత్రమునందు పొందెను.

౧౯. పాద గయాక్షేత్రము. దీనినే యేలానదీ క్షేత్రమనిన్ని పిఠాపురమని పిలచెదరు. యిచ్చట ఈశ్వరుడు స్వయముగా కుక్కుట లింగరూపమున వెలసియున్నతావు. యిచ్చట స్నానదానాదులు జేయువారు ముక్తి పొందుదురు.

౨౦. పంపానది. కాలాత్మకమను కొండకు ఉత్తర భాగమందు పంపయను పేరుగల నదిగలదు. ఆ నదికి దక్షిణ భాగమునందు పంప రాను పేరుగల పట్టణము గలదు. ఆ పట్టణమందు గాని, కొండ యందుగాని నివశించి మాఘమాసమునందు సూర్యోదయ కాలము నందు పంపా నదిలో స్నానదానాదులను జేయువారు యోగులకు కూడా పొందరాని శివసామ్రాజ్యమును పొందుదురు. దీనినే అన్నవర క్షేత్రమని యందురు.

౨౧. ప్రభాసము. ఆ పంపానదికి కొంత దూరమందు ప్రభాస మను క్షేత్రముగలదు. అచ్చట లోకములకు మేలు జేయుగోరి ఈశ్వ రుడు లింగరూపమున ఆవిర్భవించెను. ఓ రాజా! విషయమునందు బ్రహ్మహత్యాది మహా పాపములను పోగొట్టు యితిహాసము గలదు. దానిని జెప్పెదను. పూర్వకాలమునందు స్థావర, జంగమాదులు పంచభూతములు నామ రూపములులేక ఇది సత్తు, ఇది అసత్తు అని తెలియక సత్తుమాత్రము నిలిచియుండెను. అట్టియెడ ఇచ్ఛాశక్తి

పుట్టెను. అంతట దిక్కులెల్లను యేమియులేనివై కనబడెను. పిమ్మట సృష్టికి మూలకారణమైన అహంకారము పుట్టెను. అలాగుననే విష్ణుని యందు బ్రహ్మ రుద్రులు యిద్దరును అయిదు తలలు గలవారై పుట్టిరి.

అప్పుడు రుద్రుడు బ్రహ్మను జూచెను. బ్రహ్మ రుద్రుని జూచెను. రుద్రుడు బ్రహ్మనుజూచి లోకములో అయిదు తలలు గల వాడను నేనొక్కడనే నీ వెవడవని అడిగెను. ఇట్లు యిద్దరును పరస్పరము నేను గొప్పవాడను నేను గొప్పవాడను అని వాదోపవాదములను జేసి తుదకు యుద్ధము జేయుటకు ప్రారంభము జేసిరి. యిట్లు యుద్ధము జేయుచుండగా దేవమానముచేత నూరు సంవత్సరములు బ్రహ్మయున్ను రుద్రుడున్ను యుద్ధమును జేసిరి. చాలా కాలముయుద్ధమును జేసి యుండుటచేత రుద్రునకు కోపము హెచ్చినవాడై బ్రహ్మ యొక్క నడిమి తలను దన ఎడమచేతి చిటికినవ్రేలి గోటిచేత నరికి వేసెను.

అంతట బ్రహ్మ తన తలను శివుడు నరికివేయుటచేత సిగ్గుపడి మూచుచుండెను. అది మొదలు బ్రహ్మ చతుర్ముఖుడని ప్రఖ్యాతి హొందియుండెను.

తర్వాతి చరిత్రను జెప్పెదను. శివుడు బ్రహ్మ తలను నరుకుట చేత బ్రహ్మహత్యా దోషముకలిగి ~~బ్రహ్మ తల~~ శివుడు పుర్రెను చేతబట్టుకొని లోకములందు కపాలభిక్ష జేసుకొనుచు తిరుగుచుండెను. యిట్లు కపాలభిక్ష జేసుకొనుచు తిరుగుచుండగా ఒకానొకప్పుడు దారుకావనమునకు పోయి మహాఋషుల గృహములందు భిక్షలకు జనెను. అప్పుడు రుచి అను ముని భార్య త్రిలోకములను మోహింపజేయగల సౌందర్యముతో మంచి ఆకృతితోను లావణ్యా నిధమైన వక్రకోలయును స్త్రీ శివుని జూచి మోహించెను, పిమ్మట ఋషిభార్యలందరును శివుని జూచి మోహించి గృహకృత్యములను వదలి మన్మథ బాణ వేదనమునకు తాళలేక శివుని వెంబడించిపోవసాగిరి. యిట్లు మునిభార్యలు మన్మథ

బాధలకు సహింపలేక శివుని వెంట పోవుచున్నదు జారిన కొప్పులతోను, పీడినచీరలతోను, రాలిన వస్త్రములతోను, చెదరి పడిపోవు పువ్వు దండలతోను ఒళ్ళు తెలియక పరవశులై పోవుచుండిరి. అటుల పరవశులై పోవుచున్న తమభార్యలను ఋషులు జూచి శివునియందు ఆగ్రహము గలిగి, కోపావేశమున ఓ శివా! నీ యొక్క పురుష చిహ్నము అండ ముల సహితముగా తెగి నేల బడిపోవుగాక యని శపించిరి.

ఈ ప్రకారము ఋషులు శపించగానే శివుని పురుష చిహ్నము అండములు సహితముగా తెగి నేల బడిపోయి పాతాళలోకము వరకు పాతుకొని పోయి భూమట్టమునకు పది అంగుళములు పొడవుగలదై యుండెను. ఈశ్వరుడు లీల మాత్రముచేతనే అనేకకోట్ల లోకములను సృజించగలిగియు కోపాగ్నిచేత త్రిపురములను గాల్చిన వాడును నైన శివుడు బ్రాహ్మణులు తన్ను శపించినను కోపము జెందక బ్రాహ్మణు లకు మేలు జేయగోరి తాను ఆ లింగమునందు ఐక్యమయ్యెను. అట్లు శివుడు ఆవేశించిన లింగము పాతాళమునందును దశ దిక్కులందును, పదునాల్గు లోకములందును వ్యాపించిన మహా తేజస్సుగలదై యుం డెను. ఆ తేజస్సునకు స్థావరములచేతను జంగములచేతను నిండియున్న లోకమంతయు పరితపింప సాగెను. అప్పుడు విష్ణువు, బ్రహ్మ గణాధి పతి దేవతలు, దేవతాఋషులు రోమసుడు మొదలగు మహామునులు భూలోకమునందును పదునాల్గు లోకములందును గల మునీశ్వరులు యోగీశ్వరులు మొదలగు వారు ఆ ప్రకాశమానమైన లింగము వద్దకు వచ్చి పూజలచేతను, తపములచేతను, స్తోత్రములచేతను, ధ్యానము చేతను వేడుకొనగా ఈశ్వరుడు సంతోషించి ప్రత్యక్షమై ఓ **దేవత లారా!** నేడు మొదలు భూలోకమునందు నా రూపము లింగరూప మునయుండును. నన్ను పూజించు మానవులకు సకల కోరికలను సకల పురుషార్థములను యిచ్చుచుందును. ఓ బ్రహ్మా! నీవు లోకములకు మేలు జేయు కొరకు వేదములందు చెప్పబడిన యజ్ఞ యాగాదుల

చేతను, దాన ధర్మములచేతను, తపంబులచేతను, వ్రతములచేతను వైదిక కర్మలు సరిగా జరుగునటుల నన్ను పూజింపు చుందుము. ఓ విష్ణూ! నీవు నన్ను రాజుల యభివృద్ధి కొరకును, ధర్మపరిపాలన కొరకును, సకల కోరికలు నెరవేరుట కొరకును, నన్ను పూజింపు చుందుము. ఓ విష్ణూ! నీవు వశిష్టుడు, వామదేవుడు, మార్కండేయుడు, భృగువు, శుకుడు మొదలగు ఋషులను శిష్యులుగా జేసుకొనుము. ఓ బ్రహ్మ! నీవు, అగస్త్యుడు, గౌతముడు, దధీచి, భృగువు, అఘోరుడు, వామదేవుడు, దక్షుడు, అత్రి, కశ్యపుడు మొదలగు ఋషులను శిష్యులుగా జేసుకొనుము.

అని చెప్పి బ్రహ్మాదులకు అనేక వరంబులునిచ్చి ఈశ్వరుడు ఆ లింగమునందే ఐక్యమయ్యెను ఓ పరీక్షితా? నాటినుండియు ఈశ్వరుడు లింగరూపముననుండి తనను ఆరాధించిన వారికి సకల కోరికలను నొసంగుచుండెను. ఇది ఈశ్వరుడు లింగరూపమును ధరించి పూజింపబడుచున్న కథ. పిమ్మట తీర్థమహిమలను జెప్పెదను

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘపురాణమను వచన
కావ్యమున మాఘమాస స్నానాదులను జేయుటకు
ముఖ్యములైన తీర్థములను తెలియుజేయు
పందొమ్మిదవ అధ్యాయము

# ఇరువదవ అధ్యాయము

## మాఘస్నానాదులు జేయుటకు ముఖ్యములైన తీర్థములు

శ్రీ శుకులు జెప్పుచున్నారు. ఓ పరీక్షితా! యిదివరలో మాఘ స్నానాదులకు ముఖ్యములైన క్షేత్రములను కొన్నిటిని జెప్పియున్నాను. మిగిలిన వాటిని జెప్పుచున్నాను వినుము.

౨౨. ఓఘవతి యను నదిగట్టున నారాయణ క్షేత్రము గలదు. ఇచ్చట ప్రణవ స్వరూపుడును షడ్గుణైశ్వర్య సంపన్నుడును అయిన శ్రీ మహావిష్ణువు పూర్వము బ్రహ్మ సృష్టి జేయుటకు ఏమియు తోచక భ్రమజెందియున్న సమయమందు బ్రహ్మకు అమృత స్వరూపమున్ను, పరబ్రహ్మ స్వరూపమున్ను లోకములను సృష్టించుటకు ఆధారమున్ను అయిన ఓంకారమును ఉపదేశించెను. అటువంటి ఆ యోగవతీ నది యందు స్నానాదులను జేసి అచ్చట ఆవిర్భవించియున్న ఓంకార స్వామిని పూజించి, తీర్థ శ్రాద్ధముల చేతను దేవ పితృ తర్పణములను జేయుటచేతను విష్ణులోకమున సుఖించెదరు.

౨౩. గోకర్ణము అను గొప్ప క్షేత్రముగలదు. ఈ గోకర్ణ క్షేత్రము నందు మాఘమాసమున స్నానదానములను జేసిన యెడల కామ ధేనువు వంటి ఆ క్షేత్రమహిమచేత సకలకోరికలు నెరవేరును. పుణ్య లోకములు గలుగును. ప్రతిదినము స్నానకాలమున గోకర్ణము అని చెప్పి జపించినను స్నానఫలితము గలుగును. సందేహములేదు.

౨౪. పురుషోత్తమము. ఈ పుణ్యక్షేత్రము గోదావరీనది ప్రవ హించు తావుననున్నది. యిందు స్నానాదులను జేసిన వారికి విష్ణు లోకము కల్గును.

౨౫. భృగుకచ్ఛపము. ఇది గొప్ప క్షేత్రము. యిందు స్నాన దానాదులను జేయువారు విష్ణులోకమును పొందుదురు.

౨౬. భృగుతుందము అను సరస్సు. యిందు స్నానాదులను జేయువారు స్వర్గమును పొందుదురు.

౨౭. పుష్కరము అను క్షేత్రముగలదు. యిందు స్నానాదు లను జేయువారు సకల కోరికలను నెరవేర్చుకుని స్వర్గసుఖమును పొందుదురు.

౨౮. తుంగభద్ర విరూపాక్షయను పుణ్యక్షేత్రము గలదు. యిచ్చట పార్వతీ సమేతుడై ఈశ్వరుడు విరూపాక్ష రూపమున స్వయ

ముగా నెలకొని యుండెను. ఈ దేవుడు వాలి సుగ్రీవుడు హనుమంతుడు మహామునులు మొదలగు వారిచేత పూజింపబడుచుండును.

పూర్వకాలమునందు దేవతలకు రాక్షసులకు యుద్ధము జరిగినప్పుడు దేవతలు రాక్షసులకు ఓడిపోయి శివుని శరణు పొందిరి. అప్పుడు శివుడు రాక్షసులను జంపి దేవతలకు జయముగలుగజేసి స్వస్థముగానుండుడని జెప్పి పంపించివేసి తాను పార్వతీదేవితో గూడ తుంగభద్రానది గట్టుననున్న ఋష్యమూక పర్వతమునందు విహరించుటకు నిలచెను. గాన అచ్చట హరిహరులను అర్చించి స్నాన దాన జప హోమాదులను జేయువారికి తపస్సిద్ధిపొంది స్వర్గలోకమునకు వెళ్లుదురు.

౨౦. కావేరీనది. ఈ నది మధ్యభాగమునందు శ్రీరంగమను గొప్ప విష్ణుస్థానము గలదు. పూర్వము శ్రీమహావిష్ణువు విభీషణుని సంతోషపరచుటకై స్వయముగా వచ్చి నిలచెను. విభీషణుడు ప్రతి సంవత్సరము విశాల నక్షత్రములతో గూడిన వైశాఖశుద్ధ పూర్ణిమనాడు వచ్చి పూజించుచుండును. కలియుగమునందు మాత్రము వైశాఖశుద్ధ పూర్ణిమనాడు విభీషణుడు వాయురూపమున వచ్చి పూజించుచుండును. కావేరీనదికి దక్షిణగంగానది యనియు శ్రీరంగమునకు దక్షిణకాశీయనియు ప్రసిద్ధి గలిగియున్నది. ఓ పరీక్షితా! యీ భూలోకమునందు మూడుకోట్ల యేబది లక్షల మహాక్షేత్రములు గలవు. వాటిని వివరించి చెప్పుటకు చాలా కాలము పట్టును. ఈ జెప్పబడిన క్షేత్రములు శ్రేష్ఠములనియు పుణ్యప్రదములనియు సకల కోరికలను యిచ్చునట్టి వనియు పెద్దలు చెప్పుదురు.

నీకు యిప్పుడు మానస తీర్థమునుగూర్చి చెప్పెదనువినుము. దేనియందు స్నానముజేసిన నరుడు ఉత్తమగతిని పొందునో అట్టి మానస తీర్థమును గూర్చి చెప్పెదను. ౧ సత్యము ౨ ఓర్పు ౩ ఇంద్రియనిగ్రహము ౪ అన్ని ప్రాణులయందు దయగలిగి యుండుట ౫ [illegible]క్రమము

తప్పక నడచుట ౬ దానము ౭ క్లేశము నోర్చుట ౮ సంతోషము ౯ తృప్తి ౧౦ బ్రహ్మచర్యము ౧౧ కోపము లేకుండుట ౧౨ ద్రోహ చింత లేకుండుట ౧౩ కపటము లేకుండుట ౧౪ తపస్సు ౧౫ గురువును పూజించుట ౧౬ శుచిత్వము ౧౭ వైరాగ్యము ౧౮ విషయాశక్తి లేకుండుట ౧౯ సమచిత్తము గలిగియుండుట ౨౦ సకలప్రాణులను తనవలెనే జూచుకొనుట ౨౧ సత్పురుషులతో సహవాసము అనునవి శ్రేష్టములైన తీర్థములు. ఈ తీర్థములయొక్క లక్షణములను జెప్పుచున్నాను వినుము.

౧. ఇంపైనదియు సంతోషమును కలుగ జేయునదియు యేదో అదియే సత్యము. ఆ సత్యమును అన్ని సమయములందును పలుకువారు అన్ని తీర్థములందును స్నానము జేసిన ఫలమును పొందుదురు. ఎన్నడును అసత్యము జెప్పకూడదు.

౨. ఓర్పు. మంచిగంధము నందు ఒక చేయి అగ్నియందు ఒక చేయి యుంచి వేడిమిని చల్లదనమును సమముగా జూచుటే క్షమ అందురు.

3. ఇంద్రియ నిగ్రహము ; యింద్రియములకు విషయములందు ప్రవేశించుట సహజము. అట్టి ప్రవృత్తిని మనస్సు పొందకుండుటయే ఇంద్రియ నిగ్రహము.

౪. దయ ; ఆకలి, సుఖ దుఃఖములందు సమత్వ బుద్ధి గలుగుట దయ అనబడును.

౫. క్రమము తప్పక నడచుట. తన మతమునందు పెద్దలు యేర్పర్చిన విధముగా ధర్మమార్గము తప్పకుండా నడవడిగలిగియుండును.

౬. దానము. తనకు భగవంతుడు యిచ్చిన దానిలో కొద్దో గొప్పో బీదలకు అన్న, వస్త్ర, గృహ, గోవు, భూమి మొదలగు పదిఆరు దానములను జేయుచుండుట.

౭. క్లేశము నోర్చుట. యితరులకు బాధ గలిగినప్పుడు గాని, పరులకు ఉపకారము జేయు నప్పుడుగాని, కలిగెడు బాధను క్లేశమును ఓర్చి యుండుట.

౮. సంతోషము. సుఖ దుఃఖములను ఈతి బాధలను సమముగా చూచి నిత్యము సంతోషముగా నుండుట.

౯. తృప్తి. ప్రపంచక సంబంధమగు ప్రతి విషయమునందును, సంకోశము లేక తనకు లభ్యమగు పదార్థములకు తృప్తి గలిగి యుండుట.

౧౦. బ్రహ్మచర్యము. శ్రవణము, కీర్తనము, ఆటలు, చూచుట, తలచుట, సంతోషము తాను చేయవలసిన పనులను మానుట. స్త్రీలతో సంబంధము కల్పించుకుని మాట్లాడుట మొదలగు దుష్ట పనులను చేయకుండుట.

౧౧. కోపము. ఎటువంటి సమయము నందైనను కోపమును పొందకుండ వలెను.

౧౨. ద్రోహచింత. మనస్సునందు కఠినత్వము గలిగి యుండుట కఠినముగా చూచుట, యితరులకుగాని, జీవులకుగాని, చెరుపు కోరి కుండుట.

౧౩. కపటము. యితరులయందుగాని, జీవులయందు గాని, చెప్పుట జేయుట తలచుట అను మనో వాక్కాయములు ఒక్కటిగా జేసియుండుట. కపట బుద్ధి లేకుండా నుండవలెను.

౧౪. తపస్సు. తాను చేయవలసిన నిత్య కర్మలు సమయానుకూలముగా చేయుట. ఎల్లప్పుడు భగవంతుని ధ్యానించుట.

౧౫. శుచిత్వము. ఆచారము పరిశుభ్రము గలిగియుండుట.

౧౬. వైరాగ్యము. మన కండ్లకు కనబడు ప్రతి వస్తువును ఎప్పుడో ఒకప్పుడు నశించునని బుద్ధి గలిగి యుండుట.

౧౮. విషయాసక్తి. మనస్సులో ఏవిధమయిన కోరిక లేక యుండుట.

౧౯. సమచిత్తము. చీమ మొదలు బ్రహ్మ పర్యంతము పరబ్రహ్మ స్వరూపమని భావించి యుండుట.

౨౦. సమభావము. సకల ప్రాణులను తనవలెనే జూచుట, తనకు బాధగాని, కష్టముగాని, కలిగినప్పుడు ఎటుల వుండునో అటులనే యితర ప్రాణులు కష్టము సుఖము సమముగా నుండునని భావించుట.

౨౧. శ్రేష్టములైన తీర్థములు సేవించుట, పుణ్యస్థలములకున్ను దివ్య క్షేత్రములకున్ను, జని అచ్చట భగవంతుని సేవించుట.

ఈ మానస తీర్థము విద్యతో గూడియున్నది. అనగా జ్ఞానమును కలిగియుండుట, అను విద్యతో గూడియున్నది. దీనినే జ్ఞాన తీర్థమందురు. భగవంతుని మొదట, సూర్యుడు, విష్ణువు, ఈశ్వరుడు, పరాశక్తి ఈ దేవతా విగ్రహములను ప్రత్యక్షముగా ఎదుట, నుంచుకుని పూజించుచు, కాలచక్రమును పరబ్రహ్మ స్వరూపముగా ధ్యానించవలెను.

మనుష్యుడగు వాడు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని ధ్యానించునప్పుడు మంత్ర యుక్తముగా, అంగ న్యాసాదులతో జపించుట ముఖ్యము. లేదా నామ మంత్రమైనను జపించవలెను. ఆ ప్రకారము జపమును జేసిన యెడల సకల తీర్థములందును స్నాన దానములను జేసిన ఫలితములను పొంద గలుగుదురు.

ఓ రాజా! జల రూపమయిన తీర్థములు కోట్లకొలది గలవు. వాని వలన యేమి ప్రయోజనము గలదు. జ్ఞాన తీర్థమునందు మాఘమాస స్నానమున మోక్షమును కలుగుటకు సందేహము లేదు. తన మతి కులములకు తగిన కర్మలను ప్రతి మనుజుడు చేయవలెను గాని, అన్యమతి కుల సంబంధమగు కర్మలను జేయు వాడు మొదట బాగుగా నుండినను కొంత కాలమునకు వంశాదులు నశించుటకు సందేహము

లేదు. దానినే భగవద్గీతయందు యిట్లని చెప్పబడి యున్నది. శ్లో. శ్రేయాన్, స్వధర్మో, విగుణః, పర ధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మని, ధనం శ్రేయః, పరధర్మో, భయావహః. అనగా స్వవర్ణాశ్రమ ధర్మము శ్రేష్ఠమైనది గాకపోయినను దానినే ఆచరించి మోక్షమును పొందుము. అన్య వర్ణాశ్రమ ధర్మము శ్రేష్ఠమైనది అయినను, దానిని ఆచరించి పాప భయము గలిగి నశింపకుము. అని చెప్ప బడియున్నది.

ఓ రాజా! నీకు ఉత్తమమైన ఈ వైరాగ్యము నీకు జెప్పితిని. యమ నియమాది యోగము లందును, జ్ఞానము నందును, వైరాగ్యము నందును, వేదాంత సమ్మతిమైన సాంఖ్యము నందును, దుర్విషయము లందలి ఉపేక్ష నశించుటయందును, దుష్ట సాంగత్యము లేక పోవుట యందును, పాపములు నశించుటయందును, మనుష్యులకు, సత్పురుషుల సహవాసము. శ్రేష్ఠమైనది గాని మరియొక విధానము కానబడదు.

సత్పురుషుల సాంగత్యము వలన దుష్ట గుణములు నశించుట, చక్కదనము వచ్చుట. మోక్షము లభించుట, అని చెప్పబడి యున్నది. సదాచారము కలిగియున్న పక్షమున సకల శ్రేయములు గలుగును. సదాచారము లేని వారిని వేదములు వేదాంగములు చదినను వారిని కాపాడలేవు. ఆచారము గలవా[illegible] సకల తీర్థ స్వరూపుడగును. ఆచారము లేని వాడు కల్లు కుండలోని నీళ్ళవలె కుక్క తాకిన పాలవలె చవుటునేలను జల్లిన విత్తనములు వలెను, నిరర్థకములగును.

ద్రోహ చింతలేని మనుజుని బ్రహ్మ విష్ణు మహేశ్వరులే గౌరవించెదరు, మనస్సుద్ధి లేనివారికి ఏ తీర్థములు తిరిగినను, ఎన్ని స్నానములు జేసినను నీళ్ళలోని కప్ప, తాబేలు మొదలగు వానివలె పావనుడు కానేరడు. స్నానముజేసి దేహమునందు మురికిని పోగొట్టుకొన్న మాత్రమున మనశ్శుద్ధి లేనిది ఏదిచేసినను వ్యర్థములగును.

శబ్దాది విషయములందలి అనురాగమనెడి మురికిని నశింపజేసి జ్ఞానానంద మనెడి సముద్రమునందు స్నానము జేసినవాడు శీఘ్రకాలములో కైవల్యము పొందును.

ఓ పరీక్షితు మహారాజా! దేనిని వినుటచేత జ్ఞానమను యజ్ఞము చేసిన ఫలితము లభించునో అటువంటి మానస తీర్థ లక్షణమును నీకు జెప్పితిని.

అని శ్రీశుకమహాఋషి పరీక్షితు మహారాజునకు జెప్పెను.
స్కాంధ పద్మ పురాణాదులందుగల మాఘపురాణమను
వచన కావ్యమున మాఘస్నానాదులు
జేయుట అను మానస తీర్థము
యిరువదవ అధ్యాయము

# ఇరువది ఒకటవ అధ్యాయము

## క్షేత్రములు, మహాత్యములు ఎటులగలిగెను

పరీక్షితు మహారాజు శుక మహాఋషిని జూచి ఓ శుక యోగీంద్రా! తీర్థములు అనునవి నీళ్ళ యునికిచేత యేర్పడినవేగదా! అన్ని నీటి సముదాయములు ఒక్కటే అయివుండగా కొన్నిటికి గొప్ప తనమున్ను కొన్నిటికి హీనత్వమున్ను ఎటులగలుగును. ఈ శంశయ మును పోగొట్ట వలసినదని కోరెను.

శుక మహాఋషి జెప్పుచున్నాడు. ఓ పరీక్షితు మహారాజా! అన్నితీర్థములకు శ్రేష్టత్వము కలుగుటకు కారణము జెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము.

శరీరధారణమును బట్టి మనుష్యులు అందరును ఒక్కటే అయి వుండగా కొందరు చక్రవర్తులుగాను, కొందరు రాజులుగాను కొందరు

ధనవంతులుగాను, మరికొందరు దరిద్రులు మొదలగువారు గాను ఎటుల భేదములను కలిగియున్నారో అటులనే తీర్థములున్ను తీర్థ మహాత్మ్యములున్ను భూమియందలి క్షేత్రవిశేషయలను బట్టి కొన్నిన్ని, కొన్ని క్షేత్ర పాలకులను బట్టిన్ని నీటియొక్క తేటదనము వలనను ఆశ్చర్య కరములైన ప్రభావములు గలిగియుండుట చేతనున్ను, మహా మునులు పరిగ్రహించుట వలనను నివశించుటవలనను, తీర్థములకు పవిత్రతయు మహాత్మ్యమును జెప్పబడుచున్నవి.

గనుక భూ సంబంధమైన తీర్థములందును, మనస్సంబంధమైన తీర్థములందును ఎల్లప్పుడు ఎవరు స్నానమును జేయుదురో వారు సర్వోత్కృష్టమైన సద్గతిని పొందుదురు.

పరీక్షిత్తు జెప్పుచున్నాడు. ఓ శుకయోగీంద్రా! పుణ్యతీర్థములను సేవించువారు ఏ ఏ నియమములు కలిగియుండవలెను. భార్యాసమేతుడై పుణ్యతీర్థములను సేవించు గృహస్థు ఏ ఏ నియమములను కలిగియుండ వలెనో జెప్పవలసినదని కోరెను.

శుకమహాఋషి జెప్పుచున్నాడు. తీర్థయాత్రలకు వెడలువారు నడవదగిన నియమములను నాకు తెలిసిన మట్టుకు జెప్పెదను వినుము. వంటిపూట భుజించుట, నేలమీదపరుండుట ఒకరువండిన పదార్థము గాని, పరునియింట భుజించుటగాని, వదిలివేయుట, తినరాని అన్నము తినుట, ఏనుగు, గుఱ్ఱము, ఎద్దు మొదలగు వాహనములు మీద వెళ్ళి దేవతలకు తీర్థములను సేవించుట పనికి రాదు.

దేహము బడలిక పుట్టు నటుల దూరము నడచుట, దుర్మార్గులు గల దేశమునందు నివసించుట, బోయపల్లెల యందును, కుగ్రామము నందును (అనగా దేవాలయములేని గ్రామము) నివశింపకుండుట మంచిది. ఒక పక్షమున అటువంటి గ్రామమునందు నివశింప వలసి వచ్చిన యెడల కుమ్మరి వాని యింటియందు నివశించుట శ్రేష్టము.

తీర్థయాత్రలు జేయు వారు దంపతి యుక్తముగా గాని వంట రిగా గాని క్షేత్రమును జేరి నామ నక్షత్రమును జన్మ నక్షత్రమును జెప్పి క్షేత్రోపవాసము జేయుదునని సంకల్పము జేసి క్షురకర్మను జేయించుకుని స్నానము జేయవలెను. నిత్యము జేయుదగిన సంధ్యా వందనాది కృత్యములను నెరవేర్చుకుని ఉపవాసముండి రాత్రి జాగ రము జేసి మరునాడు శాస్త్రమునందు జెప్పబడిన ప్రకారము తీర్థ శ్రార్థము జేసి పితృదేవతలను తృప్తిపరచి తన శక్తికొలది బ్రాహ్మణు లకు దానములను జేయవలెను. మొదటిరోజున ఈ ప్రకారము జేసి మరి రెండు రోజులు స్నానాదులను జేసి పిమ్మట యితరక్షేత్రము లకు వెళ్ళవలెను.

ఈ ప్రకారము భార్యతో గూడ మాఘమాసమునందు తీర్థ యాత్రలు జేయువారు సకల పాపములను పోగొట్టుకుని శీఘ్రకాల ములోనే మోక్షమును పొందుదురు. ఇది మాఘమాస వ్రత స్నాన దానాదులను జేయువారు ఆచరింప దగును.

ఇతర కాలమందు యాత్రలను చేయు వారు నది ఋతు సంవేశనము (అనగా క్రొత్తనీటి కాలము) నందు భార్యా భర్తలు ఆ నీటియందు స్నానము జేయక క్రొత్తనీరు తగ్గిన పిమ్మట స్నానా దులు చేయవలెను. క్రొత్తనీటి కాలమునందు ఉపవాసములు, చాతు ర్మాస్యలు, చాంద్రాయణము మొదలగు వ్రతములు యాత్రార్థులకు ఫలితము నివ్వవు. కాబట్టి తీర్థయాత్రలు చేయువారు బంగారము పుటము బెట్టిన ఎటుల నిర్మలమగునో అటులనే తీర్థయాత్రలు చేయు వారి పాపంబులు నశించి పరిశుద్ధులగుదురు. మాఘమాస వ్రత స్నానా దులను గాని తీర్థయాత్రలుగాని చేయుటకు ఆసక్తి గలిగియు అవశ్త వలన గాని, యితర బాధల వలన గాని చేయలేని వారు తన కొరకు బ్రాహ్మణులను గాని యితరులను గాని నియమించి యాత్రా నియ

షుములను పాటించుచు యాత్రలు చేయించిన యడల యాత్రాఫలి తము మూడు పాళ్ళు చేయించిన వారికిన్ని ఒక పాలు చేసిన వారికిన్ని లభించును.

మాఘస్నాన వ్రతము చేయువారు తనకు భగవంతుడు యిచ్చిన వానిని బట్టి నెల దినములు దానములను చేయుచుండవలెను. అరటిపండ్లు, రేగిపండ్లు, పాలు, పెరుగు, తేనె, ఉప్పు, చక్కెర, బెల్లము, జాజికాయ, ప్రత్తి, కంబళము, వస్త్రము, జన్నిదము, కమండలా పాత్రము అన్నముతో నింపిన కంచు పళ్ళెము, చక్కెర, బెల్లముతో నింపిన కంచు పళ్ళెము, పానకము, నిమ్మపండ్లు, మాంటీఫలము, సువాసన ద్రవ్యములు, పుష్పాలు గోపిచందనము, శంఖము దేవతార్చన పాత్రము, సాలగ్రామము, స్పటికలింగము, విఘ్నేశ్వర ప్రతిమ, దుర్గా ప్రతిమ, ఈ ప్రకారము నిత్యము దానములను చేయుచు మాఘవ్రతమును చేయువారు ఇహమునందు సకల సంపదలు అనుభవించి వైకుంఠమునకు వెళ్ళుదురు. ఒకవేళ భూమియందు పుట్టినను అష్టైశ్వర సంపన్నులై పుట్టుదురు. సందేహము లేదు. యీ మాఘమాస వ్రతస్నాన దానములు జేయువారు మూడు వేళల యందును శ్రీ మహావిష్ణువును అర్చించుచు ధ్యానించుచు నుండుట ముఖ్యము.

ఆ ప్రకారము నక్త వ్రతము జేయువారు సాయంత్రము నందైనను విష్ణుమూర్తిని పూజింపవలెను. ఈ క్రింద వివరించిన విధముగా పూజించినను పుణ్యము గలుగును. శ్లో, శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం, శీతాపతిం, రఘుకులాన్వయ, రత్నదీపం ఆజాను బాహుం మరవిన్ద దళాయతాక్షం రామం నిశాచర వినాశకరం నమామి, అని ధ్యానించవలెను.

శ్రీ శీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమస్సమేత శ్రీరామచంద్ర ఆవాహయామి స్థాపయామి.

౧. శ్రీరామచంద్రాయనమః పాదౌ పూజయామి.
౨. రాజీవ లోచనాయనమః, గుల్ఫౌ పూజయామి.
౩. రావణాంతకాయనమః, జానునీ పూజయామి.
౪. వాచస్పతయేనమః, ఊరూం పూజయామి.
౫. విశ్వరూపాయనమః, జంఘే పూజయామి.
౬. లక్ష్మణాగ్రజాయనమః, కటిం పూజయామి.
౭. విశ్వమూర్తయేనమః. గుహ్యాం పూజయామి.
౮. విశ్వామిత్ర ప్రియాయనమః, నాభిం పూజయామి
౯. పరమాత్మనేయనమః, హృదయం పూజయామి.
౧౦. నీలకంఠాయనమః, కంఠం పూజయామి.
౧౧. సర్వాస్త్రధారిణేనమః, బాహూం పూజయామి.
౧౨. రఘూద్వహాయనమః, ముఖం పూజయామి.
౧౩. పద్మనాభాయనమః, జిహ్వాం పూజయామి.
౧౪. దామోదరాయనమః, దన్తాన్ పూజయామి.
౧౫. సీతాపతియేనమః, లలాటం పూజయామి.
౧౬. జ్ఞానగమ్యాయనమః, శిరః పూజయామి.
౧౭. సర్వాత్మనేనమః, సర్వాంగాని పూజయామి.
౧౮. శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమస్సమేత శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః, షోడశోపచార పూజాం సమర్పయామి.

అని పూజించి ధూప దీప నైవేద్య నీరాంజనములు యిచ్చి నిలుచుండి ఆత్మప్రదక్షిణము జేసి శ్లో. ఉరసా శిరసా దృష్ట్వా మనసా వచసా తథా పద్భ్యాం కరాభ్యాం కరణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే అని చెప్పి సాష్టాంగ నమస్కారములను చేయవలెను.

ఈ ప్రకారము మాఘ మాసమంతయు పూజించి శ్రీవిష్ణు సన్నిధిని దీప మాలికనుంచి బ్రాహ్మణాదులకు ప్రాసాదముల నీయ

వలెను. యీ ప్రకారము మాఘమాస వ్రత స్నాన దానాదులను ఎవరు చేయుదురో వారు నూరు అశ్వమేధ యాగములున్ను నూరు కపిలగోదానములున్ను చేసిన ఫలమును పొందుదురు.

అని జెప్పగానే పరీక్షిత్తు మహారాజు ఓ శుకమునీంద్రా! యీ ప్రకారము వ్రతమును జేసి ఫలితమును పొందిన వారు గలరా? యని ప్రశ్నించెను.

శ్రీశుకులు జెప్పుచున్నారు. ఓ రాజా! పూర్వకాలమునందు జరిగిన ఒక యితిహాసము గలదు. దానిని జెప్పెదను వినుము.

పూర్వము విష్ణువర్మ యను రాజు రాజ్యము పాలించుచుండగా ఒకనాడు నారదుడు రాజును జూచుటకు వచ్చెను. రాజు నారదుని చూచి సాష్టాంగ నమస్కారములు చేసి పాదశోపచారంబుల పూజించి కూర్చుండ బెట్టెను. పిమ్మట నారదుడు రాజను గూర్చుండ నియమించి కుశల ప్రశ్నలను జేసెను.

విష్ణువర్మ నారదుని జూచి ఓ నారదమునీంద్రా! లోకములో మాఘమాస వ్రత స్నాన దానాదులు జేయుటకు అన్ని సాధనములకు ధనధాన్య సమృద్ధి యుండవలెను. గాని ఏ విధమయిన సాధనము లేని వాడును ధనము లేనివాడును ఏమి చేయగలడు. ఎట్లు ముక్తి పొందగలడు. అని నా మనస్సున సంశయము కలుగుచున్నది. నా సంశయమును పోగొట్టవలశినదని కోరెను.

నారదుడు ధనము గలవాడు దాన ధర్మములను జేయుటచేతను యజ్ఞ యాగాదులు జేయుటచేతను పాపములను పోగొట్టుకుని స్వర్గమునకు వెళ్లుచున్నాడు. పిమ్మట దేవేంద్రుని సన్నిధని సుఖములను పొందుచున్నాడు. ధనము లేనివాడు వేదములను వేదార్థములను చదువుటచేతను వినుట చేతను అరిషడ్వర్గములను జయించి మనో వాక్కాయములను ఒక్కటిగా జేర్చి నడుచుచు అనుకూల వతియైన భార్యా పుత్రాదులతో కుచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు వ్రత

ములను జేయుచు జప హోమ దేవతార్చనములను జేయుచు తనకు గల దానిలో శక్తికొలది దానములను జేయుచు, అన్ని జంతువులను తనవలెనే జూచుచు, కష్టసుఖములకోర్చి మాఘమాస వ్రత దానాదులను జేసి బ్రహ్మ సామ్రాజ్యమును పొందును. పిమ్మట దేవేంద్రుని సన్నిధిని సకల సుఖములను పొందును.

నేను ఒకప్పుడు దేవేంద్రుని జూచుటకు స్వర్గమునకు వెళ్ళితిని, అచ్చట దేవ సభలో దేవేంద్రునితో సమానమైన సకల భోగములను అనుభవించుచున్న ధర్మ వాహనుడను రాజును జూచితిని. యీధర్మ వాహానునికి ఎదురుగా రాజుతో సమానముగా భోజనము లనుభవించుచున్న శ్రుతిపాలుడను బ్రాహ్మణుని జూచితిని. అని జెప్పగానే విష్ణుశర్మ, ఓ నారదమునీంద్రా! ధర్మవాహానుడను రాజు ధనవంతుడు గాన దానధర్మములను జేసి స్వర్గమును పొందెను.

శ్రుతిపాలుడను బ్రాహ్మణుడు దరిద్రుడుగదా! ఎట్లు పాపములను పోగొట్టుకొని స్వర్గలోకమునందు సకల భోగములను అనుభవించుచున్నాడు అని అడిగెను.

ఆ మాటలు నారదుడు విని యిట్లని జెప్పుచున్నాడు. ఓ రాజా! శ్రుతిపాలుడను బ్రాహ్మణుడు భార్యా పుత్రాదులతో గూడా ఈ భూమండలమున గల శ్రేష్టములైన పుణ్య క్షేత్రములలో మాఘమాస వ్రత దానాదులను జేయుచు మాఘమాస వ్రతములను జేసి పైని వివరించిన ప్రకారం శ్రీవిష్ణువును పూజించుచు వార్ధక్యము రాగానే కేదార క్షేత్రమునకు జని అచ్చట మాఘమాస వ్రత పూజాదులను జేసి మృతిపొందెను. మాఘమాస వ్రత స్నాన దానాదుల ఫలము వలన బ్రహ్మలోకము. శివలోకము. విష్ణులోకముల యందు తిరుగుచు స్వర్గమునకు వచ్చెను. ఓ రాజా! నేను జూచిన విషయమును నీకు జెప్పితిని. ధనముతో గాని, అధికారముతో గాని నిమిత్తము లేకనే యీమాఘ పురాణమందు చెప్పిన విధిని దానముల

నాచరించి స్వర్గ సుఖములను పొందవచ్చును. అందులకు సందేహము లేదు. అని శుకమహాఋషి పరీక్షితు మహారాజునకు జెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘ
పురాణ మను వచన కావ్యమున క్షేత్రములు,
క్షేత్ర మహాత్మ్యములు తెలుపునట్టి
యిరువది ఒకటవ అధ్యాయము

# ఇరువదిరెండవ అధ్యాయము

## మాఘ వ్రతమును జేసి ముక్తిపొందిన సువ్రతు చరిత్ర

ఈ ప్రకారము శుకమహాఋషి పరీక్షితునకు జెప్పిన మాఘ మాస వ్రత స్నాన దానాదుల మహాత్మ్యమును సూత మునీంద్రుడు శౌనకాది మహామునులకు జెప్పి ఓ మహామునులారా ! మాఘమాస వ్రతాదులకు దేవతలకే సకల కోరికలను యిచ్చుచుండగా మనుష్యులకు భార్యా పుత్రాదులను, ధనధాన్యములను, అధికారములను యిచ్చుటకున్న, స్వర్గమును యిచ్చుటకును తగియున్నదని చెప్పుటకు సందేహము లేదు. మాఘమాస వ్రతము కంటె మరి ఏ వ్రతము గలదు. మాఘ స్నానము చేయక పోవుటచేత మనుష్యుడు అదృష్ట హీనుడై కాలక్రమమున పుణ్యములు నశించి వంశాదులు నశించును. యిందుకు సందేహము లేదు.

పూర్వ జన్మమునందు చేసిన పాపములును యీ జన్మమునందు తెలిసి తెలియక చేసిన పాపములును మాఘస్నాన దానాదులు వలన నశించి పోవును. ఔరా లోకములో జనులు అజ్ఞానమున బడి పరాకున నైన మాఘస్నానమును జేయక, కాంతా కనకంబులకు వశులై

సేవకా వృత్తి చేయుచు అభిమానమనెడు గర్వము గలవారై ప్రవర్తించుచున్నారు. ఓ శౌనకాది మహా మునులారా! కృత, త్రేత, ద్వాపర, కలియుగములకు తగినట్టి ఆచార ధర్మములను వేదాదులను మహా మునులు యేర్పర్చియున్నారు. ఆయా యుగములందు ఆయా వర్ణాదులకు యేర్పాటు చేసిన ధర్మములను ఆచరించి మాఘస్నానాదులు చేసి ముక్తి పొంది స్వర్గ సుఖములను పొందుదురు అని చెప్పెను.

ఆ ప్రకారము సూతుడు జెప్పగానే శౌనకాది మహా మునులు ఆనందించి యీ ప్రకారము ప్రశ్నించిరి. ఓ సూత మునీంద్రా! యీ మాఘమాస వ్రతమును చేసి ముక్తి పొందిన వారి చరిత్రను జెప్పవలసినదని కోరిరి. సూతుడు జెప్పుచున్నాడు. మునీంద్రులారా! సువ్రతుడను బ్రాహ్మణుని కథ కలదు. దానిని వినిన సకల పాపంబులు నశించి పుణ్యముగలుగును.

పూర్వకాలమున నర్మదా నదీ తీరమున సోమనాథమను గొప్ప అగ్రహారము గలదు. ఆ అగ్రహారము ధనధాన్య సమృద్ధి గలిగి, తృణ కాష్ట జల సమృద్ధిగలిగి పుష్పములు, ఫలములు, దుంపలు మొదలగు వాటి చేతను, సస్య సమృద్ధి గలిగి చక్కగా బలసిన ఆవులు మందలు గలిగి యుండెను. అటువంటి అగ్రహారమునందు ధర్మాత్ములైన బ్రాహ్మణులు నిండి యుండిరి. ఆ బ్రాహ్మణులు వేదాధ్యయనము జేయువారును పంచ యజ్ఞములు నడపు వారును వైశ్వదేవాదులు చేయు వారును నిత్యాగ్ని హోత్రములను చేయు వారును అయి యుండిరి. ఆ అగ్రహారము వేద ఘోషచే దిక్కులు ప్రతి ధ్వనులు పుట్టించుచుండును.

అటువంటి అగ్రహారమునందు సువ్రతుడను బ్రాహ్మణ శ్రేష్ఠుడు గలడు. అతడు వేదములు, శాస్త్రములు, ధర్మములు, పురాణములు, తర్కము, జ్యోతిషము, మీమాంస సంగీత నృత్య, నీతి, శిల్ప, గజ, అశ్వ శాస్త్రాదులందు సమర్థుడై అరువదినాల్గు విద్యలను నేర్చి, మంత్ర శాస్త్రమునందు ప్రవీణుడై యుండెను. యిదియుగాక తెల్వ

శాస్త్రమును యోగ శాస్త్రమును అభ్యాసము చేసుకుని పదునాల్గు దేశభాషలను వ్రాయుట యందును, చదువుట యందును, మాట్లాడుట యందును సామర్థ్యము గలిగియుండెను.

ఇట్లు ధనము సంపాదించుటకు కావలశిన వానినెల్ల అభ్యసించి లుబ్ధత్వము కలిగి గురువులకు దక్షిణ నివ్వక అనేక యుపాయములు పన్ని ధనధాన్యాదులను వస్తువాహనములను భూములను గృహములను విశేషముగా సంపాదించి అంతటితో తృప్తి పొందక, అన్యాయ కృత్యములను చేయుచు ద్రవ్యమును పోగు చేయుచుండెను. దుర్దాన, మహాదానముల వల్లను, తిలదాన, మహిషదాన, అజదాన, ఉభయముఖ గోదానములను బట్టిన్ని వాటిని అంగడిపెట్టి అమ్మి ధనమును పోగు చేయుచుండెను. చెట్లను కొట్టించి అమ్మియు ధంశాలాదులవల్ల దానములు పట్టియు సంపాదించిన ధనము యంత యున్నది లెఖ్ఖ పెట్టుకొనుచుండెడివాడు. యిటుల సంపాదించి ధనము ధర్మకుగాని కొడుకులు కోడండ్రు కుమార్తెలకు గాని ఇయ్యక తాను తినక అక్రమ వడ్డీలకు యిచ్చి వృద్ధిచేయుగా నూరువేల వరహాలాయెను. ఈ విధముగా సంపాదించుచు దేహపటుత్వము తప్పి ముసలివాడై కాలక్రమమున యింద్రియ పటుత్వము తగ్గగా కన్నులు కనబడక, చెవులు వినబడక కాళ్ళు నడచుటకు స్వాధీనము లేక యింటిల నుండియు తాను తినక ఒకరికి పెట్టక కాలము గడుపుచుండెను.

ఇట్లుండగా కొడుకులుగాని, కోడండ్రుగాని, కుమార్తెలుగాని నౌకరులుగాని అన్నపానములు లేక మిక్కిలి కష్టపడి ఆకలి బాధకు ఓర్చుకోలేక యీ సువ్రతుని తిట్టుచుండిరి. సువ్రతుడు యీవిధముగా లేవలేని స్థితిలోనుండియు ధనము సంపాదన లేకపోయె గదా యని దుఃఖించుచుండెను.

ఇట్లు దుఃఖించుచు నింటియందుండగా వారి నందరిని మీకు నా యింటి నుండి పొండి అని తిట్టుచుండెడి వాడు. అతడు తన పెండ్లామును గూడా ఆదరించెడివాడు కాడు. అందు వలన మగని అసమర్థత

కనిపెట్టి నెమ్మదిగా మందసమందున్న ధనమును తీసి స్వేచ్ఛగా ఖర్చు పరచుకొనుచుండిరి. ఆ ప్రకారము తన కుటుంబము వారు స్వేచ్ఛగా భోజనాదులను జేయుట అనుమానపడి పరుష నందుండియో అనేక విధములుగా తిట్టుచుండెడివాడు.

అంతట కొంతకాలమునకు ఒకనాటి రాత్రియందు దొంగలు యింటిలో ప్రవేశించి భార్యా పుత్రాదులను, నౌకరులను త్రాళ్ళతో కట్టివైచి యింటనున్న ధనమంతయు దోచుకొని పోయిరి. యిట్లు దొంగలు ధనమంతయు దోచుకొని పోగా సువ్రతుడు దుఃఖముచే శరీరము తెలియక బిగ్గరగా యేడ్చుచు సొమ్మసిలిపోవుచు లేచుచు యిట్లని పలవరించుచు యేడ్చుచుండెను. నాచేత సంపాదించిన ధనమంతయు దొంగలు దోచుకొని పోయిరి. యింత ధనమును సంపాదించియు నేను తినలేదు. ఒకరికి పెట్టలేదు. దానధర్మములకు ఖర్చుపెట్టక పోగుచేసిన ధనము దొంగలు పాలుగాక ఎట్టుల నిలచును. నేను అనేక అన్యాయములను తుచ్ఛములగు దానములను పట్టి సంపాదించిన ధనము పుణ్య కార్యములకు ఎట్లు ఉపయోగించును. దీనినే పాపద్రవ్యమందురు. అందువలన దొంగలపాల బడెను. గోదానమే పట్టరాదు. దానము పట్టిన గోవును అమ్మినయెడల ఏడుతరములవారికి దారిద్ర్యము పీడించునని చెప్పబడి యున్నది. గనుకనే అట్టుల సంపాదించిన ధనము చోరుల పాలయ్యెను. నేను జ్ఞానము వచ్చినది లగాయతు లేవలేని స్థితికి వచ్చు పర్యంతము అన్యాయముగా సంపాదించిన ద్రవ్యము ఒక్క క్షణకాలములో దోచుకుని పోయిరి. ఓ పాపిష్టిధనమా! నాకు ఎంత ఆశ కల్పించి పోగుచేయించి ఒక్క క్షణ కాలములో రెక్కలువచ్చిన పక్షి వలె ఎగిరిపోయితివి. నిన్ను శాశ్వతమని నమ్మి స్నాన సంధ్యావందనాదులున్ను దేవఋషి పితృతర్పణాదులున్ను వదిలి వేసితినే! అయ్యో! ఎన్ని వేదములను ఎన్ని శాస్త్రములను చదివిన నేమి? ధనాశ గలిగి మత, కుల ఆచారములను స్నాన సంధ్యా వందనాదులను వదిలివేసి

తిని. హరిహరాదులను ప్రార్జింపకయు భార్యాపుత్రాదులకు పెట్టకయు, ధనాసయును లోభిత్వము గలిగి యిహ పర సౌఖ్యంబులకు చెడిపోతినే అని అనేక విధముల పేర్లు పెట్టి యేడ్చుచు క్రిందపడి దొర్లుచు భార్యాపుత్రాదులను జూచి బతిమాలుచు యేడ్చుచు ఓ భార్యాపుత్రాదులారా! యమదూతలువచ్చి నన్ను లాగుకొని పోవు కాలమునందు ఏమని చెప్పెదను అని విచారించి, విచారించి, కొంచెము వైరాగ్యము గలిగి యిట్లని ఆలోచన జేసెను.

అంతట అతని మనస్సునందు ఒక విధమైన తెలివి గలిగి. ఔరా? ఎంతపనిచేసితి నేను గురువుగారొద్ద చదువునప్పుడు వ్యాస మహాఋషిచే చెప్పబడిన శ్లోకము యిప్పుడు నాకు జ్ఞాపకమునకు వచ్చినది. నేను ముసలివాడనై లేవలేని స్థితిలో నుంటిని. దానికంటె యితరమైన మార్గము నాకులేదు. నేను కాశ్మీర దేశమునకు ధనము సంపాదించుటకు వెళ్ళినప్పుడు గంగానది గట్టునందు తెల్లవారఝామున మాఘస్నానమును జేసి వేదాధ్యయనము జేయు చుండు వారును, వేదములను చదువువారును, అయిన అనేకమంది బ్రాహ్మణులను. అనేకమంది ప్రజలను జూచి మాఘ పురాణమునందు జెప్పబడిన శ్లో. మాఘేనిమగ్నాస్సలిలేసుశీతే విధూత పాపాస్త్రిదివం ప్రయాంతి, అనగా మాఘమాసమున చల్లగానుండు నీళ్ళలో స్నానమును జేయువారు పాపములను పోగొట్టుకుని స్వర్గమునకు పోవుదురు. అని చెప్పుచుండెడివారు. ఆ బ్రాహ్మణులు అట్లు చెప్పినప్పుడు నేను వినుచుండెడి వాడను అప్పుడు ధనలోభమున అచరింపనైతిని. ఇప్పుడు నాకు ఆ మాఘస్నానమే గతియని నిశ్చయించుకుని స్వతహాగ ధైర్యమును దెచ్చుకుని మనోవాక్కాయములు మూటిని యేకము జేసుకొని కుమారుని సహాయము జేసుకొని తొమ్మది దినములు నర్మదా నదియందు మాఘమాసము రాగానే యధావిధిగా స్నాన దానాదులను జేసెను. పదియవ దివసమందు నెమ్మదిగా కుమారుని సహాయమున నర్మదానదికి

వెళ్ళి యథావిధిగా స్నానాదులను చేసి గట్టునకు వచ్చి దక్షిణ శిరం బుగా పరుండి గోవిందరామ, గోవిందరామ, యని బిగ్గరగా పలుకుచు ప్రాణములను విడచెను. అంతట కుమారుడు మొదలగువారు చూచు చుండగా విమానమునెక్కి స్వర్గమునకు వెళ్ళెను. మాఘమాస స్నాన ప్రభావమున సువ్రతుడు సకల పాపంబులను పోగొట్టుకొని స్వర్గమును పొందెను.

ఓ శౌనకాది మహా మునులారా ? నర్మదానదిలో పది దిన ములు సువ్రతుడు మాఘస్నానమును జేసి స్వర్గమునకు పోయెను. అన్ని మాసములలోను మాఘమాసము శ్రేష్టమైనదని చెప్ప బడుచున్నది. ఈ మాఘ మాసము యొక్క ప్రభావము మరియే మాసమునకు లేదు.

పూర్వకాలమునందు దేవేంద్రునకు గలిగిన శాపమును మాఘ స్నానమున పోగొట్టుకొనెను. ఆ గాథను మీకు జెప్పెదను వినుడు.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘపురాణమను
వచన కావ్యమున మాఘ మాస వ్రతమును
జేసి ముక్తిపొందిన సువ్రతు చరిత్ర గల
ఇరువది రెండవ అధ్యాయము

# ఇరువదిమూడవ అధ్యాయము

## దేవేంద్రుడు గాడిద ముఖమును పోగొట్టుకొనిన చరిత్ర

సూత మహాముని జెప్పుచున్నాడు. ఓ సౌనకాది మహా మును లారా ! శ్రద్ధగా ఆలకింపుడు.

పూర్వకాలమునందు కృతయుగమున తుంగభద్రానదీ తీర మందు భాస్కరహితుడను ఒక బ్రాహ్మణుడు ఆశ్రమము కల్పించు కొని నాలుగు వేదములను ఆరు శాస్త్రములను శిష్యులకు పాఠములను

జెప్పుచు నిత్యాగ్ని హోత్రమును వైశ్యదేవాదులను కాలక్రమమున జేయుచు అతిథి అభ్యాగతులను పూజించుచు సుఖముగా నుండెను.

అతనికి మన్మధ బాణయను భార్య గలదు. ఆమె ఆకారము నందును, రూపము నందును, అవయవ నిర్మాణము, నందును మాధుర్యములగు మాటలయందును నేర్పు గలదై సుగుణ సంపత్తి గలదియై యుండెను.

ఇట్లుండగా కొంతకాలమునకు ఆమె ఋతిమతియై స్నానార్థము తుంగభద్రానదికి వచ్చి స్నానముజేసి తల వెంట్రుకలను విడదీయుచు లేత ఎండలో నిలుచుండి ఆరబెట్టుచు కేవళము మన్మథ బాణము వలెనే కనబడుచుండెను.

ఆ సమయమందు రాక్షసులను సంహరించుటకై దేవేంద్రుడు అష్టదిక్పాలకులతోటిన్ని, దేవతా సమూహముతోటిన్ని, తుంగభద్రా నదీతీరము నందుగల భాస్కరహితుడను బ్రాహ్మణుని ఆశ్రమము మీదుగా వెళ్ళుచు నదీ తీరమునందు నిలుచుండి తల వెంట్రుకలను ఆరబెట్టుకొనుచున్న ముని భార్యను జూచి మోహించి కామశర పీడితుడై ఆమెయందు అనురాగము గలిగి భోగింపవలెనని కోరిక గలిగెను. గాని యుద్ధముయొక్క అగత్యమును బట్టి దక్షిణ దిక్కుగా యున్న రాక్షస మూకలు వద్దకు వెళ్ళి అయిదు అహోరాత్రములు రాక్షసులతో యుద్ధము జేసి రాక్షసులను సంహరించి జయమును పొంది దేవతా సమూహముతో స్వర్గమునకు జని ఆ ముని పత్నియందు గల కోరికను మన్మథుడు ప్రేరేపించగా మనస్సు నిలుపుకొనలేక రాత్రి కాలమునందు ఆ ముని ఆశ్రమమునకు వెళ్ళి అదృశ్యముగా నుండి సమయము కొరకు కాచుకొని చూచుచుండెను.

ఇట్లుండగా భాస్కరహితుడను మహాఋషి మూడవ యామము కాగా యితర ఆశ్రమములందు నిద్రించుచున్న తన శిష్యులను లేపుటకుగాను కుటీరమును విడచి బయటకు వెళ్ళెను. ఆ సమయము కని

పెట్టి దేవేంద్రుడు మెల్లగా కవాటము తెరచి మంచముపై పరుండి యున్న ముని భార్యను గట్టిగా కౌగలించి పట్టుకొనెను. అటుల పట్టు కొనిన వాడు పరపురుషునిగా తెలుసుకొని విడలించి కేకలు వేయుచు అవతలకు వెళ్ళుచుండెను. అంతట దేవేంద్రుడు ముని భార్యను చేతులు పట్టుకొని నేను దేవేంద్రుడను మూడులోకములకు అధిపతిని. నన్ను కరుణించి నాకోరిక నెరవేర్చవలసినదని అనేక విధములుగా బ్రతిమాల సాగెను.

అంతట మునిపత్ని యేమి చేయుటకు వేరుగతి కానబడక అంగీకరించి దేవేంద్రుని గౌరవించెను. మునిపత్నియు దేవేంద్రుడును మన్మథ క్రీడల నోలలాడుచుండిరి.

ఈ ప్రకారముగా నుండగా భాస్కరహితుడును శిష్యులను లేపి తీసుకొనివచ్చి కుటీర సమీపమందుగల ప్రదేశమందు కూర్చుండ బెట్టి పాదప్రక్షాళన జేసుకొనుటకు గాను ఉదకము నిమిత్తము గృహ ములో ప్రవేశించెను. యింతలో దేవేంద్రుడును సంభోగాంతము కాగా వెళ్ళుటకు లేచి బయటకు వచ్చుచుండెను. మహాముని గృహ ములోపలనుండి వచ్చుచున్న దేవేంద్రుని జూచి జారుడని కేకవేశి గట్టిగా పట్టుకొనెను.

అటుల పట్టుకొనిన మునిని జూచి దేవేంద్రుడు నేను యితరు డను గాను. దేవేంద్రుడను అని చెప్పెను. ఆ మాటలను ముని విని నీవు నా ఆశ్రమములో ఎందులకు ప్రవేశించితివని ప్రశ్నించెను. అది విని యింద్రుడు జవాబుజెప్పక తలవంచి యూరకుండెను. మహాముని దేవేంద్రుడు జవాబు చెప్పనందున జారుడుగా తెలుసుకొని ఓయింద్రా! నీవు దుర్మార్గుడవు, మూఢుడవు, స్త్రీల మానములను జెరచువాడవు, నీవు గర్వముగలవాడవై నాభార్యను జెరచితివి గాన మూర్ఖా! నీవు గాడిద ముఖము గలవాడవై స్వర్గమునకు వెళ్ళుటకు శక్తిలేక వ్రేలాడు వృషణములు గలవాడవై తిరిగెదవు గాక యని శపించెను. ఆ శాపవాక్య

ములను యింద్రుడు విని గజగజ వణకుచు మహాత్మా! నేను చేసిన అపరాధమును క్షమింపవలసినదని ప్రార్థించెను. మహాముని కరుణించి కొంతకాలమునకు మాఘమాస వ్రత స్నానమున పరిశుద్ధుడవై స్వర్గ సుఖములను పొందెదవని చెప్పెను.

ఆ ప్రకారము దేవేంద్రుని శపించి కరుణ గలిగి విమోచనము జెప్పి తనభార్యను జూచి నీవు జారత్వమున అపకీర్తి భయమును పొందితివి గాన అటవి యందు పాషాణమై పడియుందువు గాక యని శపించెను. అంతట భార్య భయముకలదై భర్తపాదములపై బడి నాయందు తప్పు లేదు అని జరిగిన సంగతి అంతయు విన్నవించి నిర్బంధము వలన వేరు గతి గానక సమ్మతించితినని చెప్పెను. అప్పుడు మహాముని తనజ్ఞాన దృష్టిని జరిగిన విషయమునంతను తెలుసుకొని తనసతికి కాముక వాంఛ లేదని గ్రహించి కరుణ గలవాడై మకర మాఘ మాసమున సూర్యజయింతిని తుంగభద్రానదిలో స్నానార్థము వచ్చిన గౌతము డను మునియొక్క పాదములకు నీ పాషాణము తగిలి పవిత్రు రాలవై నా సాన్నిధ్యమును పొంది సకల సుఖంబులు అనుభవించెదవు గాక యని జెప్పి శిష్యుల సహితముగా వేరొక ఆశ్రమమునకు బోయి తపంబు జేసుకొనుచుండెను.

ఇది యిట్లుండగా దేవేంద్రుడు దేహము మాత్రము పూర్వము వలెనే నుండెనుగాని ముఖము గాడిద ముఖము గలిగి సిమపాటి చెవులు పెదవులు వేలాడుచు మాటలు గాడిద కూతవలె నుండెను. అతఁడు తన రూపము మార్పు జెందుటకు విచారించి స్వర్గమునకు వెళ్ళుటకు గాని. నడచుటకుగాని సామర్థ్యములేక శక్తిహీనుడై యితరులను జూచుటకుగాని, మాట్లాడుటకుగాని సిగ్గుపడి పాద గయాక్షేత్రము నందుగల పలానదీ ప్రాంత అడవులకు జని కొండ గుహలయందు నివ శించుచు ఆ ప్రాంతమునందు గల ఆకు అలములను తిని దేహము పోషించుకొనుచుండెను. యీ విధముగా పన్నెండు సంవత్సరములు గడచెను.

ఈ కథ యిట్లుండగా చాలాకాలము గడచిన పిమ్మట ఒకా నొక మాఘమాసమునందు గౌతముడను మహాముని లోకమునందు గల మహాక్షేత్రములందు మాఘమాస వ్రత దానాదులు జేయుచు తుంగభద్రానదీ తీరమందుగల విరూపాక్షస్వామిని సేవించుటకు బుద్ధిగలిగి తుంగభద్రానదీ తీర్థమునకు వచ్చి ఋషి వాటికలో ప్రవే శించి మాఘమాస స్నానాదులను జేయుచుండెను. మకరమందు సూర్యుడుండగా వచ్చిన మాఘశుద్ధ సప్తమియందు సూర్యజయింతిని జేయుటకు నిశ్చయించి యథావిధిగా స్నానదానములను జేసి నిత్య కృత్యములను దీర్చుకుని బ్రహ్మయజ్ఞ పితృతర్పణాదులను జేసి రెండు యామములు కాగా ఆశ్రమమునకు వచ్చుచుండగా మార్గ మధ్యము నందు ఆయాసముగలిగి శ్రమ తీర్చుకొనుటకు కూర్చుండుటకుగాను నలుమూలలు జూడగా ఒకవైపున మనుష్యాకృతిగల పాషాణము పడి యుండుట జూచి ఆశ్చర్యపడి సమీపమునకు వెళ్ళి తన పాదమును పాషాణము మీదనుంచి ఆలోచించుచుండగా, ఆపాషాణము మను ష్యాకృతిదాల్చి స్త్రీరూపము ధరించి గాఢనిద్రనుండి లేచినదానివలే లేచి నిలుచుండెను. ఆ వింతను జూచి గౌతముడు ఆశ్చర్యపడి చూచు చుండెను.

అంతట ఆమె మహాత్మా గౌతమా! నీయొక్క పాదము తాకుటచేత నేను పూర్వమునందు చేసిన సకల పాపంబులు నశించి నేను మానవ జన్మమెత్తితిని అని అనేకవిధములుగా స్తోత్రము జేసెను. ఆ స్తోత్రమునకు ఋషి సంతోషించి నీవు ఎవరివు? ఎవరిభార్యవు! నీ వృత్తాంతము జెప్పవలసినదని అడిగెను.

ఓ గౌతమా! నా పూర్వ వృత్తాంతమును జెప్పుచున్నాను విను మని ఆ మూలాగ్రముగా జెప్పగా విని ఆ మునిపత్నిని వెంటబెట్టుకుని భార్యారహితుడను మునివద్దకు తీసుకువచ్చి చూపించగా మహాముని సంతోషించి భార్యను కౌగలించుకుని తగినట్లు మాట్లాడ గౌతముని

తన ఆశ్రమమునందు నివశించి మాఘమాస వ్రతమును పూర్తిజేయ వలసినదని ప్రార్థించిరి. ఆ గౌతముడున్ను మునిదంపతులు కోరిన ప్రకారము వారి ఆశ్రమమునందు నివశించి మాఘమాసవ్రతమును పూర్తి జేసుకొనెను.

ఈ కథకు కారకుడైన గౌతముడు యీ సభలోనే ఉండెను. గాన వారినడిగి తెలుసుకొనుడనగానే గౌతముడు లేచి ఓ మునులారా! యీ సూతమహాఋషి చెప్పిన కథయంతయు యదార్థము. నేను కండ్లార చూచి చేతులారా చేసిన యీ కార్యమును చూచినట్లు చెప్పి యున్నాడు. మాఘమాస వ్రతస్నానాదుల మహాత్మ్యమును ఎంతగలదో తెలుసుకొనుటకు బ్రహ్మకు సహితము శక్యముకాదు. అని పలికి కూర్చుండెను. అంతట మహామునులు ఆశ్చర్యపడి గౌతముని గౌర వించిరి. పిమ్మట సూతమహాముని యిట్లని చెప్పుచున్నాడు.

ఓ శౌనకాది మహామునులారా! ఆ ప్రకారము దేవేంద్రుడు శాపగ్రస్థుడై పడియుండగా పన్నెండు సంవత్సరములు జరిగెనని గదా! తరువాత యేమిజరిగినదో చెప్పెదను ఆలకింపుడు. దేవేంద్రుడు స్వర్గము నందు లేనికారణమున రాక్షసులు చెలరేగి దేవలోకమును ముట్టడించి యుద్ధమును జేయసాగిరి. యిటుల రాక్షసులు దేవలోకమును ముట్ట డించి యుద్ధము జేయుచుండుటచే దేవతలు భయపడి దేవేంద్రుని కొరకు వెదుకసాగిరి. స్వర్గ పాతాళ లోకములు వెదకి ఎందును యింద్రుడు కానుపించనందున భూలోకమునకువచ్చి వెదకి దేవేంద్రుడు ఎచ్చటనున్నది తెలిసికొనలేక పిదప బ్రహ్మలోకమునకు వెళ్లి బ్రహ్మతో జెప్పుకొనిరి. బ్రహ్మ దేవతలను వెంటబెట్టుకుని శ్రీ మహావిష్ణువు వద్దకు వెళ్లి దేవేంద్రుడు ఎచ్చటనున్నది తెలియులేదని చెప్పిరి. అప్పుడు శ్రీ మహావిష్ణువు ఓ బ్రహ్మాదులారా! దేవేంద్రుడు మునిశాపమున గాడిదముఖమును పొంది స్వర్గమునకు వెళ్ళుటకు శక్తిలేక మేరునగ ప్రాంతమునందుగల అడవులలో తిరుగుచు కొండగుహాలలో నివశించు

చున్నాడు. అని చెప్పగానే దేవతలు ఓ దేవా ? దేవేంద్రుడు అటుల తిరుగుటకు హేతువును జెప్పవలసినదని కోరిరి. శ్రీ మహావిష్ణువు జెప్పుచున్నాడు. ఒకానొక కాలమందు దేవేంద్రుడు భాస్కరహోతుడను మహాఋషి భార్యయైన మన్మథ బాణయను ఋషిపత్నిని పొందుటచే ఆ మహాఋషి గాడిద ముఖాదులు కలుగునటుల శపించెను. అందువలన యితరులను జూచుటకు సిగ్గుపడి యచ్చట నున్నాడని చెప్పెను. అప్పుడు దేవతలు శ్రీ మహావిష్ణూ బ్రాహ్మణశాపము పోవునట్లును, తిరుగ దేవేంద్రాధిపత్యము గల్గునట్లును, శక్తిసామర్థ్యములు కలుగునట్లును అనుగ్రహించి ఆ విధానమును అనతిమ్మని కోరిరి. శ్రీ మహావిష్ణువు జెప్పుచున్నాడు.

ఓ దేవతలారా ! మీరు ఏలానదీ ప్రాంతమందున్న దేవేంద్రుని పట్టుకుని మాఘశుద్ధ పాడ్యమి మొదలు పూర్ణిమవరకు మొదట ఏలా నదిలో స్నానమును జేయించి పిమ్మట పిఠాపురమందున్న పాదగయా క్షేత్రమునందు స్నానముజేయించి కుక్కుటేశ్వరుని పూజించి పిమ్మట కుంతీ మాధవస్వామి రూపముననున్న నన్ను పూజింపుచు ఈ ప్రకారము పదిహేను దినములు మాఘమాస వ్రతమును జేయించిన యెడల దేవేంద్రునకు పరసతీసంగమ దోషమున్ను. ఋషిశాపమున్ను నశించి పూర్వపు రూపముగలిగి దేవేంద్రాధిపత్యము వహించి సుఖించునని చెప్పి పంపించివేసెను. ఆ మాటలను బ్రహ్మవిని దేవతలను దేవేంద్రుని కొరకు పంపించి తాను సత్యలోకమునకు జనెను.

శ్రీ మహావిష్ణువు చెప్పిన ప్రకారము ఏలానదీప్రాంతమందుగల అడవులు కొండగుహాలు వెదకి దేవేంద్రుని పట్టుకుని మాఘమాసము రాగానే ఏలా నదియందు దేవేంద్రుని ముంచి తరువాత పాదగయలో స్నానము జేయించి కుక్కుటరూపమున స్వయంవ్యక్తముగానున్న ఈశ్వరుని దేవేంద్రుని పట్టుకుని తాముపూజించి అటుతరువాత కుంతీ మాధవస్వామి రూపముననున్న శ్రీ మహావిష్ణువును పూజించుచు

సాయంకాలమందు మితాహారము బెట్టుచు యథావిధిగా పదిహేను దినములున్ను మాఘమాస వ్రత స్నానాదులు గాడిదముఖముననున్న దేవేంద్రునిచే చేయించిరి.

ఈ ప్రకారము చేయించుటచే మాఘమాస వ్రతప్రభావమున దేవేంద్రునకు పూర్వపు రూపమున్ను శక్తి సామర్థ్యములున్ను గలిగెను. అప్పుడు స్వర్గమునందునుండి ఐరావతము శచీదేవి రాగా, శచీదేవి సహితముగా ఐరావతమునెక్కి అష్టదిక్పాలకులు, దేవతలు పరివేష్టించిరాగా స్వర్గమునకు వెళ్ళి. రాక్షసులను సంహరించి త్రిలోకాధిపత్యమును పొంది శచీదేవి సహితముగా సకల సౌఖ్యములు పొందుచుండెను.

ఓ మహామునులారా! వింటిరిగదా మాఘమాస మహాత్య్మము మాఘమాస వ్రతస్నానాదులు వలన బ్రాహ్మణశాపమున్ను, పరస్త్రీ సంగమ దోషమున్ను పోగొట్టుకొని దేవేంద్రుడు సకల సుఖములను పొందెను. మాఘస్నాన ఫలితము దేవతలకే సకలకోరికలు నిచ్చుచుండగా మానవులకు గలుగుటకు వింతయేమియున్నది. మాసములలో మాఘమాసమునకు వున్న ఫలితము యింతయని చెప్పలేము. ఒకానొక కాలమందు విశ్వామిత్రుడు భూప్రదక్షిణము జేయుచు గౌతమీ తీరమందుగల కళ్యాణ వీరభద్ర క్షేత్రమునకువచ్చి అచ్చటనొక గంధర్వస్త్రీతో సంభోగించి ఆ దోషమువలన వానర ముఖమునుపొంది మాఘస్నానమువలన తన పూర్వపు రూపమునుపొంది సుఖముగా నుండెను. ఆ కథను మీకు వివరించి చెప్పెదను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘపురాణమను
వచన కావ్యమున దేవేంద్రుడు మాఘస్నానమున
గాడిద ముఖమును పోగొట్టుకొనిన కథ
యిరువది మూడవ అధ్యాయము

# ఇరువదినాల్గవ అధ్యాయము

## విశ్వామిత్రుడు వానర ముఖమును పోగొట్టుకొనిన కథ

సూతమహాముని చెప్పుచున్నాడు. ఓ మునులారా! మాఘ మాస మహాత్మ్యమును ఎంతయని వివరించిచెప్పగలము. నాకు తెలిసిన విశ్వామిత్రుని చరిత్రను జెప్పెదను ఆలకింపుడు.

పూర్వకాలమునందు మాఘమాస వ్రతస్నానములను జేయుట యందు కోరిక గలిగి కొందరు గంధర్వులు తమతమ దారా పుత్రాదులతో ఆకాశమార్గంబున అరుణోదయ కాలమునకు గంగాతీరమునకు వచ్చి మాఘస్నానమును జేసి అచ్చటనుండి ప్రయాగ, తపతి, నర్మద మొదలగు నదులయందు స్నానమాచరించి సిద్ధ జనార్దన క్షేత్రము నందు స్నానాదులు జేసి కళ్యాణ వీరభద్రుని దర్శనార్థమై వెళ్ళి అచ్చట క్షేత్రమునందు స్నానాదులు జేసిరి. అందులో ఒక గంధర్వుని భార్య రూప యవ్వన సంపత్తి గలిగియుండి సౌందర్య గర్వమున చలి బాధకు తాళలేక స్నానము జేయక యీ చన్నీటిలో మునిగిన పుణ్యము ఎట్లు గలుగును. దేవుని దర్శించిన ఏమి ఫలము గలుగును. నేను స్నానము చేయను. దేవతా దర్శనము చేయనని మూర్ఖముగా మాట్లాడి స్నాన ములు నిరాకరించి పలికెను. ఆ దోషము వలన, ఆకాశ గమనశక్తి నశించి బుద్ధి మందగించి ఆ ప్రాంతమునందు తిరుగుచుండె. తక్కిన గంధర్వాదులు తాము స్నానాదులు జేసి కళ్యాన వీరభద్రుని దర్శించి తమతమ తావులకు వెళ్ళిరి. అందులో ఒక గంధర్వుడు గృహంబునకు వెళ్ళి తన భార్య రానందునకు విచారించి వెనుకకు వచ్చుచుండెను.

ఇంతలో విశ్వామిత్రుడు మాఘ స్నానము నిమిత్తము కళ్యాణ వీరభద్ర క్షేత్రమునకు వచ్చి ఆ సమీపమునందు తిరుగాడుచున్న గంధర్వ స్త్రీని జూచి పరవశుడై బుద్ధి మందగించి మన్మథ బాధకు తాళలేక ఆమెవద్దకు వెళ్ళి ఓ కాంతా! నీ రూప సౌందర్యములకు నేను వశుడనైతినని పలికి ఆ సమీపమందు గల వనమందు ఆమెతో సంభోగము చేయుచుండెను.

ఇట్లుండగా ఆ గంధర్వుడు భార్యను వెదకుకొనుచు, వచ్చి విశ్వామిత్రునితో తనభార్య సంభోగించుట జూచి ఓ విశ్వామిత్రా! నీవు నా భార్యయైన పరస్త్రీతో సంభోగము చేసితివి. గాన నీవు మంద బుద్ధి గలవాడవై కొండముచ్చు ముఖము గలవాడవై తిరుగుచుందువు గాక యని శపించి, భార్యను చూచి నీవు నాతో రాక యిచ్చట జార పురుషునితో నుంటివిగాన నీవు యిచ్చటచే పాషాణ రూపమున నుందువుగాక యని శపించెను. అంతట గంధర్వుని భార్య మహాత్మా! నేను యీ క్షేత్రమున స్నానము జేయక నిందించిన కారణమున ఆకాశ గమనశక్తి నశించి బుద్ధి మాంద్యముగల దాననై తిరుగుచుండగా యీ ఋషి నన్ను కామించి కోరుటచే శపించునను భయము వలన నంగీకరించితినని చెప్పగా దివ్యదృష్టిని సకలము తెలుసుకొని దయగలిగి నీవు క్షేత్రమును దూషించితివి నీకు యిటుల జరిగినదని చెప్పి కొంత కాలమునకు నారదుడు మాఘ స్నానార్థము ఈ క్షేత్రమునకు వచ్చును ఆ సమయమందు నారదముని దయవలన మీకు పూర్వ తేజస్సులు గలిగి నీవు నా సాన్నిధ్యమునకు వచ్చెదవు గాక యని విమోచనము చెప్పి తన లోకమునకు వెళ్లెను.

ఈ ప్రకారము పండ్రెండు సంవత్సరములు జరిగెను. ఒకానొక మాఘ మాసమునందు అన్ని క్షేత్రములలో స్నానాదులను జేయుచు నారదమహాముని ఈ కళ్యాణ వరద క్షేత్రమునకు వచ్చి కొండ ముచ్చు ముఖము గలిగి తిరుగుచున్న విశ్వామిత్రుని చూచి దయగల వాడై ఆహా! కాలమహిమ తపో మహిమచే బ్రహ్మను మెప్పించి బ్రహ్మఋషియని బిరుదు వహించిన విశ్వామిత్రుడు పరస్త్రీ వాంఛ చేత ఎటుల చెడిపోయెనో అని విచారించి విశ్వామిత్రుని బలవంత ముగా పట్టి తీసుకొనివచ్చి గట్టున కూర్చుండబెట్టెను.

ఆ రోజు మాఘశుద్ధ పూర్ణిమ గాన యథావిధిగా విశ్వామి త్రుని పేరుజెప్పి స్నాన దానాదులు జేసి శ్రీమహావిష్ణుని దశాక్షరీ

మహామంత్రమైన జయజయ రామ కృష్ణ హరి. యను దశాక్షరీ మహా మంత్రమును సహస్ర పర్యాయములు జపించి మంత్రోదకమును విశ్వామిత్రుని మీద జల్లెను. మాఘస్నాన ప్రభావము వలన విశ్వామిత్రుడు తన పూర్వ దేహమున్ను సూక్ష్మ బుద్ధిన్ని కలిగి నారదుని కౌగలించుకొని మహాత్మా ! నారదా ! నీ అనుగ్రహము వలన నా పాపంబులు నశించినవి. నేను పూర్వరూప జ్ఞానాదులను పొందితినని జెప్పి అచ్చట పడియున్న గంధర్వ కాంతయొక్క చరిత్రను జెప్పి పాషాణమును జూపించెను. నారదుడు ఆ మాటలను విని సంతోషించి కమండలమందున్న జలమును ఆ పాషాణమందు జల్లెను. పాషాణమందు ఉదకమును జల్లగానే నిద్రనుండి లేచిన విధముగా నామె లేచి నారద విశ్వామిత్రులను జూచి మహా మునులారా ! మాఘ స్నానమును క్షేత్రమును నిందించిన పాపమును పోగొట్టి నన్ను రక్షించితిరి. మీకు అనేక నమస్కారములు అని జెప్పి నమస్కరించి తనలోకమునకు బోయి భర్తతో సుఖంబుగా నుండెను.

నారద విశ్వామిత్రు లిద్దరు లోక సంచారమునకు వెళ్ళిరి. ఓ మహామునులారా ! మాఘ స్నానమును నిందించినను క్షేత్రమును దూషించినను ఎంత పాపము గలదో వింటిరి గదా. అటువంటి మహా పాపంబులను పోగొట్టుటకు ఒక్క మాఘ మాసమునకున్ను రథసప్తమికిన్ని, భీష్మ ఏకాదశికిన్ని, పూర్ణిమకున్ను, మహా శివరాత్రికిన్ని తగియున్నది గాని యితర మాసములకు లేవు. వింటిరిగదా విశ్వామిత్రుని వానర ముఖమును పోగొట్టిన మాఘమాస మహాత్మ్యమును అనిచెప్పెను.

స్కాంధ పద్మ పురాణాములందు గలమాఘ
పురాణమను వచన కావ్యమున విశ్వా
మిత్రుని వానరముఖమును పోగొట్టున
ఇరువది నాల్గవ అధ్యాయము

# ఇరువది అయిదవ అధ్యాయము

## మాఘశుద్ధ ఏకాదశీ మహాత్మ్యము

సూతమహాముని చెప్పుచున్నాడు. ఓ శౌనకాది మహా ఋషులారా! ఆ ప్రకారము విశ్వామిత్రుడు మాఘస్నాన వ్రతాదులు వలన వానర ముఖమును పోగొట్టుకొనెను కదా! మాఘశుద్ధ ఏకాదశీ మహాత్మ్యమును చెప్పుచున్నాను శ్రద్ధగా వినుము.

పూర్వకాలమునందు దేవతలు రాక్షసులు అమృతము కొరకు పాల సముద్రమును తరచగా అమృతము పుట్టెను. ఆ అమృత కలశమును రాక్షసులు హరించి పారి పోవుచుండగా శ్రీ మహావిష్ణువు మూడు లోకములను మోహింప జేయుగల స్త్రీ రూపమును ధరించి (దీనినే జగన్మోహనావతారమందురు) పారి పోవుచున్న రాక్షసులను ఆపి వారివద్ద నున్న అమృత కలశమును లాగుకొని యిట్లు చెప్పెను.

ఓ రాక్షసులారా! మీరును దేవతలును సమముగా కష్టపడి సంపాదించిన పదార్థమును ఒక్కరు మాత్రమే ఉపయోగించుట తగదు. నేను రాక్షసులైన మీకును దేవతలకును సమముగా పంచి యిచ్చెదను. మీరు ఒకవైపునను దేవతలు మరి యొక వైపునను పంక్తులుదీర్చి కూర్చుండుడు. మీ యుభయుల పంక్తుల మధ్యనుండి మీ హస్తము లందు అమృతము పంచెదను అని చెప్పెను.

ఆ మాధుర్యములైన మాటలకున్ను, రూపము నకున్ను మోహముజెంది మారు మాటపలుకక దేవతలు ఒకవైపునను రెండవ వైపున రాక్షసులున్ను పంక్తులుదీర్చి కూర్చుండిరి. అంతట పంక్తి సాంకర్యము గాకుండునట్లు మధ్యవర్తులుగా సూర్యచంద్రులను నియమించి స్త్రీ రూపముననున్న మాయావిష్ణువు అమృతకలశమును గొను

భాగములుగా జేసినటుల నటించి అమృతకలశమును కుడిచేతిలోనున్న కల్లుతో నిండిన సురకలశము ఎడమచేతిలోనున్న నుంచుకొని దేవతలకు కుడిచేతిలోనున్న అమృత కలశమునుండి అమృతమును పోయుచు రాక్షసులకు ఎడమ చేతిలోనున్న సుర కలశము నుండి సురనుపోయుచు సమముగా పంచిపెట్టుచూ రాగా సింహికయను రాక్షసి పుత్రుడు రాహువు అను రాక్షసుడు మాయారూపమున దేవతల పంక్తిలో కూర్చుండెను. ఆ సంగతి తెలుసుకొనక వాని చేతిలో అమృతమును పోసెను. వాడు వెంటనే నోటిలో బోసుకొనెను. ఆ సంగతి సూర్యచంద్రులు కనిపెట్టి యీ సంగతి మాయా విష్ణువునకు జెప్పిరి. వెంటనే మహావిష్ణువు చక్రముచే వానితల ఖండించివేసెను గాని అమృత స్పర్శనమున వానికి చావు కలుగనందున వాని తలకు కేతువనియు మొండెమునకు రాహువనియు పేరుపెట్టి గ్రహమండలమందు నిలిపిరి. ఆ రాహు కేతువుల పర్వదినములందు తమవిరోధులైన సూర్యచంద్రులను మ్రింగుటకు వెళ్ళుదురు. దానినే మన జ్యోతిష్కులు గ్రహణములని చెప్పుదురు. జగన్మోహిని రూపమునయున్న మహావిష్ణువు దేవతలకు అమృతమున్న రాక్షసులకు కల్లున్న (కల్లును అమృతమనికూడా పిలచెదరు.) సమముగా పంచిపెట్టి దేవేంద్రుని వద్ద అమృతకలశమును రాక్షసులవద్ద సుర కలశమును వుంచి అదృశ్యుడాయెను. పిమ్మట రాక్షసులు కల్లును తమకు మాయావిష్ణువు పంచిపెట్టెనని తెలుసుకుని దేవతలయందు విరోధముగలవారై విచారించుచు తమతావులకు పోయిరి.

పిమ్మట ఆ అమృత కలశమును దేవేంద్రుడు స్వర్గలోకమునందు జాగ్రత్తగా భద్రపరచెను. మాయావిష్ణువు అదృశ్యుడగునప్పుడు అమృతకలశమును దేవేంద్రునివద్ద నుంచెనుగాదా! అటుల అమృత కలశమునుంచిన తావునందు కలశము చెమర్చి భూమియందు రెండు బిందువులు పడెను. ఆ బిందువులు రెండును ఒకటి పారిజాత వృక్షము

గాను, రెండవది తులసిమొక్కగాను పుట్టి పెరుగుచుండెను. ఆ ప్రదేశ
మందు వ్యవసాయము జేసుకొనుచున్న విష్ణుభక్తుడను కాపు ఆ రెండు
మొక్కలను జూచి వాటి సౌందర్యమునకు వింతపడి ఆ మొక్కలకు
చుట్టు కంచివేసి ఆవరణ యేర్పర్చి తక్కిన ప్రదేశమందు పుష్ప
ఫలాదులనిచ్చు మొక్కలునాటి జాగ్రత్తగా పెంచుచుండెను. కొంత
కాలమునకు మొక్కలు పెద్దవై పూవులను పూచుటకు ప్రారంభము
చేసెను. పారిజాత పుష్పముయొక్క ఆకారము అందమునకున్ను పరి
మళమునకున్ను తులసియొక్క అందము పరిమళమునకున్ను వింతపడి
తనయింటియందు విష్ణువును విగ్రహరూపముగా నుంచుకుని నిత్యము
పూజించుచు ఏకాదశి దినంబున ఉపవసించి ద్వాదశి రోజున బ్రాహ్మణు
నకు స్వయంపాకము నిచ్చి బంధుయుక్తముగా భుజించుచు మహావిష్ణు
భక్తి గలిగి భార్యాపుత్రాదులతో సుఖంబుగా నుండెను.

ఇట్లుండగా దేవేంద్రుడు ఒకనాటి కాలమునందు పారి
జాత వృక్షమునున్న వనము మీదుగా వెళ్ళుచు పారిజాత వృక్షము
యొక్క పరిమళమునకు ఆశ్చర్యపడి దిగి పారిజాత వృక్షమును జూచి
కొన్ని పుష్పములు కోసి పట్టుకుని వెళ్ళి శచీదేవికి యిచ్చెను. శచీదేవి
పుష్పముయొక్క సౌందర్యమునకున్ను, పరిమళమునకున్ను వింతపడి
ప్రతి దినము ఆ పుష్పములను తెప్పించవలసినదని కోరెను. దేవేంద్రుడు
శచీదేవి కోరికమీద గుహ్యకుడను నొకనిను బిలిచి భూమండల
మందు గల విష్ణుభక్తుడను కాపు తోటలోని పారిజాత పుష్పములను
ప్రతి దినము కోసి తీసుకుని రావలసినదని ఆజ్ఞాపించెను. దేవేంద్రుని
ఆజ్ఞప్రకారము గుహ్యకుడు విష్ణుభక్తుని తోటకు జని పుష్పములను
దెచ్చుచుండెను. గృహస్థుడు ప్రతిదినము పారిజాతపుష్పములు లేకుండుటకు
విచారించి ఏమియుతోచక తాను ప్రతిదినము విష్ణుదేవుని పూజించిన
నిర్మాల్యమును పారిజాతచెట్టు కొమ్మలయందు పరాకుననుంచి యింటికి
పోయెను. కొంతకాలమునకు మాఘ మాసమురాగా మాధవునకు

ప్రీతికరమైన మాఘమాసము వచ్చెనని సంతోషించి మాఘమాసమున మకరస్నానాధులు జేయుచు శ్రీ విష్ణుదేవుని పూజించుచు సాయంత్రమువరకు ఉపవసించి నక్షత్ర దర్శనముచేసి భుజింపుచుండెను. గుహ్యాకుడు యథాప్రకారము పుష్పములకొరకు వచ్చి చెట్టుకొమ్మల మీదనిలుచుండి పుష్పములను కోయుచుండెను. పుష్పములను కోయు తొందరచే నిర్మాల్యమును జూడక త్రొక్కెను. విష్ణు నిర్మాల్యమును త్రొక్కుటచేత గుహ్యాకునకు ఆకాశగమనశక్తి నశించి ఆ చెట్టు క్రిందనే తిరుగుచు విచారించుచుండెను.

శౌనకాదులారా! విష్ణు నిర్మాల్యమునందు ఎంత మహాత్మ్యము గలదో గుహ్యాకుడు నిర్మాల్యము త్రొక్కుటచేత పూర్వము చేసిన పుణ్యములు నశించి స్వర్గమునకు వెళ్లుటకు సామర్థ్యము లేకపోయెను. దేవతలకే ర్మాల్యమును త్రొక్కుటచేత పుణ్యములు నశించెను గదా! విష్ణునిర్మాల్యమునుగాని, శివ నిర్మాల్యముగాని ఏ దేవతా నిర్మాల్యమునుగాని మనుష్యులు త్రొక్కినయెడల తాము చేసిన పుణ్యములు నశించి పాపాత్ములగుటకు సంశయములేదు. అని సూత మహాముని జెప్పగానే శౌనకాది మహామునులు గుహ్యాకుని చరిత్రను పూర్తిగా జెప్పవలసినదని కోరిరి.

స్కాంధపద్మ పురాణాదులందుగల మాఘ పురాణమను వచన
కావ్యమున ఏకాదశీ మహాత్మ్యమున గుహ్యాకుని చరిత్ర
యిరువది అయిదవ అధ్యాయము

# ఇరువది ఆరవ అధ్యాయము

## ఏకాదశీ మహాత్మ్యము

సూతమహాఋషి జెప్పుచున్నాడు. శౌనకాది మహామునులారా! గుహ్యాకుని చరిత్రను జెప్పుచున్నాను వినుడు.

అటుల గుహ్యకుడు విష్ణు నిర్మాల్యమును త్రొక్కుటచేత స్వర్గమునకు వెళ్ళలేకపోయెను. విష్ణుభక్తుడు ప్రాతఃకాలమున పుష్పములుకొరకు వచ్చి పారిజాత వృక్షము క్రింద తిరుగుచున్న గుహ్యకుని జూచి నీవు ఎవరవు? నీవు దొంగవు ప్రతిదినము నా తోటలో పుష్పములను దొంగిలించుకుని పోవుచున్నావని అడిగెను. ఆ మాటలు గుహ్యకుడు విని నేను దేవేంద్రుని దూతను. నీ తోటయందుగల పారిజాత పుష్పములను ప్రతిదినము తీసుకుని రావలసినదని అజ్ఞాపించినందున నేను తీసుకుని వెళ్ళుచుంటిని.

నీవు ఈ రోజున విష్ణునిర్మాల్యమును చెట్టు కొమ్మలయందుంచితివి. నేను దానిని త్రొక్కితిని. అందువలన నాపుణ్యము నశించి స్వర్గమునకు వెళ్ళలేక యిందుండి తిరుగుచున్నాను అని చెప్పెను. విష్ణుభక్తుడు ఓ దేవదూతా! నేను నీ యెడల అపరాధమును చేసితిని. నీకు అపరాధము జేయుటచేత త్రిలోకములకు అధిపతియైన దేవేంద్రునకు నాయందు ఆగ్రహము కలుగును. అందువలన నాకు యిహపర సౌఖ్యంబులు చెడును. గాన నన్ను కరుణించి నేను మీకొరకు ఏవ్రతమును జేయవలెనో ఆనతిమ్ము. ఆ ప్రకారము వ్రతాదులను జేసి మీకు తగిన సహాయము జేయుదునని జెప్పెను.

గుహ్యకుడు చెప్పుచున్నాడు. ఓ విష్ణుభక్తుడా! నేడు మాఘశుద్ధ ఏకాదశి గాన నీవు నియమము ప్రకారము ఉపవసించి ఆ పుణ్యమును నాకు ధారపోయుము. అందువలన నాకు స్వర్గగమనము కలుగును. నీకీర్తి ముల్లోకములందు వ్యాపించి యుండును అని చెప్పెను.

గుహ్యకుడు చెప్పిన మాటలువిని విష్ణుభక్తుడు యింటికి వెళ్ళి జరిగిన సంగతినంతయు భార్యాపుత్రాదులకు జెప్పి నేడు మాఘశుద్ధ ఏకాదశిగాన మీరందరును యథావిధిగా ఉపవసించి శ్రీమహావిష్ణువును పూజించుటకు నాకు సహాయముగా నుండవలయునని తనభార్యాపుత్రాదులతో చెప్పి యథావిధిగా మాఘ స్నానాదులను జేసి దారా

పుత్రాదులతో గూడా శ్రీమహావిష్ణువును పూజించుచు భజించుచు రాత్రి నాలుగు యామములు జాగరము జేయుచుండెను.

ఈ కథ యిట్లుండగా దేవేంద్రుడు గుహ్యకుడు పుష్పములను తేలేదని విచారించి వేరొక దూతను గుహ్యకుని వద్దకు పంపించి కారణము తెలుసుకొని రావలశినదని చెప్పెను. వాడు భూలోకమునకు వచ్చి గుహ్యకుని జూచి కారణము తెలుసుకొని ఆ సంగతి దేవేంద్రునకు విన్నవించెను. అంతట దేవేంద్రుడు శ్రీ మహావిష్ణువు దగ్గరకు వెళ్ళి నమస్కరించి నిలుచుండెను. అంతట శ్రీ మహావిష్ణువు దేవేంద్రుని కూర్చుండమని జెప్పి నీవు వచ్చిన పనిని జెప్పవలసినదని అడిగెను. దేవేంద్రుడు జెప్పుచున్నాడు. శ్రీ మహావిష్ణువు నీవే. బ్రహ్మ విష్ణు, మహేశ్వర స్వరూపుడవు, సృష్టి, స్థితి లయకారకుడవు, పరదేవతా సమేతుడవైన పరబ్రహ్మ స్వరూపుడవు త్రికాల స్వరూపుడవు అయిన నీకు నేను వచ్చిన కార్యమును జెప్పగలనా ? నీకే సమస్తమును తెలియును. అయినను నీవు కోరితివి గాన విన్నవించెదను.

మహాత్మా ! నాడు నీవు జగన్మోహనావతారమును ధరించి అమృతమును దేవతలకున్ను, సురను రాక్షసులకున్ను సమముగా పంచి ఆ అమృత కలశమును నావద్దనుంచి అదృశ్యుడవైతివి గదా అప్పుడు అమృత కలశమునుంచిన తావునందు అమృత కలశము చెమర్చి రెండు బిందువులు భూమిమీద పడెను. ఆ బిందువులు భూమి మీద పడిన ప్రదేశమునందు ఒక బిందువు నుండి పారిజాత వృక్షమున్ను, రెండవ బిందువునుండి తులసి మొక్కయున్ను పుట్టినవి. ఆ రెండు మొక్కలను ఆ సమీపమందు సేద్యము జేయు విష్ణుభక్తుడను కాపు పెంచి వాటి చుట్టును పుష్ప ఫలాది వృక్షములు వేసి వనముగా జేసి కాపాడుచుండెను. ఆ పారిజాత పుష్పముల కొరకు నేను గుహ్యకుడను నొకరుని బంపగా వాడు విష్ణునిర్మాల్యమును ప్రమాదమున త్రొక్కి స్వర్గగమనమును పోగొట్టుకొనెను, వాడు నీ భక్తుడుగాన వానిని సమ్మతింప

జేసి ఆ పారిజాత వృక్షము స్వర్గలోకము నందుండునట్లు అనుగ్రహించి గుహ్యకుని రక్షింపవలసినదని ప్రార్థించెను.

ఆ మాటలు శ్రీ మహావిష్ణువు ఆలకించి దేవేంద్రుని పంపించి తాను మహాలక్ష్మిని వెంటబెట్టుకొని భూలోకమునందున్న విష్ణుభక్తుని యింటికి వచ్చెను. ఆ విష్ణుభక్తులు దారా పుత్రాదులతో కూడా ఉపవసించి యుండెనుగాన రాత్రి నాలుగవ ఝామునకాగా పూజచేయుటకు వెళ్లి చేతులు జోడించి దారా పుత్రాదులతో గూడా శ్రీ మహావిష్ణువును భజింపుచుండిరి. అంతట శ్రీ మహావిష్ణువు పూజచేయు ప్రతిమనుండి ఉద్భవించి ఓ భక్తుడా ! నీకు కావలసిన వరంబులను కోరవలసినదని చెప్పెను. విష్ణుభక్తుడు అటుల ప్రత్యక్షమయిన శ్రీ మహావిష్ణువును పూజించి మహాత్మా ! నాకు దారా పుత్రాదులతో కూడా ముక్తి నిమ్మని కోరెను. ఓ భక్తుడా ! నీవు చేసిన ఈ మాఘశుద్ధ ఏకాదశి వ్రత పుణ్యమును గుహ్యకునికి యివ్వవలసినదని చెప్పి గుహ్యకునికి యిప్పించి పారిజాత వృక్షమును స్వర్గమునందు నుండునట్లు దేవేంద్రునికి గుహ్యకునిచే పంపించి వేసెను. తులసి మొక్కను తాను పుచ్చుకొని ఓ తులసీ ! నీవు భూలోకమునందు నివసించి నిన్ను పూజించు వారికి సకల కోరికలు యిచ్చుచుండునట్లును, తులసియందుండి పుట్టిన లక్ష్మిని మహాలక్ష్మికి సహోదరిగా నుండునట్లును యేర్పాటు చేసి విష్ణుభక్తుని దారా పుత్రాదులతో కూడా స్వర్గమునకు పంపించి తాను మహాలక్ష్మి సహితముగా గరుడారూఢుడై వైకుంఠమునకు జనెను.

ఓ మునిశ్రేష్ఠులారా ! నాటినుండి పారిజాతమునకు దేవతా పారిజాతమని పేరు గలిగి స్వర్గమునందుండెను. తులసి శ్రీ మహావిష్ణువు తాకిన భాగము కృష్ణవర్ణము గలిగి కృష్ణతులసి యనినిన్ని, తెల్లగానుండు భాగము లక్ష్మి తులసి యనిన్ని కీర్తి పొంది భూలోకమునందు పూజింప బడుచుండెను. సురభాండము వుంచిన కావున పుగాకు గంజాయి మొక్కలు మొలచి అవి రాక్షసులచేత పూజింపబడుచుండెను.

ఓ ఋషులారా ! వింటిరిగదా మాఘశుద్ధ ఏకాదశీలు ఉపవసించుటయందు ఎంతపుణ్యము గలదో ? విష్ణుభక్తుడు దారాపుత్రాదులతో కూడా శ్రీ మహావిష్ణువుచే గౌరవింపబడి స్వర్గ సుఖములను పొందెను.

స్కాంధపద్మ పురాణాదులందుగల మాఘపురాణమును వచన
కావ్యమున గుహ్యకుని చరిత్రయును ఏకాదశీమహాత్యము
యిరువది ఆరవ అధ్యాయము

# ఇరువది ఏడవ అధ్యాయము

## మహాశివరాత్రి వ్రత ఫలితము

శౌనకాది మహామునులు సూత మహాఋషి జెప్పిన మాఘశుద్ధ ఏకాదశీ మహాత్యమును విని ఆనందించి సూత మునీంద్రా మాఘబహుళ చతుర్ధశీ మహాశివరాత్రిగాన శివరాత్రి మహాత్యమున్ను నడపవలసిన నియమములున్ను ఆనతీయ వలసినదని కోరిరి.

సూత మహాముని జెప్పచున్నాడు. పూర్వకాలమునందు వశిష్ట మహాముని దిలీపమహారాజునకు జెప్పిన శివరాత్రి వ్రతము యొక్క మహిమను మీకు జెప్పెదను వినుడు. శౌనకాది మహామునులారా ! శివరాత్రి వ్రతమును జేయువారు త్రయోదశి రోజున రాత్రి భోజనమును జేయక ఇంద్రియ నిగ్రహమును గలవారై ప్రాతఃకాలమున లేచి అనుష్టానములను దీర్చుకుని ఛండాలాదులతో మాట్లాడక వర్ణేతరులను తాకక సమీపమందుగల మహానదికి వెళ్ళి స్నానదానాదులను జేసి నిత్యకృత్యములను దీర్చుకుని పరిశుభ్రములైన వస్త్రములను ధరించి గృహంబునకు వెళ్ళి దేవతార్చనజేయు స్థలమును పరిశుభ్రము జేయించుకుని జలమును జల్లి శుద్ధిచేసి దర్భాస

నాదులను వేసుకుని తూర్పుముఖముగా గాని, ఉత్తరముఖముగా గాని పద్మాసనము వేసి కూర్చుండి భగవంతుని ధ్యానించి అటు పిమ్మట ఆలయమునకు వెళ్ళి శివలింగమునందు గల నిర్మాల్యమును తీసివేసి నీటిచే శివలింగమును శుభ్రముగా కడిగి సంకల్ప విధానముగా భగవంతుని ఆవాహనాదులను జేసి శివలింగమును పాలుచేతను పెరుగుచేతను తేనె పానకములచేతను వేరువేరుగా అభిషేకముచేసి, శుద్ధోదకముచే అభిషేకముచేసి అటుతరువాత పంచామృతముచేతను, నారికేళాదులచేతను అభిషేకముచేసి, ఆఖరున తిరుగా శుద్ధోదకముచే అభిషేకముచేసి, అభిషేకము కాగానే కుంకుమమును శివలింగమున వ్రాసి మంచిగంధము మొదలగు సుగంధ ద్రవ్యములను వ్రాసి పిమ్మట బిల్వపత్రి పుష్పములు మొదలగు వాటిచే పూజించవలెను. పూజచేయునప్పుడు ఈ క్రింది నామములను చెప్పి పూజచేయవలెను. ౧ నిధనపతాంతకాయనమః ౨ ఊర్ధ్వాయనమః ౩ హిరణ్యాయనమః ౪ సువర్ణాయనమః ౫ దివ్యాయనమః ౬ భవాయనమః ౭ శివాయనమః ౮ శర్వాయనమః ౯ జ్వాలాయనమః ౧౦ ఆత్మాయనమః ౧౧ ఉగ్రాయనమః ౧౨ భీమాయనమః ౧౩ శంకరాయనమః ౧౪ మహేశాయనమః ౧౫ ఈశానాయనమః ౧౬ భూతానాంపతయేనమః ౧౭ చంద్రశేఖరాయనమః ౧౮ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరాయనమః అని యిట్లు శివనామములను జెప్పి పూజించి ధూప, నైవేద్య దీపముల నిచ్చి, నీరాంజనాదులనిచ్చి సాష్టాంగ నమస్కారము చేయవలెను. లేచి శివలింగ సమీపమందు నిలుచుండి ఓ ఈశ్వరా! నాచేత సమర్పింపబడిన పూజాదులచే పార్వతీ పరమేశ్వరులైన మీరు సంతోషించి నాయొక్క జ్ఞాన, అజ్ఞానాదులచే చేయబడిన సకల పాపంబులను నశింపచేసి దుఃఖములను, రోగములను, దరిద్రమును, మనస్సునందు గల సకల విచారములను పోగొట్టి నన్నును నా దారాపుత్రాదులను అనుగ్రహింపుము. అని ప్రార్థించవలెను, తరువాత సంకల్ప పూర్వకముగా శక్తి కొలది బ్రాహ్మణులకు సకల దానములను జేయవలెను.

అటుల పూజాదులను జేసి మాఘ పురాణమును అంతయుగాని లేని యెడల ఈ శివరాత్రి మహాత్మ్యమును గాని చదివించి ఈశ్వర సంబంధమగు పురాణములను గాని, విష్ణుసంబంధమగు పురాణములను గాని, దేవీ భాగవతమును గాని చదివించి నిర్మలమైన మనస్సు గలవాడై వినవలయును. ఈ ప్రకారము పగలు నాలుగుయామములు రాత్రి నాలుగు యామములు జాగరము జేయవలెను. రాత్రి నాలుగు యామములు శివుని పూజింపుచుండవలెను. ఈ క్రమముగా శివరాత్రిభోజన వ్రతము జేసి మరునాడు అరుణోదయ కాలమందు లేచి కాలకృత్యములను దీర్చుకొని బ్రాహ్మణయుక్తముగా భుజింపవలెను. పిమ్మట యితర వర్ణాదులైన దైవభక్తులకున్ను, దిక్కులేని వారికి, గ్రుడ్డివారికి, కుంటి, మూగ, చెవిటి, అవయవ హీనులు, ముసలగు, కష్టపడి జీవింపలేని అశక్తులకు తనకు గల శక్తిని బట్టి భోజనము పెట్టించవలెను. అటు పిమ్మట బంగారము, ఇండ్లు, గోవులు, భూములు, ధాన్యము, వస్త్రము, సాలగ్రామము మొదలగునవి బ్రాహ్మణులకు దానము చేయవలెను, ధనము గలవారు తనకున్న ధనమును బట్టి దానము చేయవలెను. గాని, లోభించరాదు. దరిద్రుడు తనకు తగినట్లు దానమును చేయవలెను. గాని గొప్పకుపోయి నశింపరాదు. ధనమును దానధర్మముల క్రింద బ్రాహ్మణులకే యియ్యవలెనుగాని యితర వర్ణములవారికి యియ్యరాదు. యితర వర్ణములవారికి భోజనము పెట్టవచ్చునుగాని ధనమును యిచ్చిన ఆ ధనముతో వారు చేయు పాపంబులలో సగము పాపఫలము కర్తకు జేరును. గాన ధనమును మాత్రము యియ్యరాదు.

ఈప్రకారము శివరాత్రి వ్రతమును ఆచరించిన యెడల వారికి మహాశివరాత్రి ఫలము పూర్తిగా వచ్చును. ఎవ్వరైనను శివరాత్రినాడు ఉపవాసము జేసి రాత్రి జాగరము జేయుదురో వారు పూర్వ జన్మమునందును ఈజన్మమునందును చేసిన పాపంబులు పోగొట్టుకొని సుఖములను పొందుదురు.

మగవాడు గాని ఆడది గాని వివాహము కొరకు శివరాత్రి వ్రతముజేసిన వివాహము అగును. ధనము గోరువారికి ధనమున్ను, విద్యను గోరువారికి విద్యయున్ను, సుఖము గోరువారికి సుఖమున్ను, సంతానము గోరువారికి సంతానమును ఎవరు ఏది కోరి శివరాత్రి వ్రతమును జేయుదురో, వారు కోరిన కోరికలను నెరవేర్చుకొని సుఖంచెదరు. ఎచ్చట శివరాత్రి మహాత్మ్యమును గాని, మాఘ మహాత్మ్యమును గాని చదువుదురో అచ్చట పార్వతి సహితముగా ఈశ్వరుడున్ను, ఈశ్వర గణములున్ను, నంది గణములున్ను నివశించుదురు. యిందుకు సందేహము లేదు.

ఈ శివరాత్రి మహాత్మ్యముగల మాఘ పురాణమును నిత్యము ఎవరు చదువుచుందురో, వారు పార్వతి పరమేశ్వరుల అనుగ్రహము వలన అపమృత్యువులు, అరిష్టములు, దుఃఖములు, దరిద్రములు, గ్రహ, పిశాచ, బాధలు, నశించి ఆయురారోగ్య ఐశ్వర్యములతో దారా పుత్రాదులతో సుఖంబుగా నుండెదరు. అంతమందు శివ సాయుజ్యమును పొందుదురు.

స్కాంధ పద్మ పురాణాములందు గల
మాఘపురాణమను వచన కావ్య
మున శివరాత్రి మహాత్మ్యము
ఇరువది ఏడవ అధ్యాయము

# ఇరువది ఎనిమిదవ అధ్యాయము

## మాఘమాస ప్రభావము

సూత మహాముని జెప్పుచున్నాడు. ఓ శౌనకాది మహామునులారా! పూర్వము వశిష్టుడు దిలీపునకు జెప్పిన శివరాత్రి మహాత్మ్యమును జెప్పితిని వింటిరికదా.

ఇప్పుడు దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునకు జెప్పిన మాఘ మహాత్మ్యమును మీకు జెప్పెదను శ్రద్ధగా వినుడు. ప్రత్యక్ష విష్ణువైన దత్తాత్రేయ మహాముని సహ్యాపర్వతమునందు ఉండగా మాహిష్మతీ పట్టణమునకు రాజైన కార్తవీర్యార్జునుడు ఆ దత్తాత్రేయ మహాముని వద్దకు పోయి ఆయన పాదంబులకు మ్రొక్కి ఓ మునిశ్రేష్ఠా ! నీయొక్క అనుగ్రహాము వలన అన్ని ధర్మములను వింటిని. ఇంక మాఘస్నాన ఫలమును సెలవిమ్ము అని యడిగెను.

ఆ కథను మీకు వినుపించుచున్నాను. ఈ భరతఖండమునకు కర్మ భూమి యని వేదములు, బ్రహ్మఋషులు జెప్పుచున్నారు. కర్మభూమి యయిన ఈ భరతఖండమునందు, పుణ్యక్షేత్రములయందు ఎట్లు నియమముగా నుండవలెనో ఆ ప్రకారముగా నున్నను పుణ్యతీర్థములయందు స్నానము జేసినను శ్రాద్ధములు పుణ్యకాలములు చేసినను విశేష పుణ్యము కలుగజేయునుగాని ఎన్ని పుణ్యకార్యములు జేసినను మాఘస్నానము జేయని మనుష్యుని జన్మము నిరర్థకమగును. మాఘస్నానమును చేయని మానవుడు చేయు కర్మలు అన్నియు సూర్యుడు లేని ఆకాశము చంద్రుడు లేని నక్షత్ర మండలము యెటుల ప్రకాశింపవో అటులనే సూన్యములగును.

శ్రీ విష్ణుదేవుడు మాఘస్నాన మాత్రము చేతనే సంతోషించునట్లు వ్రతముల చేత గాని, దానముల చేతగాని, తపస్సుచేత గాని సంతోషింపడు. మాఘస్నానము జేయని యెడల చక్కగా బలసియు, బలము గలదియు, శాశ్వతము కానిదియు నైన యీ దేహముచేత యేమి ప్రయోజనము గలదు. ఎముకలనెడి స్తంభముల చేత కూర్చబడినదియు నరముల నెడి త్రాళ్ళచే కట్టబడినదియు మాంసము చేతను రక్తము చేతను పూయబడినదియు తోలుచే కప్పబడినదియు చెడ్డకంపుగల మూత్రపురీషములకు ఆధారమైనదియు మనోవ్యధ, దుఃఖము, ముసలితనముచే కూడినదియు, రోగములకు యిల్లు అయినదియు, రోగములు

వలన బాధ గలదియు సత్యము కానిదియు, అన్ని దోషములకు ఆధార మైనదియు, సంకటములను కలుగ జేయుటయందు ఆసక్తి గలదియు, చెరుపును జేయుటచేత అసహ్యమును పుట్టించునదియు, మిక్కిలి చపల స్వభావము గలదియై కొండెములు జెప్పుటయందును, క్రూరమైనదియు, దయ, దాక్షిణ్యములు లేనిదియు, పగపును బాధను, చెడ్డను కలుగ జేయునదియు, అధ్యాత్మిక, అధిభౌతికము, అధిదైవికము అనెడి మూడు విధములైన తాపములతో గూడినదియు, స్వభావముగా ధర్మముచేత తక్కువ గలదియు, ఆశలచేత కలవరముగల మనస్సుకలదియై యున్నది. కామ క్రోధములతో గూడి నరకమునకు మార్గము గలిగి నటువంటిది. తోలుతిత్తియిది. కుక్కలు, నక్కలు, గ్రద్దలకు హోమ ద్రవ్యమువంటిది అటువంటి అశాశ్వతమైన దేహము మాఘస్నానము చేయక పోవుట చేత వ్యర్థమై పోవుచున్నది. నీటిలోని బుగ్గవలె జంతువుయొక్క పొంగవలె మాఘస్నానము చేయని దేహము నశించుటకే పుట్టినది. హరిహరాదులయందు భక్తిలేని మనుష్యుడును, దక్షిణలేని వ్రతమును, బ్రాహ్మణ రక్షలేని రాజ్యపాలనము, ఆచారములేని కులము, లోభ ముతో యిచ్చిన ధర్మము, చెడిపోవును. కోపముచేత తపస్సును, గ్రంథములను చూడక పోవుటచేత తెలివియు పరాకుగా నుండుటచేత ధనమును పిసిమిటియందు భక్తి లేక పోవుటచేత ఆహారము నియమము లేక పోవుటచేత బ్రహ్మచారియు నశింతురు.

మండని నిప్పునందు నెయ్యి హోమమును చేయుటయు ఒంటరిగా జేయు భోజనమును ఒకరిపై ఆశ్రయించు బ్రతుకువాని జీవితమును ధనముగలవానికి దానమిచ్చుటయు శూద్రుని యాచించి యజ్ఞము చేయుటయు అలవాటు చేయని విద్యయు ఎందుకును పనికిరావు.

ప్రజలతో విరోధపడి చేయురాజు పరిపాలన నశించును. అసత్యము పలుకుటచేత మాటయు దేవుడు లేడని వాదించుట చేతను తపస్సు ఫలించునో ఫలించదో అని సందేహముతో జేయు మంత్ర

మున్ను వ్యర్థములగును. ఆలాగుననే మాఘస్నానమును చేయని మనుష్యుని జన్మము వ్యర్థము. పుట్టిపెరిగి నశించు కుక్కగొడుగువలె నుండును.

సూర్యుడు మకర రాశియందుండగా మాఘమాసమునందు సూర్యోదయము అగుచుండగా స్నానమును జేయనివాడు ఎటుల పాపములను పోగొట్టుకొని పుణ్యాత్ముడగును. ౧ బ్రహ్మహత్య చేసినవాడును, ౨ ధనమును దొంగిలించినవాడును, ౩ కల్లుత్రాగినవాడును, ౪ బ్రాహ్మణ భార్యను పొందినవాడును, ౫ వీరితో స్నేహము చేసినవాడును, వీరికి పంచమహాపాతకులని పేరు. ఇటువంటి మహాపాపములు కూడా మాఘ స్నానమును జేసిన యెడల నశించి పోవును. మాఘ స్నానమునందు బ్రహ్మహత్యాది మహాపాపములను చేసిన ఎవరుగాని మాయందు స్నానము చేయుదురో వారిని పవిత్రులనుగా చేయుదుము అని జలములు మొరబెట్టుచుండును. ఏవే పాపములు గలవో వాటినన్నిటిని మాఘస్నానము చేసిన మనుష్యునియందు భస్మములై పోవుచున్నవి. అన్ని పాపములు మాఘ స్నానము చేసిన ఎడల పాపములు నశించి అగ్నిహోత్రమువలె ప్రకాశించును. మనోవాక్కాయములచే చేయబడిన సకల పాపంబులు అగ్నిహోత్రములో వేయబడిన కట్టెవలె మాఘ స్నానమున భస్మములై పోవుచున్నవి. అన్ని పాపములకు ఉత్తమమయిన ప్రాయశ్చిత్తము మాఘ స్నానమే గాని వేరు మార్గములేదు. మాఘమాస స్నాన వ్రతాదులు చేయుటకు జన్మాంతరము నందు చేసిన పుణ్య పాపములచేతనే బుద్ధి పుట్టవలయును గాని యితరులు చెప్పిన బుద్ధి పుట్టదు. మాఘస్నానమును జేయువారు సూర్యచంద్రులవలె ప్రకాశింతురు.

ఓ రాజా ! మాఘ స్నానముయొక్క ప్రభావమును తెలియజేయగల కథ కలదు దానిని చెప్పెదను. అని యీవిధముగా దత్తాత్రే

యులు కార్తవీర్యార్జునకు జెప్పిన యితిహాసమును సూత మునీంద్రుడు శౌనకాది మహామునులకు జెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘపురాణమును
వచన కావ్యమున మాఘమహాత్యమను దత్తాత్రేయులు
కార్త్యవీర్యార్జునకు జెప్పిన యితిహాసము
ఇరువది ఎనిమిదవ అధ్యాయము

# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

## ఋషికయను బ్రాహ్మణ కన్యక వృత్తాంతము

సూత మహాముని జెప్పుచున్నాడు. శౌనకాది మహా మును లను జూచి దత్తాత్రేయులు కార్త్యవీర్యార్జునకు జెప్పిన ఋషిక యను బ్రాహ్మణ కన్యక వృత్తాంతము ఇటుల జెప్పుటకు ఆరంభము చేసెను.

పూర్వము భృగు వంశమునందు బుట్టిన ఋషికయను పేరుగల బ్రాహ్మణ కన్యక కలదు. ఆ చిన్నది వివాహము అయిన కొలది కాల మునకే వైధవ్యము వచ్చినందున దుఃఖమును ఆపుకొనలేక తల్లిదండ్రు లందును, గృహాదులందును, సంసారమునందును, విరక్తి గలిగి వింధ్య పర్వతమునకు వెళ్ళి నర్మదానదికి ఉత్తరగట్టున, కపిలా నది జేరునట్టి తావున ఆశ్రమము యేర్పరుచుకుని దేహమునందు అభిమానము వదిలి మితాహారియై ఇంద్రియములను జయించి కామ క్రోధాదులను విస ర్జించి శ్రీ మహావిష్ణువును అతినియమముతో ధ్యానించుచును కృచ్ఛ్రము మొదలగు వ్రతాదులు జేయుచు, జీవము నిలుచుటకు మాత్రమే ఆహారమును తినుచు తపస్సు చేయుచుండెను. ఆ తపము జేయు ప్రదేశము నర్మదా కపిలా నదులు కలయు చోటు గాన నిర్వి ఘ్నముగా తపము జేయుచుండెను. ఈ విధముగా అరువది మాఘ మాసములు స్నాన వ్రతాదులు జేయుచు తపంబు జేయుచుండగా

కొంత కాలమునకు దేహము చాలించి ఋక్షకన్యక తాను జేసిన మాఘ స్నాన మహాత్మ్యమున విష్ణులోకమునకు వెళ్ళి అనేక వేల పరిచారిక లతో సేవింపబడుచు సుఖంబుగా నుండి సూర్యలోకమునకు వెళ్ళి అచ్చట కొంతకాలముపుండి బ్రహ్మలోకమునకు వెళ్లెను. బ్రహ్మ ఋక్షకను జూచి ఆమె చేసిన ఘోరతపమునకు సంతోషించి దేవ కార్యార్థమై తిలోత్తమ అనెడి పేరుతో అప్సరస స్త్రీగా సృజించి సత్య లోకమునందే ఉండవలశినదని చెప్పెను.

ఆమె చేసిన మాఘ స్నానాదుల వలన కలిగిన పుణ్యముచేత అయోనిజగా పుట్టెను. తాను సృజించిన తిలోత్తమ యొక్క సౌంద ర్యాది విశేషములకు ఆనందించుచుండెను. యిటుల నుండగా సుందోప సుందులను యిద్దరు రాక్షస సోదరులు బ్రహ్మచే వరమును పొంది మూడులోకములను బాధించుచుండిరి. దేవతలు సుందోప సుందుల బాధలను సహింపలేక ఒకనాటి కాలమునందు దేవేంద్రాది దేవతలు బ్రహ్మవద్దకు వచ్చి సుందోప సుందులు పెట్టెడి బాధలు నివారింప వల శినదని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మ సుందోప సుందులను సంహరించు టకు ఉపాయము ఆలోచించి తిలోత్తమను పిలిచి నీవు నీ చాతుర్య ముచే సుందోప సుందులను సంహరింపుమని చెప్పి పంపించెను.

తిలోత్తమ బ్రహ్మవద్ద అనుజ్ఞ తీసుకొని వీణను ధరించి ఆ రాక్ష సులు నివశించు వింధ్య పర్వతమునకు జని నర్మదానది గట్టున నున్న అశోక వనమునందు తిరుగుచు వీణ వాయించుచు మూడు లోకము లను మోహింప జేయగల కాంభోజ మొదలగు రాగ స్వరములతో పాడుచుండెను. కొందరు రాక్షసులు వింధ్య పర్వతమునందు తిరుగుచు వీణాగానములను విని ఆనందించి ఆ గాన మార్గమున వెదకుచు వెళ్లి అశోక వృక్షముల తావున పాడుచున్న తిలోత్తమను జూచి రూప లావణ్యాదులకు గాన మాధుర్యమునకు మోహాపరవశులై తమ నాయకులైన సుందోప సుందులకు ఆమె వృత్తాంతమును విన్నవించిరి.

అప్పుడు సుందోప సుందులు వెయ్యి బారువులు భారముగల రెండు గదలను యిద్దరు ధరించి తిలోత్తమ వద్దకు వచ్చి నన్ను పెండ్లాడుమని మొదటి వాడును నన్ను పెండ్లాడుమని రెండవ వాడును కోరిరి. అంతట తిలోత్తమ వారి ఆకారములను పరవశత్వమును గ్రహించి ఓ రాక్షస రాజులారా! మీలో ఎవరు గొప్పవాడో వారిని వరించెదనని చెప్పెను

ఆ మాటలు విని నేను గొప్పవాడనని మొదటి వాడును నేను గొప్పవాడనని రెండవ వాడును చెప్పుకొనుచు తుదకు యిద్దరకు కోపములు అధికముకాగా గదా యుద్ధమునకు ప్రారంభమును జేసిరి. కొంతవరకు గదా యుద్ధమును జేసి పిమ్మట ముష్టి యుద్ధమునకు దిగి కొంతసేపటికి ప్రాణములు విసిగి కోపములు హెచ్చి పర్వతములు పెకలించి కొట్టుకొనుచు యీ ప్రకారము పది అహోరాత్రములు యుద్ధమును జేసి అటుతరువాత తిరిగి యుద్ధము జేయుచుండగా తమ్ముని కత్తి అన్న కంఠమును, అన్నకత్తి తమ్ముని కంఠమును ఖండించగా యిద్దరును ఏక కాలమునందే మడిసిరి. తమ నాయకులు చచ్చుట చేత రాక్షస మూకలు చెలరేగి క్రోధము గలిగి యీ దుష్టురాలు వలన మన నాయకులు చచ్చిరని కేకలు వేయుచు అర్చుచు గదాది సాధనములను తీసుకొని తిలోత్తమను కొట్టుటకు వచ్చిరి. అంతట దేవేంద్రుడు వజ్రమున రాక్షసులను సంహరించి తిలోత్తమను జూచి ఓ సుందరీ! నీయొక్క చాతుర్యముచే దేవతలకు అజేయులయిన సుందోప సుందులను దుష్ట సహోదరులను సంహరించితివి కాన నేను లగాయితు భూలోకమునందు కాంతా కనకంబుల కొరకు ఎంతటి స్నేహము గలవారైనను సుందోప సుందులువలె నశింతురు గాక యని చెప్పి తిలోత్తమను పొగడి స్వర్గమునకు వెళ్ళెను. తిలోత్తమ సుందోప సుందులు రాక్షస సేనలు నశించుట జూచి బ్రహ్మ ఆజ్ఞను నెరవేర్చితిని గదా యని సంతోషించి సత్యలోకమునకు వెళ్లి బ్రహ్మకు విన్నవించెను.

అటుల తిలోత్తమ దేవతా కార్యమును తన చాతుర్యము చేత నెరవేర్చెను గదా యని సంతోషించి ఓ తిలోత్తమా నీవు దేవతా కన్యలలో పూజ్యురాలవైతె సూర్యుడు ఆకాశమార్గమున ఎంత కాలము సంచరించుచుండునో అంత కాలమును నీవు సూర్యుని రథమునందు సంచరించుచు సూర్యుని వలన గౌరవించ బడుచుందువని వరంబులనిచ్చి సూర్యలోకమునకు పంపించివేసెను. ఈ ప్రకారము దత్తాత్రేయుడు కార్త్యవీర్యార్జునునకు చెప్పిన యితిహాసమును సూత పౌరాణికుడు శౌనకాది మహా మునులకు జెప్పెను.

స్కాంధ పద్మ పురాణాదులందు గల మాఘ పురాణ
మను వచన కావ్యమున ఋషికన్య యును
బ్రాహ్మణ కన్యక వృత్తాంతము గల
యిరువది తొమ్మిదవ అధ్యాయము

# ముప్పదవ అధ్యాయము

## మాఘమాస మహాత్యఫలస్తుతి

సూత మహాఋషి జెప్పుచున్నాడు. ఓ శౌనకాది మహా మునులారా మాఘమాస స్నాన వ్రతాదులను వాటి ప్రభావమును వింటిరి గదా! మీరు ఎన్నడును పాషండులతో భాషింపకుడు. పాషండ మతస్థులను తాకకుడు. అని చెప్పగానే పాషండులు యెటువంటి వారని అడిగిరి. పాషండులు అనగా ఒక్క శివుడే ప్రపంచకమున నున్నాడని వాదించు యితర మతములను దూషింపుచు నదులకు సముద్రము ఆధారమైనట్లు అన్ని మతములకు శైవదీక్షయే ఆధారమని జెప్పుచు ఒక జడ, రెండు జడలు మూడు, నాలుగు, అయిదు, జడలను ధరించి వేదములను యజ్ఞములను మతములను దూషించుచుందురు. వీరిని పాషండు

లుందురు. ఆచారము లేదు. మతములు కులములు లేవు. ఆడ మొగ అని సృష్టిలో వున్నవే గాని తరువాత వచ్చినవారి వావివరుసలు లేవు అని చెప్పుచు బూడిద పూసుకుని తిరుగుచు పాపము పుణ్యము నరకములు గాని దేవుడుగాని లేదని వాదించుచుందురు. వీరే పాషండులు. వీరు ప్రమాదమున పాషండులతో మాట్లాడినను తాకినను మాఘస్నాన వ్రతాదుల వలనగాని పవిత్రులు గాజాలరు. మాఘమాసమునందు కాలు జారి బురద నీటిలో పడి తడిసినను పుణ్యము గలుగును. అన్ని యుగములలోను అన్ని మాసములలోను కలియుగమున మాఘ మాసవ్రత దానాదులకు తగిన పాపములకు ప్రాయశ్చిత్తము వేరుగా లేదు. అని సూత మహాఋషి చెప్పి లేచి నిలుచుండి ముని సంఘమునకు ముమ్మారు ప్రదక్షిణ నమస్కారములను జేసి, చేతులు జోడించి, ఓ బ్రాహ్మణాది మహామునులారా ! మీకొరకు నాచే చెప్పబడిన ఈ మాఘపురాణమును మాఘ మహాత్మ్యము ఎవరు విని చదివి ఆచరించెదరో వారు అదివరకు చేసియున్న అన్ని పాపములను పోగొట్టుకొని సుఖించెదరుగాక అని నమస్కరించి కూర్చుండెను.

పిమ్మట శౌనకుడను మహాముని లేచి, ఓ మహామునులారా ! ఈ సూతమహాముని చెప్పిన మాఘమాస వ్రతదానాదుల ప్రభావమును ఆ ప్రభావాదులు తెలియు జేయు యితి హాసములో ప్రత్యక్ష నిదర్శనములతో గౌతమ నారదాది మహామునుల సాక్ష్య సాధనములతో జెప్పియున్నాము గాన యీ మాఘమాస వ్రతము మకర సంక్రాంతి మొదలు కుంభ సంక్రమణము వరకుగాని, మాఘశుద్ధ పాడ్యమి మొదలు అమావాస్య ఆఖరు వరకుగాని గల ముప్పది దినములు మాస నియమమును జేసి స్నానములను జేయుచు మాఘ పురాణమును రోజునకు ఒక అధ్యాయము చొప్పున ముప్పది దినములు విని ఆఖరున దాన ధర్మములను జేసి బ్రాహ్మణ యుక్తముగా భూతతృప్తి కొరకు మృష్టాన్న భోజనమును బెట్టి సంతర్పణ జేసిన వారు తమ కోరికలను నెరవేర్చుకుని ఇహమునందు సకల సుఖములు అనుభవించి పిమ్మట స్వర్గ

మునకు వెళ్లి సకల సుఖంబులు అనుభవించెదరు. ఇందులకు సందేహము లేదు. మహామునులారా ! ఈ మాఘ స్నానము జేయు వారు సూర్యోదయమయిన ఘడియ ప్రొద్దు యెక్క వరకు స్నానమును జేసిన సకల పుణ్యములను పొందుదురు. ఈ మాఘస్నానము ను జేసి బ్రహ్మ సృష్టికర్త యయ్యెను. శ్రీ మహావిష్ణువు మాఘ స్నానమును జేసి శ్రీ మహాలక్ష్మిని భార్యగా బడసెను. ఈశ్వరుడు మాఘ స్నానమును జేయుటచేతనే పార్వతిని భార్యగా బడసి త్రిపురాసురులను సంహరించెను. భరద్వాజుడను మహాముని మాఘ స్నానమును జేసి సప్త మహాముని మండలమున జేరి కీర్తిబడసెను. పాండవులు మాఘ స్నానాదులను పన్నెండు సంవత్సరములు వ్రతములను జేసి భారతయుద్ధమున కౌరవులను సంహరించి సామ్రాజ్యమును పొంది సకల సుఖంబులను బడసిరి. ఓ ఋషిపుంగవులారా ! దేవతలు మహాత్ములు మొదలగు అనేకులు ఈ మాఘ మాస నియమిత వ్రత స్నానాదులను జేసి ఫలితములను పొందియుండగా మనుష్యులు ఆచరించి సకల కోరికలను పొందుటకు వింతలేదు. ఏ కార్యమయినను సంశయము గల మనస్సు గలిగి జేసిన యెడల నెరవేరదు. సంశయము లేక దృఢ సంకల్పముతో జేసిన యెడల సకల ఫలములను పొందుదురు.

ఆ. కర్మతంత్రుడగుచు, కమలాక్షుగొల్చుచు, నుభయ నియతి వృత్తి నుండెనేని జెడును, గర్మమెల్ల శిథిలమై మెల్లన ప్రబలమైన విష్ణుభక్తి చెడదు, అని భాగవతమునందు శ్రీ శుకులు జెప్పియున్నారు. నిశ్చల భక్తి శ్రద్ధలతో జేయు వారికి.

కం. చెడుగరులు హరులు ధనములు చెడుదురు నిజ సతులు సుతులు చెడు చెనటులకుం జెడకమను వెఱసు గుణులకు జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్, అనిన్ని జెప్పబడియున్నది. కాబట్టి ఈ మాఘ మాస వ్రత స్నానాదులను భక్తి నియమములతో ఆచరించి

పాప రహితులై సకల భోగంబులు అనుభవించి స్వర్గ సుఖంబులను పొందుదురు. గాక యని శౌనకుడు చెప్పి కూర్చుండగానే మహా మునులు అందరును యేక వాక్యముగా మాఘ మాస వ్రత స్నాన దానాదులు ప్రతి మనుష్యుడున్ను నిశ్చయమయిన మనస్సుతో జేసి ముక్తి పొందుదురుగాక యని ఆశీర్వదించిరి.

స్కాంధ పద్మ పురాణాములందు గల మాఘ పురాణ
మను వచన కావ్యమున మాఘ మాస
మహాత్యము యొక్క ఫలస్తుతి గల
ముప్పదవ అధ్యాయము

(గద్య) ఇతి శ్రీ వేమూరి సూర్యనారాయణ సిద్ధాంతి వర్యగురు
కటాక్షలబ్ధ శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరవర ప్రసాద
వోలేటివంశ పారావారశశాకర సుధాకరస్య సంజీవ
రాయామాత్య పౌత్ర రామయామాత్య తృతీ
య పుత్రస్య బుధజన విధేయ వెంకట
లక్ష్మి నరసింహాశర్మ ప్రణీత స్కాంధ
పద్మ పురాణాములందు గల మాఘ
పురాణమను వచన కావ్యమున
మాఘ మాస మహాత్యము
యొక్క ఫలస్తుతి గల
రెండవభాగము
సంపూర్ణము

శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమహేంద్రవరము.